# శోభావతి.

(సాంఘికనవల)




గ్రంథకర్త్రి

అ. పె. పిరాట్టమ్మ.

చెన్నపురి.





ప్రొద్దుటూరు. జానకీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1924





వెల. [illegible]

# అంకితము.

అఖండశాంత శమదమాది మహాగుణముల కాశ్రయ
మైన యేవిద్యానిధితోడి సహధర్మచరణ విశేషమువలన నాయొ
కింత యక్షరజ్ఞానము స్థిరరూపమును దాల్చెనో, మందభాగ్యురా
లనగు నేను దిక్కులేని బిక్కలదాననై దురపిల్లు వలసిన చెడ్డదిన
ములు సంప్రాప్తమై నాభూలోకనందనోద్యాన కల్పవృక్షమైన
యేపుణ్యపురుషుని కొలఁది మాసముల క్రిందటఁ గోలుపోఁ
ఖ భాజనురాలనైతినో, ఇట్లు దివంగతుఁడైన నాజీవితేశ్వరుఁ

## శ్రీమాన్ ఏ. నమ్మాళ్వారయ్య, బి. ఏ.

గారి దివ్యమంగళ యశోమూర్తికిఁ గన్నీటిధారతోఁ బాదములు
కడిగి యీదీనురాలి స్వల్పసేవా శేషమును గ్రహింపవేఁడుచు
కృతినంకితము సేయుచున్నాను.

ఇట్లు, పాదసేవకురాలు
అ. పె. పిరాట్టమ్మ

# పరిచయవచనము.

—o—

ఉత్తమ వర్గమునకుఁ జేరిన యీగ్రంథరత్నము నాంధ్రలోకమునకుఁ బరిచయ మొనర్పఁగల యనకాశ గౌరవము పొలికుఁడనైన నాకుఁ లభించినందులకుగాను సర్వేశ్వరునకును దయానిధియునైన పరమేశ్వరుని దెస వికసితహృదయముతోను కృతజ్ఞతాంకితహస్తములతోను వందనము చెల్లించుచున్నాను.

ఈగ్రంథమునను త్తమగృహిణీ లక్షణములకుఁ బ్రబలనిదర్శనమై శోభించిన ముఖ్యవ్యక్తి శోభావతి. ఈమె కుంభకోణమున నొక సంపన్న బ్రాహ్మణ గృహస్థునకుఁ బుణ్యరాశిగ నవతరించిన యేక సంతానమును, తంజావూరున ధనజనములు గల యొక యింటి పెద్ద కోడలును. అత్తింటఁ బ్రవేశించుటతో నీమె సౌశీల్యము పరిస్ఫుటముగ [illegible]ంచెను. ఒరుగురాతి మీఁదఁ [illegible]

[illegible] మయ్యదు[illegible] మయున్న [illegible] శోభావతీదేవి కష్టప్రకరణములను బారకుఁ డశ్రుపూరితనేత్రములతోఁ జదువకతీరదు. శోభావతీదేవియందుఁ గానవచ్చిన సహనము, పరము, లోకోత్తర ప్రశంసనీయము. గృహము శ్మశానముగనైన స్వర్గముగనైన బరివర్తింపఁ జేయఁగలదియైన నారీలోకమునకు శోభావతీదేవి సుగుణములు మఱువక మననముచేసి నేర్చుకొనదగినవి. ఏదేశమైన నభివృద్ధికి రావలయుననిన, ముందుగ నందలి స్త్రీసంతానము జ్ఞానవికాశము నంది బాగుపడవలయునని పెద్దలు ద్బోధించుచున్నారు. గుణవతియు సర్వదా తనకు విధేయురాలునైనసాధ్వి నంతకూరముగ కటికవాగు గూడ జాలిపడునట్లు హింసించిన దుర్మార్గుఁడైన పట్టాభిరామయ్యయందుఁ గలిగినమార్పు పాఠకప్రపంచము నాశ్చర్యానం

దనిమగ్నముగఁ జేయును. పశ్చాత్తప్త హృదయమునుండి యుబికి ప్రవహించు ప్రేమవాహిని సొంపును పట్టాభిరామయ్యయందుఁ బాఠకులు రెప్పార్చకుండ నూపిరి విడువకుండ సందర్శింపగలరు. ఇందు కరుణరసము పొంగి పొరలుచుండును, శృంగార రసమునకును దనివిదీరఁ గావలసినంత దూరము స్థలమీయఁబడినది. సభ్యమైన శృంగారరసమునొక్క విలువ నీపుస్తకమున గుర్తింపఁగలము. ఇందనేక సద్గృహ సజ్జన మర్యాదావిశేషము లింపుగ వర్ణింపఁబడినవి. ఇందలి వ్యక్తుల సంభాషణములు కడుహృద్యములు. పుస్తకములోఁ జెప్పఁబడినవిషయములు పాఠకుల మనసున మూర్తీభవించుచుండును. ఈ గ్రంథమును బఠించునప్పుడు గ్రంథము మనచేతిలో నున్నదని కాదు, గ్రంథములో మనమున్నామనియే తలంపక తప్పదు. మధుర భావోపేతమును, సర్వజన సుగ్రాహ్యమగు నిసర్గమృదుశైలియుఁగల యీకృతివతంసము విషయమునుబట్టి యుత్తమ చరిత్రమనియు, రచననుబట్టి రసవత్కావ్యమనియుఁ బేర్కొనఁదగు. జ్ఞానదాయకమై యుత్తమజీవిత సంపాదనమునకుఁ దోడుపడు నీపొత్తము పాఠశాల యందే కాదు, ప్రతిగృహమునుండి ప్రతిస్త్రీపురుష వ్యక్తుల హస్తకమలముల నలంకరింపఁదగినది యని చెప్పుటకు సందేహము లేదు. అక్షరజ్ఞులుగాని వారితరులవలనఁ జదివించుకొని అక్కరతో వినఁదగినది భారత భాగవత రామాయణాది గ్రంథములవలె నియ్యదియుఁ బురాణగోష్ఠి జరుపుచుండిన యెడల బహుజనోపకారము చేసినవారమగుదుము. విశ్రాంతివేళలయందు స్త్రీలుగాని పురుషులుగాని ముఖ్యముగ స్త్రీలు పదుగురొకచోటఁ జేరి, బారాకట్ట, పచ్చీసు మొదలైన యాటలతోనో వ్యర్థవ్యవహారములతోనో కాలమును బుచ్చువారందులకు బదులుగ నీపుస్తకము నొకచదవనేర్చిన బాలికచేతనో బాలునిచేతనో చదువ

నిచ్చి వినుచు, కథలోని వ్యక్తులతోఁ దమలోఁ గొందరిని బోల్చుకొని నడుమ నడుమ ముచ్చటించుకొనుచు రచ్చ సలుపుచుండిన యెడల మిక్కిలి వినోదముగఁ బ్రొద్దుపోవుటతోఁగూడ దగినంత జ్ఞానలాభము కూడివచ్చును. సాధారణముగ నీదినములలోఁ దమకూఁతుల కాభరణముల తూకమే కాని అత్తవారి వివేకమును విచారింపక వివాహనిశ్చయముచేసి కన్నవారిధర్మమును నిర్వహించుటలోఁ బొరపాటుపడు తల్లిదండ్రులకుఁ గరతలామలకముగఁ దెలివిఁజెప్పఁగలవ్యక్తి జానకమ్మ. అత్తవారి పోరుపడలేక పలువురబాలలు బలవన్మరణము పాలగుటలు దఱుచుగఁ జరుగుచున్నవి కదా! ఏయమ్మ లోకావనార్థము లంకలో రాక్షసమధ్యమున గష్టసహిష్ణుతో కన్నులుమూసికొని కాలక్షేపముచేసి భర్తను సాగరసంసార పారద్వయోత్సుకుని గావించి సుస్థిరసుచరిత్ర జీవితమును బడసెనో, ఆసేతుహిమాచలము ప్రజలు పల్లెపట్టణ మేయమ్మ పవిత్రనామాక్షరములను రామనామముకంటె ముందుగ సంకీర్తించి [illegible] గుచున్నారో ఆజనక మహారాజ పుత్రికయు జగన్మాతయునైన [illegible] న యీజానకమ్మ స్వభావమున రాక్షసి. రాక్షసజనములోనైన నుండు క్వచిత్సుగుణాభాసము గూడ నీమె యందున్నట్లు కానము. మేలోర్వని తనమును వాక్పారుష్యమును ఈయత్తమ్మను ముత్తైదువ సొమ్ములు. మహాయోగ్యురాలైన కోడలు లక్ష్మీదేవివలెఁ దమకడపఁ ద్రొక్కినప్పుడు, బుద్ధిగలయత్తయైన నెంతయుప్పొంగవలసినది, ఎంతయాదరము చూపవలసినది—పూలలోఁబెట్టి పూజింపవలసినది—ఆపూజ యింటను నిహలోకమున నేకాదు, పైలోకమునఁగూడఁ దనకబ్బునుగదా! పతివ్రత కుచితమైన యనివార్యచింతచే శోభావతీదేవి చిక్కి శల్యమై మంచముపట్టి ప్రాణసందేహములో నున్నప్పుడు

పురములోనివా రాబాల గోపాలముదాక సుగుణ మహావతులను దలంచుకొని కన్నీరు విడుచుచుండ నింటిలోని జానకమ్మ మామూలుపదమే కాని బయటివారిని మెప్పించుటకైనఁ గన్నులు నులుముకొనిన పాపమునఁ బోని వృథగవన్నియేండ్లు పెఱిగి పెద్దవయసది యైన పరమ నిర్భాగ్యురాలు. అమ్మకుఁ దగ్గ కొమ్మయై కుళ్లుబోతు పేరంటాలైన మాణిక్యము—కుడిచికూర్చుండక, ఇరుగు పొరుగుతోను, ఇంటివారితోను నిష్కారణముగ వాదాడుచుఁ బ్రత్యహము గోలచేయుచుండగా నొకనాడు పెనిమిటి విసుకుకొని చేతిపుస్తకముతోఁ దిన్నగఁ బుగ్గపై స్పృశింపఁగా రబ్బరుబంతివలె మిట్టిపడి అత్తిల్లు వదిలి పుట్టినంట నిరుద్యోగముగ నమ్మయొడిలోఁ గూర్చున్న దబ్బరకత్తెయైన మాణిక్యము కథలో నజాగళస్తనమువలెఁ గన్పట్టినను ఒకవిధముగ ననవసర పాత్రము కాదు. ఉత్తమ గృహిణీపదము నధిష్ఠింపఁగల నారీమణులు తనవలెఁగాక తనవదినగారైన శోభావతీదేవివలె నడుచుకొని లోకముచేఁ గొనియాడఁబడుదురుగాక! యని బోధించుటకు పాఠశాలలలోని వల్లబల్లమాత్రము శక్తినంచన లేకుండ నుపకరింపఁగలదు. ఇఁక సజ్జన పక్షమునఁ జేర్పఁదగిన వారిలో—జాలిగుండెగల సుభద్రమ్మ దయాదాక్షిణ్యాదికములు నెంతపొగడినను దనివి దీరదు. సుబ్బరాయుని యోగ్యత మెచ్చఁదగినది ముగ్ధయు, సుస్మిత సంపాదక చతుర సరససల్లాపశీలయు, వివేకవతియునైన సుబ్బరాయుని భార్య ఆహ్లాదకరమైనవ్యక్తి, భోగాంగన యగు రాగమంజరి స్మరణకురాఁగా, ఉత్తమ మహిళామణులుగఁ బరిగణింపఁ దగినవారెందఱు కళంకాపాదకమైన నీచమైన పడుపువృత్తిలోఁ బూడిపోవుచున్నారో యను విషాదము కలుగకపోదు. దేశమునఁ బ్రజాహితకరములైన వృత్తులెన్నియో నశించెనేకాని, పాడుపడుపువృత్తి నానాట తా

పుర తంపర లగుచుండుట మిక్కిలి శోచనీయము. మఱియు, నిందలి తక్కిన ప్రతివ్యక్తివలనను లోకవృత్తమునందలి యనేక సుఖదుః ఖానుభవవిశేషములు సుబోధమగుచుండును.

ఆంధ్రదేశ గ్రంథభాండాగారమున గౌరవస్థాన మీయఁదగిన వానిలో నొకటియైన యీగ్రంథము దనవఱకుఁ బఠించిన వారికి య్యది మాతృజనముచే వ్రాయఁబడినదనియు, వ్రాసినతల్లి మహాను భావురాలనియుఁ దోఁపకపోదు. గ్రంథకర్త్రి కడపమండలమున ప్రొ ద్దుటూరు తాలూకా తహశీల్దారుగ నుండిన శ్రీమాన్ ఏ. న మ్మాళ్వారయ్య, బి.ఏ. గారి కుటుంబిని. ఆంధ్రలోకమునకుఁ జిరపరిచి తులును, బహుగ్రంథరాజములకుఁ బీఠికాకర్తలును, పరిష్కర్తలు నైన శ్రీమాన్ తేవెప్పెరుమాళ్లయ్య గారీ నమ్మాళ్వారయ్యగారికి మాతృష్వసేయులని వినుచున్నాము. మఱియు, సుప్రసిద్ధులైన శ్రీ మాన్ పరవస్తు చిన్నయ్యసూరిగారు నమ్మాళ్వారయ్యగారి బంధువర్గ ములోనివారు; నమ్మాళ్వారయ్య గారాంగ్లభాషాధ్యేతలే కాక, సం స్కృతమున గొప్పపండితులు. వీరికి విద్యాగంధము గలవానిని జూ చిన పండుగ; విద్వద్గోష్ఠి లేని దినమాయనకు వెలితిగ నుండునని కాఁబోలు, విదుషీమణి గృహిణిగా భగవానుఁడు ప్రసాదించెను. ఈవి ద్వద్దంపతులు మిక్కిలి వినయగౌరవము గలవారు. ఆర్ద్రస్వభావులు. భర్తృగౌరవమునకు వన్నె దెచ్చిన విద్యావినయ ధురంధరురాలును గ్రంథసంతానముతో ద్వివిధ సంతానవతియునైన యీయమ్మగారి గ్రంథమున కాంధ్రలోకము వలనను దొరతనము వారి వలనను గౌ రవాదరము లందునట్లు విశ్వప్రభువైన పరమపిత యనుగ్రహించుఁ గాక!.

పర్లపాడు.
30—9—1923

ఇట్లు, వత్స,
కసిరెడ్డి వేంకటసుబ్బారెడ్డి.
నగానపల్లి సంస్థానాస్థానకవి.

# స్వవిషయము.



సోదరీమణులారా!

పదియాఱేఁడుల యీడున నీగ్రంథమును వ్రాసియు, విదుషీమణులు వ్రాసిపెట్టిన గ్రంథము లెన్నియో యుండ, నీగ్రంథమును బ్రచురింప భయఁపడియుంటిని. పతివ్రతా రత్నముయొక్క చరితమగుటచే స్త్రీలోక మవశ్యము చదువఁదగినదని ప్రకాశపరుపఁ బలువురు ప్రోత్సహించుటచేఁ దుదకు సాహసించి నాభర్తగారికి కోరిక యెఱిఁగించితిని. వారనుమతించి అప్పటి కడపజిల్లా కలెక్టరువారి సతీమణి శ్రీమతి గలెట్టిదొరసానిగారి కంకితము చేయుమనిచెప్పి ముద్రింపఁబూనుకొనిరి. నాదురదృష్టమువలన ముద్రణము ముగియకమునుపే, నాభర్తగారు పరమపద మలంకరించిరి. ఏమిచెప్పుదును? జీవచ్ఛవమునై దిక్కులేని పసిబిడ్డలతో గాఢాంధకార బంధురమైన యీలోకమున సంతతదుఃఖసాగరఁమీఁదు నేను 'శోభావతి' గ్రంథప్రసక్తి మానఁ దలఁచితిని. నా మఱఁదిగారగు ఏ. కృష్ణమూర్తిఅయ్యగారును, నాభర్తగారి మిత్రులును, నా సోదరతుల్యులును, కవిత్రయములో నిరువురు నగు శ్రీయుతులు బాలకవి కవిరత్న కసిరెడ్డి వేంకటసుబ్బారెడ్డిగారును, ఎచ్. మహబూబ్ మియ్యాన్ సాహెబ్ గారును, ముద్రణము మానవలదనియు, ముద్రింపించినచోఁ బరలోకమునకుఁ జనిన భర్తగారికి సంప్రీతి కరమనియు నుద్బోధించుటచే ముద్రణము ముగించితిని. ఎవరునాకు నిహపరలోకములఁ బ్రత్యక్షదైవమో, ఎవరిఁగూర్చి యింతవఱకు సంతసించి, యిప్పుడు పరితపించుచున్నానో, ఎవరిసేవ నాజీవిత పరమావధియో, ఎవరసమాన విద్యావిశారదులును, బీదసాదలఁగన్న

పుత్రులవలె నరయువారున్నై యుండిరో, ఎవని దివ్యమంగళ విగ్రహము, నాకనుల కనిశము సాక్షాత్కరించుచున్నదో, అట్టి నాభర్తగారి పదసరోజముల కీకృతి సంకితముఁ జేయుచున్నాను. ఇదియే పుట్టిన దుఃఖములో చిట్టడు సంతోషముఁ జెందుటకు నాకవకాశము గల్గించినది. శ్రీమతి గలెట్టి దొరసాని గారి కంకితము చేయుమన్న నాభర్తగారి తొల్లింటి తలఁపును ఆపి వేయవలసి వచ్చినందుకుఁ బరలోకమున నున్న నాభర్తగారు నను మన్నించుచు దిక్కులేని తనబిడ్డల నాశీర్వదింతురుగాక.

నా యత్యల్పశక్తితో వ్రాసిన గ్రంథమునందలి దోషములు మన్నించుదురుగాక. పావనగుణశోభిత యగు శోభావతివంటి పుత్రికలఁగాంచి యాంధ్రమాత ధన్యయగుఁగాక.

ఈ గ్రంథ ముద్రణమునకై నాభర్తగారి నెంతయుఁ బ్రోత్సహించి నాభర్తగారి కోరికపై పీఠిక వ్రాసిన శ్రీయుత కసిరెడ్డి వేంకట సుబ్బారెడ్డి గారికిని, తప్పులు సవరించి ప్రూఫులు దిద్దిన శ్రీయుత మహబూబ్ మియ్యాఖాన్ సాహెబ్ గారికిని గృతజ్ఞురాలను.

చెన్నపురి
1—10—1924

ఇట్లు, సోదరి,
అ. పె. పిరాట్టమ్మ.

న బృందావనము నుండెను. అచట నొకయరుగును కొంతదూ
రి... నొక చేదబావియు నుండెను. ప్రాతఃకాలయమునను సంధ్యావే
ళను సేవకుడు నీళ్ళుతోడి చెట్లకుబోయు కడవ యచట బోర్లింపబడి
యుండెను.

ఘంటలు పదునొకండగునప్పటికి భోజనకూటములో రెండు
పీటలున్నవి దానిముందు విస్తరులలో అన్నము పప్పు కూరలు మొద
లైనవి వడ్డింపబడియుండెను. అప్పుడు నిమ్మపండువంటి శరీరచ్ఛాయ
యు గంభీరమగు గుండ్రనిముఖమును సంపెంగమొగ్గవంటి ముక్కు
ను కాటుకకన్నులును నలుచని శరీరమును గలిగి రమారమి ఇరువది
రెండు సంవత్సరముల వయసుగల యొకస్త్రీ బయటికివచ్చి ముసలా
మెనుజూచి 'అత్తా మీకుమారుడింకనేమి చేయుచున్నారు! విస్తరు
లలోవన్ని చల్లబడిపోవుచున్నదే" యనెను. "ఇదిగోవచ్చుచున్నాన"
నియింటి యజమానుడు కాలుసేతులంగడుగుకొని వచ్చిపీటపై గూ
ర్చుండి "అమ్మా శోభావతీ" యని రెండుమూడు సారులు పిలిచెను.
పిల్లపలికినదిగాదు. అంత ముసలామె కోడలినిజూచి "కల్యాణీ, పిల్ల
కోపముతోనున్నది. నీవైన వెళ్ళిదీసికొనిరా" యనెను. కల్యాణికూట
... గదిలోనికివెళ్ళి "శోభావతీ, బీరువాలోనున్న బొమ్మలక
ఆ ...వుబొమ్మలెక్కువాయెనా! మాఅమ్మలే, భోజనముసేయు
ము. సంతసమైవేళను బజారుకువెళ్ళి నీకువలయునన్ని బొమ్మలు కొందువు
!" యని ...ముపట్టి లేవదీసికొనివచ్చి తండ్రిప్రక్కను పీటపై కూ
ర్చుండబెట్టెను. అంత తండ్రి కూతురు భోజనముచేసి చేతులంగ
డుగుకొని తాంబూలము దీసికొని మిద్దెమీదికివెళ్ళిరి.

మిద్దెమీదపెద్దకూటమును వీథివైపు నొకగదియు కూట

నకువెనుక నొకచిన్న వసారాయును కొంతబయలునునుండెను. గదిలోనొక మంచమును కుర్చీయును చిన్నబీరువయునుండెను. బీరువయందొక యంతస్తున శోభావతి చదువుకొను పుస్తకములును మరియొకయంతస్తున తండ్రిగారివి కొన్నిపుస్తకములును దప్ప మరేవియు లేవు. బీరువ ప్రక్కను గోడకు సుభద్రార్జునులపటమును ఇంకను గొన్ని చిత్రపటములును వ్రేలుచుండెను. యజమానుఁడాగదిలోని మంచముపైఁబరుండి కొంతసేపెద్దియో పుస్తకముఁ జదువుచుండి తరువాత నిదురించెను. శోభావతి రంగువేసినకొన్ని చెక్కపిడతలును మట్టిపిడతలను బొమ్మలును దెచ్చుకొని యిరుగుపొరుగు తోడిబాలికలఁ జేర్చుకొని యాడుకొనుచుండెను. సాయంకాలమగునప్పటికి యజమానుఁడు లేచిమిద్దెగదిలోనికివెళ్ళి కొంచెము మంచినీళ్ళుద్రాగి దండెముపైనున్న యుత్తరీయమునుదీసి భుజముపైవేసికొని ముందుకూటమున గోడచెంతనున్న తివాసిపైఁగూర్చుండి వర్తకపు లెక్కలఁజూచుచుండెను. అప్పుడొకవైశ్యుడు వచ్చి యజమానునిజూచి "ఏమండీ, రామచంద్రయ్యగారు, మాకుకొన్ని కోకలు కావలసియున్నవి. ఇప్పించెదరా!" యని యడిగెను. యజమానుఁడు "పోలిసెట్టీ, కూర్చుండుఁడు. మాసరుకంతయుమీదేకదా, మీరడుగవలసినదెందుకు!" అనగా పోలిసెట్టి చాపపైగూర్చుండి, "అయ్యా, యెఱ్ఱవి సిరిపట్టుచీరెలును శృంగారకంటి ఆనిపప్పళి తండుతాళిశలంగు వీనిలోను గావలయును." అనెను. రామచంద్రయ్య గదిలోనికివెళ్ళి బీరువలోని మడతలఁగొన్ని దెచ్చి సెట్టిముందరఁబెట్టెను. సెట్టివానినన్నిటిని త్రిప్పిత్రిప్పి చూచి తనకుఁగావలసినవి కొన్నిదీసికొని జేబులోనుండి కొంతపైకమును దీసియిచ్చి మిగతబాకీ పదిదివసములలో ఇచ్చివేసెదనని చెప్పి సెలవుపుచ్చుకొనివెళ్ళెను



# శోభావతి.

---:o:---

## రెండవ ప్రకరణము

---

హిందూదేశమందలి సుందరమైన నగరములలో నొకటియు చోళరాజులకు ముఖ్యపట్టణమును నైన తంజావూరు రాజరాజచోళుని కాలమందు చాలనున్నత దశయందుండెను. ఇచట మిగులసుందరమైన దేవాలయ మొకటికలదు. అందు ఇన్నూరడుగుల యెత్తుగల గోపుర మొకటియుండెను. అంతయెత్తైన గోపురము మఱి యేదేవాలయమందును లేదు. దాని గుమ్మటము ఇరువదియైదున్నర చదరపుటడుగులుగల యొకేయొక నల్లరాతిబండలో చెక్కఁబడియుండెను. ఈయాలయములో నొక ఱాతిబండయందుఁ దొలిచిన నందియు నొకటుండెను. చోళరాజులకు తర్వాత నిటనుండనిచ్చలేక లక్ష్మి తొలఁగిపోయెను. ఇచట వీధులు మిగుల విశాలమైయుండెను. రాచనగరున కుత్తరమున నొకవీధియందు గారతోఁగట్టబడిన స్తంభములుగల యొకమిద్దెటిల్లుండెను. ఆయింటిగుమ్మమున కిరుపార్శ్వములయందును విశాలములైన యరుఁగులుండెను. ద్వారబంధమున సొగసైన తీఁగపనిఁ జేసి చిలుకలు చెక్కఁబడి నడుమ జయలక్ష్మి అమర్చఁబడియుండెను. లోపల విశాలమైన ముంగిలియు కుడిపార్శ్వమున నాలుగు కంబములుగల పెద్ద కూటము పేర [illegible] నొకగదియునుండెను. ఎడమప్రక్కనున్న వడసాలయందు మి[illegible]ది కొక్కఁడు పొల్లగుపడుచుండెను. అమిద్దెమీఁద

విశాలమైన చంద్రశాలయు నెదురెదురైన రెండుగదులును నొకక ప్రక్క చిన్న వసారాయును విశాలమైన బావియు నుండెను. అచటనుండి రెండవ తట్టునకు దిగుటకు మెట్లుండెను అందుపై నాలుగువారు తడి బట్టలారగట్టుకొనుటకును యెట్టి వస్తువు లెండవేసికొనుటకునుసాధారణముగ నామెట్లనెక్కి యే విద్దెమీఁదికివచ్చుచుందురు. రెండవ తట్టున సన్నముంగిలియు కూటమును రెండుగదు లుండెను. లోపలివైపు గదిలోనియరుఁగుపై దేవతార్చనపెట్టెయు పూజాసామగ్రియునుండెను. అచటగోడకు పార్వతీశ్వరుల పటమును, సీతారాములపటమును వ్రేలుచుండెను. వానికివెనుక భోజనకూటమును వంటగదియు నుండెను ఒకదినము సంధ్యవేళ నాలుగు గంటలగు నప్పటికొకపురుషుఁడు పరాకుయు చొక్కాయునుదొడిగి కొంతవ్రేలునట్లు తలకు రుమాలుఁజుట్టి తోలుసంచి నొకదానిని భుజమునకుఁ దగిలించుకొని యెడమచేతియందు కొన్నియుత్తరములచట్టనుఁ బట్టుకొని కుడిచేత నొకయుత్తరమును దీసికొని యాయింటి మెట్లెక్కి వచ్చెను. అతని వేషమే యతఁడు తపాలాబంట్రౌతు అని తెలుపుచుండెను. అతఁడు ఆయింటిలోనికి వెళ్ళి ''శేషయ్యపంతులవారూ'' యని కేకవేసెను. తోడనే యేబది సంవత్సరములు వయసుగల యొకపురుషుఁడు వచ్చియెదుటనిలువగా తపాలావాఁడొక యుత్తరము నతని చేతికిచ్చి వెళ్ళెను శేషయ్య నల్లటివాఁడయినను కొంతసురూపమును పొడుగుపాటి శరీరమును బొజ్జకడుపును కలవాఁడు. వెండ్రుకలు నరసియుండెను. అతఁడు త్తరమును చేతికిదీసికొని కూటములోనున్న కుర్చీయొద్దకరిగి తనభుజముపైనున్న చిన్నచొక్కముతో తట్టవేసి కుర్చిపైగూర్చుండి ''మాణిక్యమూ''యనిపిలిచెను. అంతట లోపలినుండికొంత యుణఁగినముక్కును చిన్నకన్నులును ఎత్తుముఖమునుగల పది సంవత్సరముల బాలికవ

చ్చి "ఏమి నాన్నా!" యనెను. శేషయ్య "నాను లోచనములిటు తెమ్ము" అనగా, నా బాలిక గదిలోనికి వెళ్ళి చిన్న పెట్టె దెఱచి యందున్న నులోచనములు దెచ్చి తండ్రి చేతికిచ్చెను. అతఁడు దానినందులోని యుత్తరీయము కొంగుతో నద్దములను దుడిచి ముక్కుపైఁ దగిలించుకొని జాబును విప్పి కొంతవడిగాఁ జూచి "మాణిక్యమూ, మీ అమ్మను బిలువు" మని చెప్పెను. అతని చేరువను మఱియొక కురిచీపైఁ గూర్చుండి యున్న బ్రాహ్మణుఁడు శేషయ్యను జూచి "ఎవరిది యుత్తర" మని యడుగుచుండ లోపలినుండి యొక స్త్రీ వచ్చి శేషయ్య యెదుట నిలిచెను. ఆమె చామనచాయ గలిగి పొడవు లేకున్నను మిగుల పొట్టిది గాక రమారమి నలువది సంవత్సరముల వయసు గలిగి యుండెను. శేషయ్య ఆమెను జూచి "పిన్నావా? మీ వియ్యంకుఁడుత్తరము వ్రాసెను." అని చదువఁ దొడఁగెను.

"మహారాజరాజశ్రీ శేషప్ప పంతులు బావగారికి వందనములతో వ్రాయుట. భగవంతుని దయవలన ఇచ్చట సంతతము క్షేమము. అచ్చట తమరుండఁటి క్షేమము తెలుపఁగోరెదను. మా శోభావతికి వివాహమై ఐదు సంవత్సరములాయెను. తొలివిందు దప్ప ఏ పండుగకును మా ప్రార్థన నంగీకరించి మీరు మా యింటికి విజయము చేయలేదు. తుదకు మీరో మా పిన్నైనను బంపినవారుగారు. రాఁబోవు గురువారము దీపావళి, మఱునాఁడు లక్ష్మీనోములు కనుక తాము కుటుంబసమేతముగా విజయముచేసి పండుగ నెరవేర్ప ప్రార్థితులు."

ఇట్లు తమవిధేయుఁడు,

రామచంద్రయ్య.

ఇట్లు చదివి విరమింపఁగానే వృద్ధబ్రాహ్మణుఁడామెను జూచి "జానకమ్మా, ఈసారి కుంభకోణమునకు వెళ్లెదరా!" యని యడిగెను. అందుల కామె ముఖమును త్రిప్పి "వారి సుర్యాసకు మేము వెళ్లక తప్పకున్నది" యనెను. "వారేమి సుర్యాసనెఱుఁగని వారా!" యని వృద్ధుఁ డడుగ జానకమ్మ "పిన్నయ్యా, మీ రెఱుఁగరా పట్టాభిరాముని పెండ్లి నాఁటి సుర్యాసలు! ఆడుపిల్లలకు నోచినోచి కనుగొన్న మనమరాలికయ్య మువఁటి జానఁడు గుక్కనియ్యఁగత లేనివారు ఇపుడేముఖముతో వ్రాసిరి" అని చేతులు త్రిప్పుకొనుచు లోపలికి వెళ్లెను. శేషయ్య ముసలాయన వైపునఁ జూచి "మామగారూ, స్త్రీలనిష్ఠురముల కేమి, తెలివితక్కువచే వారి కేవేని లోపములు స్ఫురించుచునే యుండు" ననెను.

వృద్ధుఁడు:— అట్టయిన పట్టాభిరాముని అంపెదరా?

శేషయ్య:— మామగారూ, మా వియ్యంకుఁడు పెద్దోగస్థుఁడు గాఁడని వానికి చదువెక్కువలక్ష్యము.

ముసలాయన, కొంతసేపు తల నాడించుచు, క్రిందుమీఁదు చూచుచుండి యెవరైన నున్నారేమోయని నలువంకలఁ గలయఁజూచి "శేషయ్య గారూ, నేవన్నానని మీమనసున కాయాసముకలుగునేమో మన వారందఱు చదివి యుద్యోగములే చేయుచున్నారా? అన్నాసక్కుఁడు పదునైదుసంవత్సరములనుండి వైష్ణవవిషయమున తనకు రాజుగారి యభిమానముగలుగఁబట్టి యొకమోస్తరుగనున్నాఁడు. ఇప్పుడిప్పుడే గదపరీక్షలు ప్రబలమై కులాచారము లడుగంటుచున్నవి. అవిపోనిండు ఎవరైన నేమి? మంచి నెంచవలెగాని, రెండుసంవత్సరములు మనవాఁడు పరీక్షలో ఫేలైపోలేదా? వారిసంగతేమిన కేల, పిల్లయేగదా మనది, ఆపిల్లను వివాహమాడిన పదిరోజులకే మనవాడు మెట్రిక్యులేషను ప్యాసైనాడు. అతఁడావలతరగతి పరీక్షలలోఁ దేఱుచున్నాఁడు. అదేగదా

మనము పాటింపవలసినది. కావలసిన స్థలములలో విరోధముంచుకొన్నజరుగదు, మీరందఱు వెళ్లుటకు వీలుగాకున్నను పిల్లవానినైనం బంపుఁడు" అనిచెప్పుచు శేషయ్యగారు, "సంధ్యవేళయైనది. వెళ్ళెదను" అని వెడలిపోయెను.

అంతకొంతసేపటికి వీధినుండి చామనచాయగల పదునెనిమిది సంవత్సరముల చిన్నవాఁడు జరీపంచెయు పన్నీటికోటునుదొడిగి తలకు టోపీపెట్టుకొని కాళ్ళకుజోళ్ళుదొడిగి యెడమచేతఁగొన్ని పుస్తకములను కుడిచేతగొడుగును బట్టుకొని లోపలికివచ్చెను. శేషయ్య అతనినిజూచి "ఏమిరా, పట్టాభిరామా, మీమామగారు దీపావళిపండుగకు నిన్నురమ్మని యుత్తరమువ్రాసిరి" అని ముసిముసినవ్వునవ్వెను. పట్టాభిరాముడు కాలిజోళ్ళను విడిచిపెట్టి తండ్రిమాటలకు తలనాడించుచు మిద్దెమీఁదికి వెళ్లెను. పట్టాభిరామునికి వెళ్ళవలెననియు, శేషయ్యకు కుమారునిఁబంపవలెననియునున్నను ముందటనుండి నిష్ఠురములతోఁ బనిగొట్టుచుండుటేగాక వియ్యంకునిజాబు చూచినది మొదలు వారు మర్యాదనెఱుఁగని వారనియు వారియింటికి వెళ్ళుట తనకు పరువుతక్కువ యనియు వచ్చువారితోను పోవువారితోను జానకమ్మ నిష్ఠురము లాడుచుండెను. తగవులమారి భార్యకు వెఱచియో యేమో శేషయ్య యేమియుఁబలుకక యూరకుండెను.



# శోభావతి.

## మూడవ ప్రకరణము

———:o:———

ఒకదినము నుదయమున కుంభకోణమున రామచంద్రయ్యగారి యింటి వీథియరుఁగుపై నొకవర్తకుఁడు గూర్చుండి లోపలివైపు తొంగి తొంగిచూచుచుండెను. అతఁడు ప్రక్క నొకమూట నుంచుకొనియుండెను. కొంతసేపటికి రామచంద్రయ్య వీథిలోనికివచ్చి యామనుష్యుని జూచి "ఏమయ్యా మన్నారుశెట్టీ చాలాదినములైనది. లోపలికి రాఁగూడదా" యనెను. సెట్టి "అయ్యా మీరింటనున్నారో లేవో యను సందేహముతో నిచటఁ గూర్చుంటి" నని చెప్పుచు లేచి రామచంద్రయ్యతోఁ గూడ వచ్చి లోపలికూటమునఁ గూర్చుండెను.

రామచంద్రయ్య:—సెట్టీ, నీవగపడి చాలరోజులైనదే!

సెట్టి:—అయ్యా, నేను చాల దేశములు తిరిగి కాశీవిశ్వనాథుని దర్శించివచ్చినాను.

రామచంద్రయ్య:—అందుచేతనే యీనడుమ అగపడలేదు.

సెట్టి.—ఔను, నేనూరువిడిచి రెండు సంవత్సరములైనది. మొన్ననే వచ్చితిని. నిన్న అలసటచే బయటికి రాలేదు ఇప్పుడే ఇల్లువెదకి మీదట మిమ్మే చూడవలయునని వచ్చినాను.

అని చెప్పుచు సెట్టి జేబునుండి పైకముసంచినిదీసి చాఁపమీదఁ గ్రుమ్మరించి "రామచంద్రయ్యగారూ, ఇన్నిదినము లాలస్యమైనందులకు నాకు చాలసిగ్గగుచున్నది. సామానుబాగుగ నెఱిగినవారలే

గాక చాలనుండి వాకిటనుక నూరకుంటిరిగాని యింకొకరైన నెంతో నల్లరిచేసియుందురు" యనెను.

రామచంద్రయ్య—(నవ్వుచు) "శాస్త్రీ, నీవు తీసుకొనిపోయి ఆ ప్రవాసములకు తర్వాత నీవగపడనందున మీయింటియొక్క సమాచారమును నంపితిని. నీవారిలేవని విని యూరకున్నా"ననెను. అంత వాకిటినుంచి రామచంద్రయ్యకిచ్చి రెపరుపుచ్చుకొని తానుదెచ్చిన మూటవిప్పి రామచంద్రయ్యకుజూపి కాకిచిలుక మొదలగు సరకులను వాని వెలలను గురించి మాటలాడుకొనుచుండగా నంత చేపటికొక వృద్ధబ్రాహ్మణుడు జింకచర్మముతోఁ గుట్టిననొక బట్టల సంచి నెడమచేతఁ బట్టి కుడిచేతఁ గఱ్ఱనూదుకొనుచు బండిపోయిన వెండ్రుకలుగల తలనాడించుచుఁ గాళ్ళనున్న పావుకోళ్ళు టక్కు టక్కు మనుచుండఁ దిన్నగా లోపలికి నడుచుచుండెను. ఆచప్పుడు విని రామచంద్రయ్య వీధివైపు తొంగిచూచి "ఓహో మామగారూరండి"యని లేచి యెదురుగావెళ్ళి ఆయనచెతనున్న సంచినిదీసికొని చేయిపట్టి కూటమునకుఁ దీసికొనివచ్చి "కూర్చుండుఁడి"ని మాట నతనిప్రక్క నుంచి తానును గూర్చుండి "మామగారూ, సౌఖ్యమా?" యనియడిగెను. వృద్ధుఁడు కఱ్ఱను ప్రక్కనుంచుకొని ముడిలోనున్న నస్యము బుఱ్ఱనుదీసి యెడమచేత కొంచెము వేసుకొని బుఱ్ఱను రొంటియందుఁ జెక్కుకొని కుడిచేతి మూపుడువ్రేలితోను బొటనవ్రేలితోను నొకచిటికెదీసి ముక్కునఁబెల్చి మఱియొకచిటికె వ్రేళ్ళతోఁ బట్టుకొని అరచేతిని తట్టి వేసి గోకనానుకొని "నాయనా, రామచంద్రయ్యా, దేవునిదయవల్లన నాకుసౌఖ్యమే, యిచ్చట నందఱును సౌఖ్యమేగదా?" యనెను. ఆయన కంఠస్వరమును విని రామచంద్రునితల్లి లోపలినుండివచ్చి "అన్నగారూ, సౌఖ్యమా?"యనెను.

వృద్ధుడు—"పార్వతమ్మా, సౌఖ్యమే, మీరందఱు సౌఖ్యమా? శోభావతి అగపడలేదేమి? అత్తవారింటికివెళ్ళినదా!"

పార్వతమ్మ—"అన్నగారూ ఐశ్వర్యమెక్కువైన వారికి కోడలు జ్ఞప్తికివచ్చునా!"

అనుచు ముఖము చిన్నపుచ్చుకొని లోపలికివెళ్లెను. ఆమాటకు ముసలాయన తలయూఁచి యూరకుండెను. వీరిమాటలను వినుచున్న సెట్టి రామచంద్రయ్యను జూచి "అయ్యా! నేను బాల్య స్నేహితుఁడనేగాక మనమిరువురమును సోదరభావముతో నుండుటఁబట్టి యడుగుచున్నాను. బిడ్డ నింకనుమనయింట నుంచుకొని యుండుటకు కారణమేమి!"

రామచంద్రయ్య—"అసంగతి సితరులతోఁ జెప్పుకొన్న నగుఁబాటు, మీకుభేదములేక యడుగుటఁబట్టి చెప్పుచున్నాను. మేముతమతో సమానులముగా ననియునుబీదకుటుంబములోనిపిల్ల తమకు తగదనియు వియ్యమువారు చెప్పుకొనుచున్నారని వదంతి. అందులకు నిదర్శనముగా పండుగ లేగాదు. బిడ్డరజస్వలయైనప్పుడైనను పిలువగవచ్చినవారుగారు. కోడలిని దీసికొని పోయినవారుగారు. తుదకు మన యుత్తరములకు ప్రతియైన లేదనుకొండి."

సెట్టి—"మనబిడ్డ మనయింటనుండుట మనకుమేలేగదా!"

ముసలాయన—"వెఱ్ఱివాఁడా. వారిముచ్చటలు మనకుముచ్చటలేగాని, వారుముఖము చిన్నపుచ్చుకొని మనయింటనుండ మనకేమి ముచ్చటలు? ఎదుటఁజెప్పుకొనసలసినదికాదుగాని మాకల్యాణికి మూఁడు సంవత్సరములలో తల్లికాలముచేసినది. తల్లిలేనిపిల్ల నెన్నిబట్లోసాఁకి ఎనిమిదవయేట వివాహముచేసినాను. పార్వతమ్మ అత్తగారనుమాటపోయి, పోయినతల్లి లేచివచ్చినట్లు కల్యాణిని జూచుకొనుచుండ

నాకేచింత లేక సంతోషముగా కాలముగడుపుచుంటిని. ఇప్పుడు దాని కున్న వ్రేలెడు పిల్లముచ్చటలుచూడ నాకన్నులు పుణ్యముచేసికొన లేదు."

సెట్టి:—"హయగ్రీవశాస్త్రులవారూ, మాటవాసికన్నా నే గానినాకుమాత్రము తెలియదా? నేనేమిపసివాఁడనా! నేనుగూడవా రియాప్తులనోటనే కొన్నిమాటలు విన్నాను. ఇంతయననేల బంగారు బొమ్మవలె నున్నభార్యను దలఁపకున్న అల్లుఁడుగారు బుద్ధిహీనులు."

రామచంద్రయ్య.—"పసివానిదేమున్నది, పెద్దలకుగదా తెలి వియుండవలెను?" వీరి మాటలనువినుచున్న పార్వతమ్మ యీవలకు వచ్చి అన్నగారూ, చాలదినములు పిల్లలులేక యెన్నినోములో నోచి యెన్ని దైవములకో మ్రొక్కి మా రామచంద్రుఁడు పుట్టెను. వానికిని చాలదినములకు వెనుక నీపిల్లపుట్టెను. నాపాపమేమోగాని కన్నక డుపున తిరుగా నొక చెత్తగాని లేకపోయెను. అదేమగబిడ్డయని తలఁచి కంటికిరెప్పవలె సాకి, చిలుకను బెంచి పిల్లివాత పెట్టినట్లు పాడుసంబం ధముజేసినాము. మగడుమూర్ఖుఁడు, అత్తగారు గయ్యాళి, ఆడుఁబిడ్డ యన్ననోమహాంకాళియే."

సెట్టి.—"అమ్మా, మీవారిలో నింకెవ్వరు లేకపోయిరా?"

పార్వతమ్మ—"ఎవ్వరెందుకు లేరు? వీరేమో కొంత స్థితిమంతులనియు పిల్లవాఁడు చదువుకొనుచున్నాఁడనియు అందఱు చెప్పఁబట్టి" (అని ని ట్టూర్పువిడుచుచు) "ఒకరిననేల పిల్లనొసటివ్రాలు, నాకన్నులుచేసి న భాగ్యము" అనుకొనుచు లోపలికివెళ్ళెను.

సెట్టి—(ఇటునటుతిరిగి చూచి రామచంద్రయ్యతో) "అ య్యా, నేనింకొకసంగతి విన్నాను. ఆడఁవారుమనసు నిలుపుకోలేరు. కనుక ముసలామె యుందనలేక యుంటిని. మాతమ్ముని బావమఱఁది

మాతోఁగూడ వడ్డించరాదా? చాల పొద్దైనదే"

కల్యాణి—"బిడ్డ స్నానము చేయుచున్నది."

ఇరువురు భోజనము చేసి లేచిరి.

ముసలాయన "శోభావతీ, అవ్వా, పలుకవేమే" యను చుండ, కల్యాణి "నాన్న, శోభావతి మిద్దమీఁదికి వెళ్ళినది," అనెను.

హాయగ్రీవులు చేతి కడుగుకొని యెక్కలేక మెల్లగ మిద్దమీఁది గదిలోనికి వెళ్ళి శోభావతిని జూచి "తల్లీ, యొంటరిగ నేల కూర్చున్నావు. నీ కింక ఆకలి గాలేదా భోజనమునకు లెమ్ము" అనెను. శోభావతి మాఱుపలుకక చేతనున్న పుస్తకమును చాఁప మీఁదఁ బెట్టి క్రిందికి వెళ్లెను.

శోభావతి చింతలో మునిగియున్నను పూర్ణచంద్రుని వంటి ముఖమును తామరరేకుల వంటి కనులును శంఖమువంటి గళమును తామరతూండ్ల వంటి బాహువులును చిగురుటాకులవంటి యరచేతులును సన్నని నడుమును స్వర్ణ కాంతిని మించు శరీరచ్ఛాయయు నామెను సార్థకనామము గలదానిగా జేయుచుండెను. పదియాఱు సంవత్సరముల వయస్సుగల యా సుందరి, వాడుబారిన పువ్వువలె చిన్న బోయియుండుటకై హయగ్రీవులు కొంతసేపుచింతించుచుండితత్తర నిదురించెను.

శోభావతివిస్తరయొద్ద కూర్చుండి రెండు కబళములు నోటఁబెట్టుకొని చేయి విదల్చి లేచిపోయెను.

కల్యాణి—"తల్లి, ప్రతిపూట అన్నము విడిచిపెట్టుచున్నావే"

పార్వతమ్మ—"దాని కేదైనా ఔషధ మిప్పించుమన్న నా మాట నీచెవిని బడదు. పిల్ల అన్నములేక సగమైనది."

శోభావతితనలో "ఈ వెఱ్ఱిమునలామె కేమియు దోఁచుట లేదు. నా శాపమేమిటి? పెనిమిటి మన్నించుటయే ఔషధము" అనుకొనుచు చేతులు గడుగుకొని గదిలోనికి వెళ్లెను.

పార్వతమ్మ—"కల్యాణీ? పిల్లకు కొంచెము మజ్జిగనా త్రాగనిమ్ము."

కల్యాణీ—శోభావతికై మజ్జిగ దీసికొనివచ్చెనుగాని,శోభావతి "అమ్మా,నాకు దప్పిగాలేదు. నాకు మజ్జిగ అక్కరలేదు." అనెను.

శోభావతి పుస్తకముచేతబట్టుకొని యుండినందున చదువుకొనుచున్నదని తలచి, కల్యాణి యీవలకువచ్చెను గాని ఆమెఅట్లుండ లేదు. చేత పుస్తకముండెనేగానిమనస్సు చాలదూరము వెళ్లుచుండెను. తల్లి యీవలకు వెళ్ళగనే ఆమె గోడ నానుకొని చెక్కిట చెయి చేర్చి యశ్రుపూరితనయనములతో మీఁదివంకజూచుచు, "దీనదయాపరుఁడైనభగవంతుఁడా' లోకమునఁగల యెల్లప్రాణులును, నీకు సమానముగదా. ఒక కంట వెన్నబెట్టుకొని మరియొక కంట సున్నమురాచుకొనవచ్చునా? తొలిజన్మమున నే నెవరి దాంపత్యమునుజూచి యోర్వలేకుంటినో యీ పాపము నిపుడనుభవించుచున్నాను. కరిగాజరక్షకా! దీనబంధూ! నీకు నేనేమి యపకార మొనర్చితిని! లోకమున నావంటి పడుచులు వారివారి భర్తలచెంత సుఖియుండుటలేదా? నే జేసిన పాపములవలన నాపెనిమిటికి నేను ద్వేషికి గాకయున్నాను. సర్వపాపవిమోచనా! నాదుఃఖమును బోగొట్టి నాకు పతిశుశ్రూషం గలుగజేయుమా! జగదీశా! ఉమాపతే!" యని తనలో తాను చింతించు కొనుచుండెను. అంత గంటలు నాలుగైనవి. యెవరో వీధివాకిలి తట్టిన చప్పుడువిని, పార్వతమ్మ "ఇదిగో' వచ్చెద, వచ్చెద" నని యఱచుచు తలుపు దెఱచునప్పటికి, తపాలావాడొక యుత్తర

మును చేతికిచ్చి వెళ్ళిపోయెను.

పార్వతమ్మ యుత్తరమును కుమారుని చేతికిచ్చి లోపలికి వెళ్ళెను.

హయగ్రీవులు.—అంచేతనున్న వస్త్రమున నొక చిటికె ముక్కున బీల్చి, మఱియొక చిటికె దీసికొని స్తంభము నానుకొని "రామచంద్రయ్యా! యెవరిది యుత్తరము?" అనిఅడిగెను.

రామచంద్రయ్య.—ఉత్తరము విప్పి కొంతవఱకుఁజూచి తరువాత చదువఁదొడగెను

మ-రా-రా-శ్రీ. చిలుకపాటి- రామచంద్రయ్యకు వ్రాయుట:—

ఈ వైశాఖ బహుళ దశమి సోమవారమునాడు ఉదయము తొమ్మిదిన్నరగంటలకు నా చిన్నకొమారుడు సుబ్బరాయునికిని, చిదంబరము కోటపల్లె కృష్ణయ్యకుమార్తె మీనాక్షమ్మకును నాకుమార్తె మాణిక్యాంబకును యజ్ఞమూర్తి రంగయ్యకుమారుడు సాంబమూర్తయ్యకును వివాహములు జరుగఁబోవుచున్నవి. కాఁబట్టి శోభావతితోకూడ మీరందఱును రావలయును.

ఇట్లు మీ వియ్యంకుఁడు,

అవధానము. శేషయ్యపంతులు.

ఇట్లు చదివి ముసలాయన వంకఁజూచి! "మామగారూ చూచినారా! ఒక వందనమైన దీవెనయైన లేదు. మీ యభిప్రాయమేమి మనము నిజముగా రావలయునని వ్రాసినయుత్తరమేనాయిది?" అనెను

హయగ్రీవులు—"నాయనా' వారిన్నాళ్లు మనుష్యులనే మఱచియుండిరి. ఏది యెన్నట్లును పిల్ల వారిసొత్తు. ఎన్నడైనను పంపకతీరదు. నందు విడచినపుడు దార మెక్కించవలెనన్నట్లేయుత్త

రమునే యాధారముఁజేసికొని భిక్షను బంపిన తరువాత యోచింప వచ్చును."

రామచంద్రయ్య—"పిల్లకు సహాయమెవరు. ఒంటరిగా నెట్లు పంపగలము?"

హయగ్రీవులు—పార్వతమ్మను బిలచి "శేషయ్య వ్రాసిన యుత్తరము విన్నావా?"

పార్వతమ్మ:—"ఆ! విన్నానులెండి."

హయగ్రీవులు.—"అట్లైన పిల్లనుఁబంపెదరా.

పార్వతమ్మ—"ఇఁక పంపకతీరునా? మూఁగవాఁడు అమ్మాయన్నప్పుడు మనపిల్ల మేలుకొఱకు మనము పంపవలసినదే"యని కుమారుని వంకజూచి "నాయనా! పిల్లను దీసికొని నీవు వెళ్ళివిడిచిరమ్ము"

రామచంద్రయ్య—"అమ్మా, నాకిప్పుడు పోను వీలుఁగాదు."

పార్వతమ్మ—అట్లైన కల్యాణిని బంపుము"

రామచంద్రయ్య—"వారి వేళాకోళమునీకు వచ్చినట్లున్నది. పెద్దదానవు నీవు వెళ్ళిరమ్ము."

పార్వతమ్మ—"అబ్బాయీ వారిదిగాదు వేళాకోళము యిప్పుడు నీదే వేళాకోళమని చెప్పవలెను కాకున్న, ఆడపిల్లను గన్నవారికి పౌరుషము చెల్లదుగదా? వారు కఠినులై పెనుమతములోనుండుట మనకు బాగాదెలిసిముందువెనుక యెఱుఁగనిపిల్లను కావలసినవారెవరులేక యొంటరిగాఁ బంపిన దానిగతి యెట్లు? వారినిజూచి వెళ్ళెదమా? మనపిల్లకొఱకై మనము వెళ్ళుచున్నాము పిల్లయెక్కువా, శౌర్యమెక్కువా? పిల్లకొఱకేనాడైనను పోకతీరదు.

రామచంద్రయ్య—"మామగారూ మీరు వెళ్ళిరండి"

హయగ్రీవులు—"నాయనా. పిలువనిపేరంటమన్నట్లు వారు

నా కోరికజాబైనను వ్రాయలేదు. వ్రాయకున్న మానె. మీజాబునం దైనను నామాట లేదుగదా నేనెట్లు వెళ్ళుదును.

తనచింత తనతోఁ జోకతన్నుఁగన్న తల్లిదండ్రులును తనకై వేసటబడుచుండ, నొరులతో జెప్పుకొనుటకును లేక, కరుణాకటాక్ష వీక్షణుఁడగు భగవంతుఁడే దిక్కని వేఁడుకొనుచున్న యొక యబల యొక్క మొఱను భక్తవత్సలుం డాలకించెనేమోగాని, నాలుగు సంవత్సరములనుండి అల్లుకొనుట కాధారములేక గాలి కల్లలాడుచున్నపూదీగవలె తపించుచున్న శోభావతి మామగారి యుత్తరము వచ్చుటయు తన పయనమునుగుఱించి పెద్దవారంద ఱనుకొనుచుండుటయు విన్నదై, కల్పవృక్షమే తన కాధారము చిక్కినంత సంతోషము గలదై బయటికి వచ్చి "తాతా! మీ రిచటనుండునది వారేమెఱుగుదురు? మీయూరికి వ్రాసియేయుందురు, లేకున్నను, నేను వారింటిదాననే గదా. నేను పిలుచుచున్నాను పయనముజేయుడు." అనెను.

హయగ్రీవులు.—నవ్వుచు, "ఔరా శోభావతీ! నీ వేమెఱుగని పిల్లననుకొంటిని! ఎంతటి పెద్ద వయసుదానవైతివి. నిన్ను కని పెంచినవారు నీవారు గారు. డబ్బుత్తుపుస్తెగట్టినవారు నీవారైరిగా." యన నందఱును నవ్వుకొనుచుండిరి.

శోభావతి.—సిగ్గుచేతఁదల వంచుకొని లోపలికి వెళ్లెను.

శోభావతియొక్క సద్గుణమును లోపలినుండి వినుచున్న తల్లి తండ్రి మొదలగువా రందఱును, లోలోన సంతసిల్లుచుండిరి.

రామచంద్రయ్య.—అమ్మా! వీరభద్రు డేల యింకను రాలేదు.

పార్వతమ్మ.—వాఁ డెన్న డాలస్యముగ రాఁడు. నే డేమో కారణ [illegible] తెలిసినది కాదు

నాయనా! బిడ్డ యిపుడే క్రొత్తగా వెళ్లుచున్నది గనుక అది మనసున బెంగఁ బెట్టుకొనకుండ నీసారి తల్లినిగూడ బంపుము యెల్లకాలము మనమే రక్షకులమా? అన్నగారును సహాయముగా వెళ్ళి వచ్చెదరు.

రామచంద్రయ్య.—అమ్మా, నే నేమో అన్నానుగాని పెద్దదానవు నీ వెఱుఁగని కార్యములు నా కేమి దెలియును? నీ యిష్టమెట్లో అట్లు చేయుము.

వీరిట్లు మాటలాడుచునుండ పదునేను సంవత్సరముల చిన్నవాఁ డొకఁడు మొలను నెల్లని చాయపంచె గట్టి భుజముపై నొక తెల్లని వస్త్రము వేసికొని వీధినుండి వచ్చి గోడచెంత నిలుచుండెను.

రామచంద్రయ్య.—(వానిజూచి) ఓరీ వీరభద్రా నే డింత యాలస్యము?

వీరభద్రుఁడు.—అయ్యా, నే నింటికి వెళ్లగనే నా కన్నము పెట్టుటకై మా యమ్మ లోపలికి వెళ్ళగా నామెకు తేలు గఱచినది. ఆమె కౌషధములకై దిరుగుచుంటిని.

పార్వతమ్మ.—పోనిమ్ముగాని యిపు డేమైన బాధ తగ్గిన దటరా.

వీరభద్రుఁడు.—అమ్మా! అదియేమి విషపు తేలోగాని ఎన్ని మందులకు తగ్గినదికాదు. తరువాత మా పొరుగువీధినున్న లింగయ్యను దీసికొనివచ్చినాను, అతఁ డేదో యాకుపసరు రాచి మంత్రించిన తరువాత కొంచెము బాధ తగ్గ పండుకొన్నది. ఇప్పుడే నేను భోజనముఁ జేసికొని వచ్చినాను.

పార్వతమ్మ.—సరేకాని నీవు బజారునకు వెళ్ళి యొక వీసె ముంతమామిడిపప్పు, ఒక వీసె కలకండ యొక డజను కిత్తలిపండ్లు

ఒక పీసె పసవు, ఒకవీసె వక్కలు, అయిదు పలములు కుంకుమ, తమలపాకుల కట్ట సీసిని దీసికొని శీఘ్రముగ రమ్ము. యేదైనను మరచెదవేమో కాగితముపై వ్రాసికొమ్ము.

వీరభద్రుఁడు.—"అక్కరలేదండి మఱునకే దెచ్చెద" నని పెద్ద గంపయొకటి దీసికొని వెళ్లెను.

జాబుచూచినవంతనే వారు మాట్లాడుచుండుట విని తన్నత్తవారింటి కంపుదురో యంపరో యను సందియమున కొంతసేపు శోభావతి కేమియు దోఁచకుండెనుగాని ప్రయాణము నూఢియయిన తరువాత మనస్సంతుష్టిగల్గ వంటపనులకుఁ దల్లికిఁ దోడుపడుచు నిటునటు దిరుగుచుండెను.

ఇంతలో బజారుకు వెళ్లిన వీరభద్రుఁడు కూలివాని తలపై గంపను బెట్టించుకొని యింటికి వచ్చెను.

కూలివాఁడు తలపైనున్న గంపను క్రిందదించి దూరముగ నిలుచుండెను.

వీరభద్రుఁడు.—"వానిచేత నొక యణా పెట్టిన వాఁడు అయ్యా బరువెక్కువ నామెడ విరిగిపోయినదే యనెను"

పార్వతమ్మ.—"పోనిమ్మురా వానిచేత నింకొక యర్ధణా నిచ్చి పంపు" మని యిచ్చి పదానిఁ దీసి లోపలనుంచి "కల్యాణీ! నీ చీరలెవ్వియో తెసికొని బిడ్డ చీరలు రవికెలన్నియు దీసి యిటు బడవేయు" మని వీరభద్రుని గదిలోనున్న టుకుపెట్టెయు బేములతో నల్లినబుట్టయును బైటికిఁ దెప్పించి వానిలో గుడ్డలన్ని మడిచి యుంచెను.

బిడ్డ అత్తవారింటికి వెళ్లుచున్నదని కల్యాణి శీఘ్రముగా వంటఁ జేసెను.

రాత్రి [illegible]

రామచంద్రయ్య —అమ్మా. రైలుకు వేళయైనది వారిని త్వరచేయుము.

అందఱికు భోజనము లయినవి.

రామచంద్రయ్య —కూతురిం బిలచి బీరువఁ దెఱచి తల్లీ నీ మనసువచ్చిన చీరను దీసికొమ్ము.

శోభావతి.——నాన్న! నీ కిష్టమైనది తెమ్ము.

తండ్రి.—అమ్మా! అట్లుగాదు ఒకరికి శోభించినది యింకొకరి కంటికి శోభింపదు.

శోభావతి.—తండ్రిమాటఁదీసివేయలేక బీరువలోని పట్టుచీరను దీసికొని అవ్వకునుఁదల్లికిని జూపెను.

తండ్రి.—బిడ్డా! ఒకటే దీసికున్నావే యింక రెండు దీసికొమ్ము వివాహ సమయముగనుకఁ గావలసియుండును.

శోభావతి.—నాన్న! నాపెట్టెలో వలసినన్ని యున్నవి. నీ మాట కష్టజెప్పలేక యొకటి దీసికొన్నాను.

కల్యాణి పెద్ద పళ్లెములో తాంబూలము, పసపు, కుంకుమ, పుష్పములు, పండ్లును చీర రవికెయు నుంచి ఆశీర్వాద పూర్వకముగఁ గూతురిచేతి కిచ్చెను.

శోభావతి పళ్లెము నందుకొని కొంత పసపు కుంకుమ తాంబూలమునుంచి తల్లిచేతికిచ్చి క్రొత్తచీర ధరించి, ముసలాయనకునుఁ దండ్రికిని మ్రొక్కి పార్వతమ్మయొద్దికి వెళ్ళి యామె పాదములనుఁ దాకి కన్నులద్దుకొని నమస్కము బెట్టెను.

ముసలామె మనమరాలిని చేయిపట్టి దీసి యొడిపైఁ గూర్చుండఁబెట్టుకొని చెక్కులు ముద్దిడుకొనుచుండెను.

వీరభద్రుఁడు,—“అమ్మా రైలువేళ కావచ్చినద” నెను

తామెక్కన్నబిడ్డలకన్న తనుబిడ్డలబిడ్డలపై ననురాగ మెక్కువగదా? పాపము! శోభావతి యొకటేబిడ్డ. అదిగాక పుట్టినదిమొదలెన్న డెడబాయలేదు. కాబట్టి ముసలామె యాందోళనముతో మనుమరాలి చెంప లంటపట్టుకొని కన్నుల నీరు నించుచు, "తల్లీ! అత్తగారి కెదురాడకు, మామగారిని తండ్రివలెఁ జూడుము, పెనిమిటిని దైవముగ భావింపుము, నుఱఁదిని బిడ్డవలెఁ జూడుము. అత్త మహాంకాళి యని వినుచున్నాము, దానియొక్క మెలకువతో నడుచుకొమ్మా. పుట్టినయింటికి మెట్టినయింటికిని కీర్తి దెమ్మా, యెల్లరయందును విశ్వాసముగలిగి యణకువతో మెలఁగుము, శాశ్వత సుమంగలివై కనిపెదు బిడ్డల గనుము. పట్టీ! నీవు మగబిడ్డవై యున్న మాకీ చింత లేదుగదా. తల్లీ, యెవరేమన్నను చిన్నవోకు. మముఁదలఁచి చింతింపకు, నా సంపన్నిధీ పోయిరమ్మా. తిరుగ వచ్చునపుడు చూలాలివై రమ్మా" అని దీవించెను.

శోభావతి, లేచి తండ్రికి మ్రొక్కెను. గాఁబదంప్రయ్య ఫాత్రి నెడబాయ వలయునను చింతచే, తోడనే మాటలాడలేక కన్నుల నీళ్లు రాల్చుచు డగ్గుత్తికతో, "తల్లీ! పోయిరమ్మా దీర్ఘసుమంగలివై పిల్లల తల్లివై యశోవతివై మనుము" అని దీవించెను.

అత్తవారింటికి వెళ్లెడు సంభ్రమమున శోభావతి కింతవఱ కేమియు దోఁచలేదుగాని, తన్ను బాయలేక తండ్రియు నవ్వగారును దుఃఖించుట చూచి, తానును గంట నీరు వెట్టుకొనెను.

హయగ్రీవులు, "తల్లీ! శోభావతీ! యిపుడు కంట తడిఁ బెట్టరాదు. మా యమ్మగా" యని గడ్డము పట్టుకొని బుజ్జగింపుతూ దిన్నగ నుడివెను.

పార్వతమ్మ "తల్లీ దిగులు బెట్టుకొనకుము శీఘ్రములో బిలిపించుకొనెద"నని ధైర్యము చెప్పెను,

కల్యాణి బిడ్డతో గూడ వెళ్లుచున్నందున నామెకు నంతగా వ్యసనము తోంచలేదు. వీరభద్రుండు రెండు బండ్లు దెచ్చి సిలిపి పెట్టెలను నొక బండిలోఁ బెట్టెను.కల్యాణియు, నామె తండ్రి హాయగ్రీవులును, శోభావతియు నొక బండిలోఁ గూర్చుండిరి.

ముసలామె.—నాయనా! రామచంద్రా! నీవును వెళ్ళి బిడ్డను బాగబండి నెక్కించి రమ్ము.

రామచంద్రయ్య.అట్లేయని లోపలికి వెళ్ళి యుత్తరీయము దీసి భుజముపై వేసికొని పెట్టెలు పెట్టిన బండిలోఁ గూర్చుండెను.

వీరభద్రుండును బండిని బట్టుకొని రైలునకు వెళ్ళిరి.వీరు వెళ్లు సరికి స్టేషను నొద్ద నప్పుడే పొగబండియు వచ్చి నిలిచెను. వీరభద్రుడు పెట్టెలను దీసి రైలులోఁ బెట్టి వారు ముగ్గురి నెక్కించెను. రామచంద్రయ్య టిక్కెట్లు దీసికొనివచ్చి వారిచేతి కిచ్చెను అంతలో గంటఁ గొట్టగాఁ గూఁతవేసి రైలు వెళ్ళిపోయెను.

తన యనుంగు పుత్రి నెడబాసిన చింతతోడను, తన యేక పుత్రికకు నత్తవారు సరియైనవారు కుదురకపోయిరను దుఃఖముతోడను, నిల్లు చిన్నవోయియుండుననుదలంపు తోడను రామచంద్రయ్య నడువనైన శక్తిలేక స్టేషను విడిచి వచ్చి యొక రాతిపైఁ గూర్చుండి వీరభద్రునితో మాటలాడుచుండి,తన బిడ్డను అత్తవారు సరిగాఁ జూచెదరన్న నామె కేమి యిబ్బంది యగునోయని కొంతసేపు చింతించుచుండి యెట్టకేలకు వీరభద్రునితోఁ గూడ తన యింటికి వెళ్లెను.

# శోభావతి.

## నాలుగవ ప్రకరణము



తంజనగరమున అవధానమువారివాకిట పందిళ్లు వేసి,జరీగుడ్డలతో నలంకరించి యరఁటికంబములును మామిడాకులతోరణములును కట్టఁబడియుండెను. లోగిలియందును పందిలివేసి చౌకములు దీర్చి రెండు పెండ్లియరుగులు వేసి దాని చుట్టును నరఁటి కంబములు, మామిడాకులు కట్టఁబడియుండెను.ఆవేళ పాలస్తంభమగుటచే వాద్యగాండ్రు తలల నాడించుచు మంగళౌదికముగ వాయించుచుండిరి.

కల్యాణి బండిదిగి కొమరితెఁ దీసికొని లోపలికి వెళ్లెను. ముసలాయన బండివానిచే పెట్టెలు లోపలికిఁ దెప్పించుకొని వానికి డబ్బులిచ్చి పంపివేసెను.

బండి చప్పుడు విని గదిలోనుండిన శేషయ్య యీవలకువచ్చి చూచి "ఓహో హాయగ్రీవశాస్త్రిలవారు!రండు కూర్చుండుడు కుంభకోణమునుండి యెవ్వరు రాలేదా"' యని యడిగెను.

హాయగ్రీవులు "అయ్యా' మీ కోడలును, వియ్యఁపురాలును వచ్చినా"రని చెప్పగ "సరే"యని తల నూఁచుచు శేషయ్య లోపలికి వెళ్లెను.

తల్లి వేపాకుముద్ద చేతిలోఁబెట్టి "నాయనా!నాయనా! యిది తిన్న కడుపునొప్పి తగ్గునని చెప్పిన తల్లిమాట"యొక్క వేగాని వేపాకు చేదని తోఁచదు గదా.

పట్టాభిరాముని వివాహమైనది మొదలు, జానకమ్మ వియ్యంకులపై నేదో లేనిపోని దోషముల నారోపించుట కాక, రామచం

ద్రయమ్మయు కల్యాణియు యోగ్యులు గారనియు. నీచస్వభావము గలవారనియుఁ బిల్లయును దల్లివలెనె యున్నదనియు, దెలియక సంబంధము సేసితిమనియుఁ జక్కగా విచారించి వేఱొక పిల్లను గట్టిపెట్టెదమనియు, జానకమ్మ కొడుకునకు చెవి నిల్లు గట్టుకొని చెప్పుచుండినందున నతని మనసు వేఱుదారిని బోవుచుండెను.

ఎట్టివారికిని భార్య మాటలయందు కొంచెము నమ్మక ముండునుగదా! శేషయ్య భార్యయొక్క గయ్యాళితనమునకు వెఱచియో, యామె మాటలయం దపనమ్మకముచేతనో కోడలిమాట స్మరింపకుండెనుగాని, తనకు వారిపై నే విధమైన విరోధమును లేదు. వచ్చిన కోడలిని వియ్యపురాలిని జూచి, జానకమ్మ పెడమోము నెట్టుకొని లోపలికి వెళ్లెను. కొంతసేపటికి, వంటయింటనుండిన శేషయ్యగారి తమ్ముని భార్య సుభద్రమ్మ వెలుపలకు వచ్చి వియ్యపురాలిని కోడలిం జూచి సంతోషముతో లోపలికి దీసికొని పోయి స్నానము చేయించి మడిబట్టలు నిచ్చి కట్టుకొన్నని, వచ్చియున్నవారిని ప్రత్యక్షమున జానకమ్మ నిర్లక్ష్యముగఁ జూచినందులకు మనసున విసిగికొని, "వదినగారూ మా యింటి వారు పెంకె మనుష్యులు గనుక మీ మనసున కొఱంత పెట్టుకొనవలదు" అని కల్యాణిని బతిమాలుకొనెను.

కల్యాణియు వచ్చినతరువాత గౌరవముగా నుండి వెళ్లదలంచి యెన్నియున్నను పైకగుపడనీయక యన్ని కార్యములను జూచుకొనుచు వంటపనిలో సుభద్రమ్మకు సహాయముఁ జేయుచుండెను.

సాధారణముగ కొందఱు పిల్లలు క్రొత్తగా నత్తగారింటికి వెళ్ళిన సిగ్గుచేతనో, తెలియకనో కొన్నాళ్లు చుట్టమువలె వేళకు భోజనముఁ జేసి చాటున గూర్చుండి యుందురుగదా!

## నాలుగవ ప్రకరణము.

మన శోభావతి యట్లుండలేదు. చాలదినములుగ తా నట సంసారము చేసి మాలిమి యైనదానివలె, అన్నిపనులను చేసికొను చుండెను.

అత్తగారు మాటాడకున్నను ఆమె యడుగులకు మడుగు లొగ్గుచు నామె చేతిలోనిపనులను దీసి తానేచేయుచు నడుమనడుమ వంటపనిలో చిన్నత్తగారికి సహాయము చేయుచు చక్రమువలె దిరుగు చుండెను

సుభద్రమ్మ.—శోభావతీ' నీ పత్తగారికి సహాయముగ నీవలి పనులు చూచుకొమ్ము. అన్నిపనులు చూచుకొనవలెనన్న గష్ట మగును.

శోభావతి.—అత్తా! కొత్తబందుగురాలినా? పని సమయ మున మీరందఱు పని చేయుచుండుటయును, నేను విగ్రహములాగున గూర్చుండుట కంత చిన్నపిల్లనా, యేమి!

అని కొంతసేపైన విరామములేక పనులలో దిరుగుచుండెను.

పాపము! కలలోనైన కోడలు రాబోవుచున్నదన్న తలంపు లేకుండిన అసూయాపరురాలగు జానకమ్మ, శోభావతి సద్గుణములకు మనసులోపల మండుచుండ, తనలో, "బండబడ, దీనిరూపము స్త్రీలనే మోహింపఁ జేయుచున్నదే యిక పిల్లవాఁడు చూచెనా దీని వలలోఁ జిక్కుపడుటకు సందియము లేదు. అందమున కనుగుణముగ కలుపు గోలు తనమును నట్లే యున్నది. నేను పలుకకున్నను, సిగ్గయినలేక బలాత్కారమున నాతో తేనెలొలుక మాటలాడుచున్నది. ఈ దరిద్రదేవత రాదని తలంచితిని. ఇంది సమయమున నిది వచ్చిదాప రించినది." అనుకొనుచు భావోద్వేగములకు తన మన సగుపడనీక నోర మోసరుగ నటించుచుండెను.

మరుసదినము పెండ్లివారు వచ్చిదిగిరి.

కల్యాణిని, శోభావలిని జూచినట్లు చూడక జానకమ్మ క్రొత్త వియ్యంకులను చాల మరియాదతో చూచుచు మిగుల శ్రద్ధతో విచారించుచుండగాక చిన్న కోడలిని ప్రాణములతో సమముగ నాదరించుచుండెను.

శోభావలి క్రొత్త వియ్యంకుల నెన్నడును జూచియుండకున్నను, ముందువెనుక వారితో మెలగియున్నదానివలె భేదభావము లేక, "పిన్నమ్మా! స్నానము చేయుదువుగాని లెమ్ము. చెల్లి! ఆకలిచే ముఖము వాడిపోయినది. భోజనమునకు లెండి" యని వారినందరిని స్నానపానభోజనములయందును, తాంబూలము లిచ్చుటయందును బహుమర్యాదతోను, ప్రీతితోను విచారించుచుండెను.

అందఱు రాత్రిభోజనములు జరిపి పరుండిరి. మఱుదినముదయమున ముహూర్తము. గనుక, విరామములేక సుభద్రమ్మ యేదో యొక పనిలోనే యుండెను. కల్యాణియు శోభావలియు నామెకు సహాయముగ నుండిరి. అరుణోదయముననే అందఱు లేచి వివాహకార్యములు చేయుచుండిరి. వాద్యములు మ్రోగుచుండెను. పెండ్లికుమారునకును, పెండ్లికుమార్తెకును మంగళస్నానములు చేయించిరి.

శేషయ్యగారింట యెక్కువ నగలు లేకున్నను, రాజుగారి నగలు కొమార్తెకును, చిన్నకోడలికిని యొడలినిండ గవేసిరి.

పురోహితుఁడు లగ్నము సమీపించెనని వేగిరపఱచుచుండెను. పెద్ద ముత్తైదువలు వధూవరులను వివాహవేదికయొద్దకు దీసికొనివచ్చి నిలుప పురోహితుఁడు వారిచేతికి పుష్పమాలికలనిచ్చి యొకొక్కరికి మాలికలు సమర్పించి వారి హస్తములకు కంకణములం గట్టి

బ్రాహ్మణు లాశీర్వాదపూర్వకముగ శేషలు జల్లుచుండ మంగళ వాద్యములు మ్రోగుచుండ, నిరువురు కన్యలకును మంగళసూత్ర ములధరింపజేసి తలంబ్రాలు పోయించిరి. ముత్తైదువ లానందముల బాడిరి. కల్యాణియు, శోభావతియు వచ్చినవారికి పసుపు, కుంకుమ, గంధము తాంబూలము నిచ్చుచుండిరి. జానకమ్మ యేపని చేయకు న్నను చేసినవారికి నంకెలుబెట్టుచు పెత్తనములఁజేయుచుండెను.

తల్లిదండ్రుల కొక్క కూఁతురయ్యెప్పుడైనను మిక్కిలి గారవమున బెరిగిన దయ్యు, శోభావతి వచ్చినవారినందరిని భోజనములయందును, తాం బూలము లిచ్చుటయందును చాల యుపచరిం తోను భక్తిశ్రద్ధలతోను నడచుకొనుటఁజూచి జానకమ్మతప్ప మామగారును క్రొత్తవియ్యంకు లును వచ్చినవారెల్లరును చాలమెచ్చుకొనుచుండిరి.

ఐదుదినములకు వివాహము ముగిసెను. వచ్చిన బంధువు లంద రును వెళ్ళిరి. క్రొత్తవియ్యంకులు కొమార్తెను అల్లుని దీసికొని వెళ్ళిరి. జానకమ్మను రమ్మని చాలనిర్బంధముచేసిరిగాని, ''కొమార్తెతో గూడ వియ్యపువారియింటికి వెళ్లవలెనుగనుక మలివిందునకు వచ్చె దను'' అనిచెప్పి వారినంపివేసెను.

ఆరవదిన ముదయమున జానకమ్మ బియ్యము, పప్పు, నెయ్యి మొదలగు సామగ్రియు కొబ్బరికాయలు, పండ్లు, పూవులు, సాంబ్రాణి కర్పూరము మొదలగు పూజాద్రవ్యములను దీసికొని నౌకర్లుకూడ రాఁగ కూతురును దానును గుడికి వెళ్ళిరి.

వియ్యంపురాలు కోడలిపై నేదో నిందలుబెట్టుచు నడిమికి ట్లు బెట్టుచుండుట జూచి, కల్యాణికేమియు దోఁచక కుమార్తెను ప్రక్కకు దీసికొనిపోయి ''తల్లీ! వివాహము ముగిసినదిగదా? యిక మము పయనమయిన బాగుండును,'' అనెను

శోభావతి.—కొంతసేపు క్రిందుఁజూచుచు నెద్దియో యోచిం చుచుండి తర్వాత] అమ్మా! ఇపుడువచ్చుట నాకిష్టములేదు.

కల్యాణి —ఏల అట్లనెదవు నిన్నిట విడచి నే నొంటరిగ వెళ్ళిన మీ తండ్రి కోపపడరా!

శోభావతి.—"ఎందుకు" అన్నొట్లు లేకలేక యీ నెపమునన్నైన వీరుత్తరము వ్రాసిరి. తిరుగ నేనచటికి వచ్చినట్లైన వీరు నను స్మరించుటేకష్టమగును. లోకమున నందఱు శాంతముగలవారై యుం డెదరా! యనిచెప్పుచుండ" యెవరిదో కాలిచప్పుడువిని చెరియొకవంకఁ బోయిరి.

మధ్యాహ్నమైనది. మగవారి భోజనములు కాగానే, కల్యా ణియు, శోభావతియు, సుభద్రమ్మయు భోజనములకు గూర్చుండిరి.

కల్యాణి.—సుభద్రమ్మను జూచి వదినగారూ! మీ అక్క గారును, మాణిక్యాంబయు అగుపడలేదేమి?

సుభద్రమ్మ.—మా పట్టాభిరాముడును, సుబ్బరాయుడును పుట్టిన తర్వాత ఆడపిల్లలు లేరన్న చింతతో మా అక్క సీయూర నున్న [illegible] నారాధించుచుండ, నీ పిల్ల బుట్టినది. అందువల్లనే మహ [illegible]యని పేరు బెట్టిరి. మా పిల్ల పుట్టినదిమొదలు పెద్దామె పిల్లతోగూడ అప్పుడపుడు గుడికి బోయి పొంగళ్లు మొదలైనవి నైవేద్యముచేసి దర్శించి వచ్చుచుండును. నేడును అచటికే వెళ్ళెను.

కల్యాణి అట్లైన చాల ప్రొద్దైనది యింకను వచ్చిన [illegible]

సుభద్ర.—వారచటనే అమ్మవారి ప్రసాదమును భోజ నముచేసి యెండ [illegible] నెనుక సంధ్యవేళకుఁగాని రారు.

శోభావతి భోజనముచేసి చేయి కడుగుకొని గుంజన తడిబట్ట ను భుజముపై వేసికొని మిద్దెమీదికివెళ్ళెను.

కూతురిప్పుడు పయనముగానని చెప్పినది మొదలు కళ్యాణి కేమియుం దోచక సుభద్రమ్మతో "వదినగారూ! మీరింత ప్రీతిగ నుండబట్టి మిమ్ముల నొక యాలోచన నడుగ దలంచినాను, అడుగుదునా!" అనెను

సుభద్రమ్మ—వదినెను వరుసకే ప్రేమయుందునన్న మీ తో యుబ్బుగ నెంచుకొందునేగాని భేదమెంచుకొనవద్దు.

కళ్యాణి—"శోభావతి విషయమున మీ పెద్దాము జూపెడి గడి ముడిపాటు మీరు మోచుచున్నారుగదా!" యని కన్నులనీరు గ్రమ్మ నుంచు "వదినే! నేను కాపురమునకు వచ్చిన తర్వాత ఎన్నాళ్లకు పిల్ల లు లేక మా అత్తగారు దేవుళ్ళకు మ్రొక్కి నాచేత నెన్నియో నోములు నోపిం చి యీపిల్ల కలిగినది. మగవాండ్లు పుత్రులున్న మాకేచింత లేక పోవు నుగదా అదే మగపిల్లవాడని మనము తృప్తిజేసికొని కంటికి రెప్పవలె నాకిన పిల్లను అత్తగారు చక్కగా జూచుకున్న నిప్పుడు మాకు వేఱుచింత కావలయునా! యెంతభాగ్యమున్న నేమి? పిల్లవాని యాధారమేగదా కా వలసినది! నాకన్నను మా అత్తగారికి పిల్లయనిన ప్రాణముతో సమా నము ఇవియన్నియు మా మనసులో మెదిలె"యని దుఃఖముగ్రమ్మి కన్నీటి ధారలు గురియుచుండ మాటాడలేక ముఖమునకు చెఱుగడ్డము పెట్టు కొనెను.

ఆమెదుఃఖమును జూడలేక సుభద్రమ్మ కన్నులనీరు పెట్టుకొ ని లేచి చేయికడుగుకొని కల్యాణియొద్ద గూర్చుండి ముఖమున చెరు గు వేసి కన్నులుదుడిచి "వదినే నేనున్నంతవఱకు పిల్లకొకలోటులే దు. జూచుకొనెద, అందుకై మీరుచింతపడ నక్కఱలేదు. శోభా వతి మాచిన దిగులొందదా! ఆమె స్వభావమట్టిది, చేయుదము!

పెద్దామె మాట మీకక్కరలేదు''యని యామె నోదార్చెను.

కళ్యాణి తోడనే మాటలాడలేక కంఠము కొంత కుదుటపఱచుకొని ''వదినెగారూ! రేపు పిల్లను దీసికొని యూరికి వెళ్ళెదను''అనెను.

సుభద్రమ్మ కొంతసేపు తలవంచుకొని యోచించుచుండి ''వదినే! పిల్లను దీసికొని వెళ్లుట నాకుచితముగా దోచదు. మావారని పేగుణములు దాచిపెట్టుకొన్న నాకు పాపము సంభవించును వారు మోటుపట్టుగలవారు మరియు పెద్దామె సంగతి చెప్పవలయునదే లేదు. ఇప్పుడైనను మీకు శ్రమ వ్రాసి యుండునని నేననుకోలేదు. మాటవాసి కడిగినను ఆమె వెంట దీసికొని పొమ్మనియే చెప్పెను. మా బావగారున్న నోరుగయ్యాళియగు భార్యకు వెఱచెదరే గాని ఆయనకంత కఠినస్వభావము గాదు. పిల్లవానికి పసిదనమే గాక యింకను పిల్లను చక్కగాఁజూచి యెఱుఁగడు చక్కనటి పిల్లను జూచిన వానికి ప్రీతిగలుగక పోవుటకు ఆ వాఁడేమి కన్నులు లేనివాఁడా? కాబట్టి పిల్లను దోడ్కొనిపోవద్దు'' అని చెప్పుచుండ శోభావతి మిద్దె దిగివచ్చి ''యింకను భోజనము చేయుచున్నారా?'' యనెను. కల్యాణి పిల్లబెంగబెట్టుకొను నియామకారెల్లఁజాలించి లేచి చేతులు గడుగుకొనెను.

సంధ్యవేళయగునప్పటికి జానకమ్మయు మహాంకాళియువచ్చిరి జానకమ్మ కొబ్బెరముక్కలు కుంకుమపువ్వు మొదలగు దేవీప్రసాదమును సుభద్రమ్మ చేతికిచ్చెను, సుభద్రమ్మ కల్యాణికిని శోభావతికిచ్చి తానునుకొంత దీసికొనెను.

రాత్రియందఱు భోజనములు చేసి పరుండి నిదురించిరి కాని తన యెదుటనే నిప్పులు ద్రొక్కుచుండెడి అత్తగారు తాను వెళ్ళిన పల్ల

గుండెచూడవలసివచ్చును. నన్ను గన్నందుకు మీకే మాత్రమును సుఖములేకుండును, కనుక నేనిపుడు నిలుచుటేమేలని కంట నీరుపెట్టుకొనెను,

తన గారాబుపుత్రి దుఃఖమును జూడలేక తానును చింతించుచు కల్యాణి శోభావతి కన్నులదుడిచి "తల్లి చింతిలకు నీయిష్టము మేరకిచట నేనిలువుము. నేను వెళ్ళి యీ మాసము రోజులలో నిన్ను బిలిపించెదను" అనియోదార్చి తెల్లవారవచ్చుచున్నది కనుక నెవరైన మొలకువవచ్చి వినబోయెదరని తల్లి బిడ్డలిద్దరును మౌనముతో పండుకొనియుండిరి.

కల్యాణి యుదయమున దొడ్డిచావడిలో దంతధావనము జేసికొనుచున్న తండ్రినిజూచి "నాన్న! మనమీవేళ యూరికివెళ్లెదమా!" యనెను.

హయగ్రీవులు—అల్లే కానిమ్ము, బిడ్డయేమి చెప్పుచున్నది?

కల్యాణి—బిడ్డ చెప్పునదేమున్నది తాను నిలచునట (యనిచేత సంజ్ఞజేసి) మీరు వియ్యంకులతో జెప్పి ప్రయాణము గండు,

"అల్లే" యని హయగ్రీవులు ముఖము గడుగుకొని లోపలికివెళ్ళి నుజూచి "మేముండు" యీ వేళ ఊరికి వెళ్లెదమను చియున్నాము,

శేషయ్య—ఇంతలో వెళ్లవలయునా! నాలుగు రోజులుంచి వెళ్ళరులేండి.

హయగ్రీవులు—ఇంట ముసలామె ఒక్కతె యిబ్బంది పడుచున్నది.

శేషయ్య—అట్లైన మీయిష్టము.

భార్యకు వెఱచి శేషయ్య యేపనియందును ప్రకాశించకుండెను. కాని శోభావతియొక్కయు నామె తల్లియొక్కయు గాంభీర్యమును శాంతమును వినయవిధేయతలును ప్రత్యక్షమున జూచినందున వారి

విషయమునఁజాల ప్రతిఘటించినఁగాని గయ్యాళియగు జానకమ్మ వారి నింకను నగఁబుచేయునని తెలిసి యేమియు బయలుపడనీయకుండెను. హయగ్రీవులును,కల్యాణియు వేగిరము భోజనముచేసిరి.

కల్యాణి శోభావతిని దగ్గఱఁ దీసికొని కౌఁగిలించుకొని ముద్దిడుకొని "తల్లీ! నేనుపోయివచ్చెద, నీవుగుణవతివి, నేను నేర్పు చెప్పవలయునది లేదు, పెనిమిటియొద్ద భయభక్తులతో నడచుకొనుము, పెద్దామె మాటలకుఁ జిన్నఁబోకుము ఆడుబిడ్డను మెలకువతోఁ జూచుకొనుము, చిన్నత్తగారే నీకు తల్లియనుకొనుము" అనెను. శోభావతి తల్లిచేతులం బట్టుకొని కంటనీరు పెట్టుకొనెను.

సుభద్రమ్మ దగ్గఱఁజేరి "యేమే శోభావతి నీవేమి చిన్నపిల్లవా? నేనుండఁబట్టకు నీ కేమి కష్టము గలుగనీయనుకొనుము, మీ తల్లికి ధైర్యము చెప్పిపంపక, నీవు బుద్ధిశాలినివైనందుల కిదియేనా గుఱుతు!" అనిచెప్పి కల్యాణినిఁజూచి "వదినే! శోభావతినిఁ జూచుకొను భారము నాది, మీకా చింత యక్కఱలేదు" అని ధైర్యము చెప్పుచుండెను.

హయగ్రీవులు లోపలికి వచ్చి మనుమరాలినిఁ జూచి "తల్లీ! శోభావతీ నేనుపోయివచ్చెద గుణవతివని కీర్తి తెమ్ము." అని సుభద్రమ్మనుఁజూచి, "అమ్మా! నా పిల్లకు నీవే తల్లివి" యనిచెప్పి "కల్యాణీ! రైలువేళయగుచున్నది, వేగిరపడుము" అనెను.

కల్యాణి జానకమ్మయొద్దకువచ్చి చేయిపట్టుకొని "వదినగారూ! నేనూరికి వెళ్ళి వచ్చెద, మా కోడలిని మీ కప్పగించినాను, మా మాణిక్యాంబతో సమానముగఁ జూచుకొనుఁడు" అని కనుల నీరు పెట్టుకొనెను. జానకమ్మ చేయివిదలించుకొని సణుగుకొనుచు నావలికి వెళ్ళెను. పోకకు తాంబూలమైన నిచ్చినది కాదు.

కల్యాణి—(మరియు భయము నోఁచి తిరుగ లోపలికి వెళ్ళి సుభద్రమ్మను జూచి) "వదినగారూ! మీ రెంతచెప్పినను నాకు ధైర్యముదోఁచదు.పిల్లను విడిచి వెళ్ళుటకు కాళ్ళాడకున్నవి. నాతోడ దీసికొని వెళ్ళుదునా?

సుభద్రమ్మ—వదినే! పిల్లను గుఱించి చింత మీకక్కఱలేదు, దాని సౌఖ్యము నాది యనకొనుము.అందుకయి నీకు చింత వలదని మఱిమ్మాఱు చెప్పెదను"అని యోదార్చెను.

కల్యాణి—(కంట నీరు పెట్టుకొని యొకచేతితో సుభద్రమ్మ చేతిని మరియొక చేతితో సుభద్రమ్మ గడ్డమును బట్టుకొని) "వదినే! శోభావతి నాకడుపునఁ బుట్టలేదు మీకడుపునఁ బుట్టిన దనుకొనుఁడు దానికి మీరే తల్లి సుమా (యని యేడువసాగెను)

ఆమె దుఃఖముఁ జూడలేక కన్నుల నీరుగ్రమ్ముచుండ సుభద్రమ్మ కల్యాణి గడ్డముఁబట్టుకొని "మీరింతగావాపోయిన పసిపిల్ల బెంగ పెట్టుకొనదా? మా అమ్మగా, ధైర్యముతో వెళ్ళిరమ్ము" అని ధైర్యము చెప్పెను.

కల్యాణి కూతురు విడువలేక, పలుమారు ముద్దులిడుకొని, యెట్టకేలకు మనసు గట్టిచేసికొని గదిలో పరుండియుండిన శేషయ్యతోఁజెప్పి హాయగ్రీవులును దానును వెళ్ళిపోయిరి, కై లెక్క కల్యాణి వెళ్ళినదే గాని ఆమె మనసుమాత్రము కూతురును విడిచి వెళ్ళలేదు.

వియ్యంపురాలు గడపదిగి వెళ్ళినదే తడవుగ జానకమ్మ కోడలిని జూచి సంతసపటపటం గొఱుకుచు "ఓసీ వగలాడీ! నీయమ్మ విఱుగఁ బడి పోయినదే. ఇట నిన్నవరైన విఱుచుకొని తినుచున్నారా? నీయమ్మయు,నీవును దేవలోకమునుండిదిగివచ్చినామనుకొన్నట్లున్నది." అని యఱచుచుండ, నామె కేకలువిని సుభద్రమ్మ యీవలకువచ్చి

"అక్కా పోనిమ్ము, లోకమునం దల్లులు అత్తగారి కప్పగించురీతిని ఆమె చెప్పినదేగాని, అదియొక తప్పుగాదుగదా" అనెను.

జానకమ్మ—సుభద్రా! నీ నోరు మూసికొనుము, పానకములోని పుడకవలె అక్క పడకుము అంతేగారాబుకూతురు నేల విడిచి పోవలెను? ఇట నెవ్వరైన బతిమాలుకొనిరా?

సుభద్రమ్మ—అక్కా! యెన్నాళ్లకైనను నుసపిల్లయేగాని, వారికేమి స్వాతంత్ర్యమున్నది? ఆమెకు తెలిపిచాలదు? పెద్దదానవు. అందరితప్పులు సైరించుకొనవలయునుగదా? అని చెప్పుచు లోపలికి వెళ్లెను.

గచ్చకాయల గుంపు కాలించినట్లు శోభావతినో సుభద్రమ్మనో నిందించుచు జానకమ్మనోరు సదా వాగుచునేయుండెను.

ఒకరాత్రి పదునొకండు గంటలకు పట్టాభిరాముఁడు భోజనము చేసి వాడుకచొప్పున పొరుగు వీధి నొక మిత్రునియింటి వాకిట తలుపు తట్టుటకు ధైర్యము లేక యింటికి వెళ్లుటకు మనసు రాక మిడుకుచు నిలిచియుండెను.

దానికని దీనికని లేని వ్యయముచూపి పట్టాభిరాముఁ డెప్పటి కప్పుడు తండ్రియొద్ద పైకము దీసికొనుచుండెను. ఇతని దుష్టచర్యలను దెలిసి నాలుగుమాసములనుండి శేషయ్య డబ్బిచ్చుట మానివేసెను. సంసారము గుల్లయగుట కేకదా వెలయాండ్ర సహవాసము చేయుట! రెండుమాసములు డబ్బున "కిదిగో, అదిగో" యని చెప్పి పట్టాభిరాముఁడు సానియొద్ద చీవాట్లు పడుచుండెను. నొసటి వ్రాతదప్పింప నెవరితరము? రతీదేవివంటి యిల్లాలి నింట విడిచి పలుగాకిస్త్రీయొద్ద పరువు దప్పిన మాటలఁబడుమని బ్రహ్మ వ్రాసెనేమో! యెవరేమి చేయఁగలరు? నిన్నటిదినము రేపిల్లైన పై నాలుగుమాసముల పైకము దెచ్చెదనని చెప్పి తప్పించుకొనివచ్చెను. కనుక నీవేళ సానిదర్శనము గలుగునో

కలుగదో యని చాలసేపు మిడుకుచుండి యావేళ గూడ నేదైన బొంకి తప్పించుకొనవలెనని ధైర్యముం దెచ్చుకొని తలుపుం దట్టెను.

అంతట లోపలినుండి "ఎవరు? ఎవరు?" అని యరచుచు నొకస్త్రీ వచ్చి తలుపుదెరచెను. ఆ స్త్రీ సుమారు ముప్పది సంవత్సరముల వయసుగలిగి, యొకలిపై నగలేమిలేకున్నను చిట్టివెండ్రుకలును, పుక్కిలి ప్రక్కలగునట్లుండిన పొగాకు విడెమును, కట్టుకొని యుండిన బట్టలునై ఖరియు నామె పనికత్తెయని తెలుపుచుండెను.

పట్టాభిరాముండు దానిని గుఱుతెఱిగి యున్నవాండు, గనుక దానింజూచి "కుప్పీ నేను వచ్చియున్నానని మీ యజమానురాలితోం జెప్పు"మనెను. కుప్పి మంచిదని తలయూపి, బిరబిర మిద్దెమీందికి వెళ్ళి, గదిలో మంచము మీంద పరుండియుండిన యజమానురాలితో "అమ్మా పట్టాభిరామయ్యగారు వచ్చియున్నారు" అని చెప్పెను. యజమానురాలు "ఓసీ వట్టిచేతులతో వచ్చిన నిచట నేమిపనిలేదు వెళ్లుము"ని చెప్పుమనెను. కుప్పివచ్చి "అయ్యా వట్టిచేతులతో వచ్చిన మాయమ్మ వెళ్లుమని చెప్పెను" అనెను.

పట్టాభిరాముడు కుప్పీ "మీఅమ్మతో నొకమాట యున్నదని చెప్పుము" మనెను.

కుప్పి వీరినదుకుం దిరుగుటలో 'నాకాళ్ళు కలుదిగుచున్నవే గాని నాకేమి దమ్మిడీలాభములేదు" అని సణుగుకొనుచు వెళ్ళి అతని మాటను యజమానురాలితోం జెప్పినంతనె డబ్బు దీసికొని వచ్చియున్నాడని యజమానురాలు తలంచి "అట్లైనరమ్మని చెప్పుము" మనెను.

దాసి ఆమాట చెప్పినతోడనే పట్టాభిరాముండు పెన్నిధిగన్న పేదవలె యుబ్బితబ్బిబ్బులై ఒక్కదాటున మిద్దెమీందికివెళ్ళి గదిలోని కుర్చీపైనున్న తనవిటురాలింజూచి "ప్రాణసఖీ! చంద్రవదన్నన

మున కాతురపడు చకోరమువలె వాకట తపించుచున్న నన్నింత కా రించుట నీకుఁ బాడియా? నిన్నునమ్మిన నాపై దయదప్పిన నాగతి యేమి? కనక రత్నమా! మరుబారింబడి నులమల మాఁడుచున్న నన్ను చల్లఁజేయుమా! సుందరీమణీ! నా విన్నప మాలకింపుమా "

కనకరత్నము బదులుపలుక లేదు. డబ్బు లేదని తెలిసిన కనకరత్న మేమిమండిపడునో యనిభయపడుచు చెప్పక విధిలేదని తెలిసి పెదవు లు దడపుకొనుచు పట్టాభిరాముఁడు "నాబహిఃప్రాణమా! నిన్నుబాసి యుండలేక అప్పుడే మాతండ్రియొద్ద డబ్బుదీసికొని రావలెఁచి యిం టికివెళ్ళగా నాయన యూరికి వెళ్లెనట. రేపాయన రాకున్నను నెవరినైన నడిగి బదులైనఁ దేక మానను" అనెను.

కనకరత్నమునకు సుమారిరువదిరెండు సంవత్సరము లుండును చామన చాయగలిగి స్థూలశరీరమును, పొట్టిమొగమును చిన్న కన్ను లును కొంచెమెత్తైన దంతములును గలిగి యుండెను.

వరసతి యెంత చక్కనిదైనను కనులకు సహించదు కాఁబోలు 'రాజు మెచ్చినదే రంభ'యన్నట్లు శోభావతియొక్క యెడమపాదమున కైన సరిపోలనిజారిణి పట్టాభిరాముని కనుల కప్సరసయై తోఁచు చుండెను.

పట్టాభిరాముని మాటవిని కనకరత్నము తోకద్రొక్కిన సర్పమువలె మండిపడి "ధనము కూడఁబెట్టుకొనవలయును. చెలిమి యెక్కువగావలయునన్న వలనుగాదు, ఇఁక నీవు వెళ్లు" మనెను.

పట్టాభిరాముఁడు—(లేచి దానిగ్రహస్తముఁ బట్టుకొని) "నాబహిః ప్రాణమా! నీవట్లనకుము నిన్ను వంచన చేసిన ఘనము నా కేల?"

కనకరత్నము— (అతనిచేతి నవతలికి [illegible]) " మగవారి

మాటలు నమ్మఁగూడదు, నీపెండ్లము గూడ నింటికివచ్చినదని విన్నాను. ఇఁకనాదాక్షిణ్యము నీకెందుకు?

పట్టాభిరాముఁడు—మాతమ్ముని వివాహమపుడు, వచ్చినట్లున్నది. కాని దానిముఖము నేఁజూచినది లేదు.

కనకరత్నము—చదువుకొనిన బ్రాహ్మణుఁడవై యుండియు నాముఖస్తుతికై యేలనబద్ధము లాడెదవు? ఇంటనున్న పెండ్లమును జూడలేదన్న నెవరైన నవ్వరా? నుగవారిచ్చకములతో నే కార్యముల నెరవేర్చుకొందురు నీకునాపై నిజమైన మక్కువయుండెనేని నీ యాలి యొంటి సొమ్మయిన దెచ్చి యుండవా?

ఆమాటవినఁగనే పట్టాభిరాముఁడుచివాలున లేచి యింటికివచ్చి మిద్దెమీఁది గదిలోఁగూర్చుండి యిట్లు యోజించెను. "నేనుమగవాఁడనై యుండియు నాప్రియురాలు చెప్పువఱకు నాకీయోచన దగుల లేదు. తెలిసినను యేమి చేయఁగలను. అదివచ్చిన మూఁడుమాసములఁబట్టి దానిముఖమైనను జూచినది లేదు ఏవిధమున దాని సొమ్ముడుగఁగలను? నిదురించునపుడు ఏదేని సొమ్మూడ బెఱకుకొందమన్న దొంగయని వెఱచి కేకలు పెట్టిన నందఱు లేచెదరు అపుడుచిక్కుదును" అని కొంతసేపు ఆందోళన పడుచుండి తర్వాత నెద్దియో యోచనదగిలి వెనుకలోఁగిలి మెట్లనుదిగివచ్చి "పిన్నమ్మా! పిన్నమ్మా!" యని పిలచెను.

సుభద్రమ్మ కపుడే కూరుకు పట్టియుండుటచేఁ బలుకలేదు పట్టాభిరాముఁడు మఱిదగ్గరనిలచి బిగ్గఱగా పిలువ సుభద్రమ్మ యులికిపడి లేచి "యేమిరా, పట్టాభిరామా!" యనెను. పట్టాభిరాముఁడు తిన్నగా "నీకోడలిని మిద్దెమీఁది కంపు"మని చెప్పివెళ్లెను.

"దినమెట్టిదో చూడలేదు, కోడలిని బంపితిని, పెద్దామెకు రవంత పాలకున దెలిసిన గయ్యాళి తనముఁజేసి దాని నల్లరిబెట్టక

మానదు, తుదకెట్లైనఁగానిమ్ము వానికి మంచిగుణము కుదురుటే కష్టము''సుభద్రమ్మ యిట్లనుకొనికోడలిని పిల్కాలిపి,''అమ్మా! నీమగఁడు పిలుచుచున్నాఁడు,మిద్దెమీఁదికి వెళ్లుము''మనెను.

మగనితో మాటలాడకున్నను నెదుటనిలిచి ముఖమైన చక్కగాఁ జూచియెఱుఁగదు, కాబట్టి గడగడ వడఁకుచు, శోభావతి, గుండెలు తటతటఁగొట్టుకొనుచుండ ''అత్తా! నాకుభయమగుచున్నది. నేనెట్లు వెళ్లుదు''నని చెప్ప, సుభద్రమ్మ కోడలి వీపునఁ దట్టుచు అమ్మా! నీవేమి జడియకుము. లోకుల కందఱకుఁ గలిగినదేకదా! పెద్దామెకుఁ దెలివియుండిన అన్నికార్యములు సరిగా జరుగును. నేనుగూడ వచ్చెదనురా'' యని చేయిపట్టి తీసికొనిపోయి మిద్దెమీఁది గది లోవిడిచి తాను క్రిందికి దిగివచ్చి పరుండెను. శోభావతి దిగులుపడుచు కొంతసేపు తలుపు నానుకొనియుండి, ధైర్యము దెచ్చుకొని, పతిపాదములకు నమస్కరించెను. దుర్విచారుఁడగు పట్టాభిరాముఁడు కొంతసేపామెచెంతఁగూర్చుండి తరువాత నామె చెంపపై నొకదెబ్బ గొట్టెను.

నిరపరాధముగ గొట్టుటచే శోభావతి యులికిపడి లేచి పతిపాదములం బట్టుకొని ''నాయందలి యపరాధముల మన్నించి నన్నురక్షింపుఁడ''ని వేడుకొనుచుండ నాకఠినాత్ముఁడు ఎడమచేతనామె సిగఁబట్టుకొని కుడిచేతితో వీపున గబగబ గ్రుద్ది మెడనున్న కంటెనూడదీసికొని వెళ్ళిపోయెను.

మగని దుష్టత్వమున కావంతేని కష్టముదోఁచక యెట్లైనను పతిపాదసేవ తనకులభించుటచేత తన జన్మము పావనమైనదని మహాదానందముతో శోభావతి మిద్దెదిగివచ్చెను.

కోడలింజూచి సుభద్రమ్మ''యింతతొందరేలనే కొంతసేపుండికారాదా!''యనఁగ ''అత్తా! మీకొమారుఁడు యిపుడే యెటకోవెళ్ళిర

ని చెప్పి శోభావతి పరుండెను. సుభద్రమ్మ లేచి వీధివైపున జూడగా వాకిలి దెఱచియుండ కొడుకు తలుపు తెరచుకొని వెళ్ళినాడను కొని వాకిలిగడెవైచి వచ్చి తాను బరుండెను.

దుశ్చరితుఁడగు పట్టాభిరాముఁడు గుణవతియగు నా సాధ్వీమణి నొకనాఁడైనను బ్రీతితో నాదరింపకున్నను వేశ్యాంగనలను సంతసింపఁ జేయుటకయి యపుడపుడు భార్యను బెదరించి మర్దించి యామెయొడలి నగ లొకటొకటి దీసికొనుచుండ నాసచ్చరిత నోరయినను దెఱవక మాతృసమానయైన చిన్నత్తగారితోను జెప్పక తుదకు మనసునందైన కొఱతయుంచుకొనక తన్ను మర్దించినను సంతోషమేగాని తనసొమ్ము పెనిమిటికి వినియోగ మగుటే చాలునని యనుకొనుచుండెను.

ఇట్లు మెడలోనివి చేతిలోనివి సొమ్ములన్నియు లేకుండుట జూచి మనసు విసిగి తీసి పెట్టెలో నుంచిన దనుకొని సుభద్రమ్మ "ఏమే శోభావతీ! ముసలిదానివలె నన్నియు దీసివేయుచున్నావ"ని కోపపడగా "అత్తా! యొడలిలో కసకసలాడుచుండ తీసిపెట్టినాన"ని చెప్పి శోభావతి నవ్వుచు నావల వెళ్ళెను.

కొడుకు చేయుచుండు దుష్కార్యములన్నియుఁ దెలిసి దుఃఖపడుటకు మారుగా నీవిధముగనైన శోభావతిని ప్రహరించుచున్నాఁడుగదా యని జానకమ్మ సంతసించుచుండెను.

పెనిమిటి నడచు చెడుదారికిఁగాని యత్తగారు పెట్టెడి యారడికిఁగాని ముఖమైనఁ జిన్నబుచ్చుకొనక అత్తగారి కడుగులకు మడుగులొత్తుచును దనయందు భయభక్తులతో నడచుకొనుచును నెల్లవారి యందును వినయవిధేయతలతో మెలఁగుచుండు కోడలింజూచి శేషయ్యకుఁ జాలప్రీతి కలిగెను.

ఒకనాడు రాత్రి శేషయ్య భోజనముఁ జేయుచు, వడ్డించుచున్న మఱదలింజూచి "సుభద్రా! మనపెద్దవాఁడు చాలదుర్మార్గుఁడయినాఁడు, తల్లివానికి బుద్ధిఁచెప్పుటమాని వాఁడుచేయుదుర్మార్గము చాలదని నోరులేనిపిల్లను సదా వేపుకొని తినుచున్నది. పాపమాపిల్ల యెంతకును అధరస్పందనమైన జేయదుగదా! అదిగాక దానియొడలిమీఁది నగలు ఒక్కొక్కటొక్కటిగాఁ జాలవఱకుఁగనఁబడలేదు. అవి త్రయేమైన దీసికొనియుండునా" అనెను.

సుభద్రమ్మ "ఏమైనదో, నేనెన్నిసార్లడిగినను తీసిపెట్టినాననుచున్నది, కాని నిజముచెప్పదు" అనెను.

"మీయక్కమంగళములో మాడ్చుచుండెగా నీవైననాదరణముఁజూపకున్న పిల్లగతియేమగును? నీవెట్లైన మంచిమాటలతో నగలను గుఱించి యడిగి తెలిసికొను"మని చెప్పి శేషయ్య లేచి చేతులు గడుగుకొని వెళ్ళిపోయెను.



# శ్రీ భాగవతి

## అయిదవ ప్రకరణము.

—o—

తంజావూరు అగ్రహారపు వీధిలోనొక యింటియరుగుపైన నువది సంవత్సరముల వయసుగల యొక బ్రాహ్మణుఁడు కూర్చుండి తాటియాకుల పుస్తక మొకటి చేతఁబట్టుకొని చదువుచుండెను. ఘంటలు పది యగు నప్పటి కాయన లోపలనున్న తనభార్యను బిలిచి "సూర్య నారాయణగారి కోడలు ప్రసవించినదిగదా! నేఁడు పుణ్యాహవాచన మని పిలిచిపోయిరే మరచితివా, యేమి?" అనెను.

అలమేలమ్మ—మీరుచెప్పలేదని యూరకున్నాను.

బసవయ్య—చెప్పుటేమి! పిల్లలను దీసికొని వెళ్ళిరా

అలమేలమ్మ "అట్లే"యని లోపలికివెళ్లెను. ఈమెకు నలుగురు కుమారులును ఒక్కకొమార్తెయుఁగలరు. పెద్దకుమారునికి చిదంబరములోనున్న తనయన్నకొమార్తను దీసికొనెను. మఱియిద్దరికి గూడ నూరు పిల్లలనుజేసికొనెను. కడపటి కుమారునికిఁగూడఁ బోపుగూరు పిల్లయైన రాకపోకలకుఁ జాలకష్టముగ నుండునని తలచిఅవధానము శేషయ్యగారికొమార్తెమహాలక్ష్మిని జేసికొనిరి, పెద్దకోడలు ప్రసవించి యిప్పటికి మాసముగడచినది. కాన ముగ్గురుకోడండ్రను గూతును దీసికొని పోదమని పిల్లలనందఱిని బయనము గమ్మని తానుత్వరగా వంటచేయుచుండెను.

కొంతసేపటికి అలమేలమ్మ వంటచేసి వెలుపలకువచ్చి మూలలోఁ బండుకొనియుండిన చిన్నకోడలింజూచి "మేమే, మాణిక్య

ము' వారందఱు స్నానము చేసి తలదువ్వి కుంకుమము బెట్టుకొని సిద్ధముగ నున్నారు; నీవింకను తల గంపవలెఁ బెట్టుకొనియున్నావే? ఇంత పొద్దైనదే? భోజనములకా వెళ్లుట?" యని యడుగగా మాణిక్యము నిప్పుద్రొక్కిన క్రోఁతివలె మండిపడుచు లేచి, "మీ శుభభోజనమునకువెళ్లుదురో, పండుకొన వెళ్లుదురో, యెవరికిఁదెలియును. నేను రాను" అనెను

అలమేలమ్మ—పసిపిల్లవు, రమ్మన్న రావలయును గదా? మీ మామగారు పిల్లలందఱిని దీసికొని వెళ్లుమనిరి.

మాణిక్యము—వెళ్లుమన్న మీరందఱు వెళ్ళుఁడు. భిక్షుకుల పిల్లవలె వచ్చుట నాకిష్టము లేదు.

అలమేలమ్మ—నీవు భిక్షుకుల పిల్లవని యెవరు చెప్పిరి? మీ తండ్రి రాజనగరున వైద్యుఁడై యుండ నీవెట్లు భిక్షుకురాలవాదవు? నీ నిష్ఠురములు చాలును లెమ్ము.

మాణిక్యము—"నాతల్లి యొడలినిండ నగలు పెట్టిననే గాని నన్నొకరింటికి దీసికొని వెళ్ళదు. నన్నొకపాడునూతిలోనైనఁ ద్రోయలేక ఒక బిచ్చపు మనువున కియ్యఁబట్టి నాగతి యిట్లైనది" అని యేడువ మొదలుపెట్టెను.

అలమేలమ్మ—ఓసి వెట్టిపిల్లా! యెందునకల్లరిఁ జేసెదవు? నీకున్నమాత్రమైన తక్కినవారికి లేవుగదా? నీకుఁబెట్టినది వారికేమైన నెక్కువ పెట్టితినా? వలయుచో నామెడలో నున్న నానిచ్చెదఁ బెట్టుకొనుము.

మాణిక్యము—"నాకున్నది, ఉన్నది" యని యెప్పుడును నీ కన్నులలో నగ్గిఁబోసికొనుటయా! తక్కినవారినందఱిని నెత్తిఁబెట్టుకొనియుండలేదా? నన్నుజూచిన నీగ్రుడ్లు కుమిలిపోవుట యెందులకు?.

కోడలియార్భాటమువిని వీధిలోనున్న బసవయ్య లేచివచ్చి భార్యను

జూచి, “ఏమే, యిది యేమియల్లరి! వీధినిబోవువారందఱు నవ్వుచున్నారే! ఎవరియింటనైన నిట్లల్లరి యగుచున్నదా” అనిగద్దించెను.

మాణిక్యము—(చేయిచాచిచూపుచు) ఆముసలివానిమాటలకు నా దేహము మండుకొని పోవుచున్నది. నావలనఁ దనయింట నల్లరియట, తక్కినవారందఱు నోటఁ వ్రేలుఁబెట్టిన కొఱకలేరట” యని యేడ్చుచుండెను.

అంత బడికిపోయియుండిన బసవయ్య నాలవ కుమారుఁడు శివశంకరుఁడు మధ్యాహ్న భోజనమున కింటికివచ్చుచు వీధిలోనే యీయల్లరివిని అలమేలమ్మనుజూచి “అమ్మా! యిది యేమియల్లరి! ఎప్పుడుఁజూచినను నింట పెనుబొబ్బలైపోయెనే” అనెను.

అలమేలమ్మ—సూర్యనారాయణగారి యింటికందఱిని దీసికొని వెళ్లుమని మీతండ్రిగారుచెప్పిరి. మాణిక్యమునకు నగలులేవట వచ్చుటకిష్టములేదట.

శివశంకరుఁడు—పెద్దవానిమాట వినక నీయిష్టమేనటే! యింటనెపుడును తగవులైపోయిననే “ఉబ్బోరు నమ్మా. అశేలూరుమమ్మా కాడాదు” అను అరవవారి సామెత నీయొద్దనెపోయినది. కలిగినకొలంది యని కాలుబెట్టుటయైనది. ఏబదియేండ్లు దాఁటిన మాయమ్మ యిప్పటికిని ముసలాయనయెదుట నిలిచి మాటాడవెఱచుచున్నది. మావదినెలేగాదు పసిపిల్ల మాచెల్లెలుసహా గట్టిగా మాటాడ వెఱచుచున్నది. వారినిజూచియైన బుద్ధిదెచ్చుకొనఁగూడదా? నిన్నగాక మొన్నవచ్చిన పిల్లకెంత నోరెక్కువైపోయినది. అనిచెంపమీఁద నొకదెబ్బగొట్టెను.

మాణిక్యము—(నెత్తిమోదుకొని రాకాసివలె యఱచుచు) “మగఁడే మొద్దయియున్న నేనెట్లు కాపురముసేయుదును! మాతల్లి యూఁడుబిడ్డలులేక కాళీవరమున నన్నుఁగని యెంతో గారాబమునఁ

బెంచి యనుకింకరులనాతఁ బెట్టినదే కానిమ్ము నాతండ్రితోఁజెప్పి వీనిచేతులు విఱుగఁగొట్టించెద" అని కూతలుపెట్టెను

శివశంకరుఁడు—ఓసీ, నీవే మహాకాళివలె నున్నావే! నీముందర కాళియొకటి యున్నదా' అని మఱలఁగొట్టఁ బోయెను.

అలమేలమ్మ—ఓరీ శంకరా! తెలివిలేని దానితోఁ నీవేలనోరు చేసికొనెదవు' ఊరకుండుము.

శివశంకరుఁడు—(తల్లినిఁజూచి) నీవు దానినోటికి వెఱవఁబట్టియే దానికిట్లు బాగ రెక్కచున్నది

"తల్లినిఁజూచి పిల్లను గైకొను"మన్నారు. నేనప్పుడే వద్దని మొత్తుకొన్నను నామాటవినవైతివి. ఇప్పు డనుభవింపుము"అనిచెప్పి భోజనము లేకయే బడికి వెళ్లెను.

అలమేలమ్మ—ఎరువుసొమ్ములు దెచ్చియిచ్చి యెంత బ్రతిమాలినను మాణిక్యము రాకపోవుటచేఁ దక్కినవారిని దీసికొని వెళ్లెను.

సూర్యనారాయణగారియింట బారసాలయై బంధుభోజనమయ్యెను రాత్రి శిశువును దొట్లఁబెట్టిరి. అలమేలమ్మ పసుపుకుంకుమము, తాంబూలము దీసికొని యింటికి వచ్చునప్పటికింట నందఱును భోజనముఁజేసి పరుండియుండిరి. అంతనామె, కాళ్లు గడిగికొని గదిలోఁ బండుకొనియుండిన పెద్దకోడలింజూచి"యేమే అన్నపూర్ణా! అందఱు భోజనములుచేసిరా!" అనియడిగెను.

అన్నపూర్ణ—అత్తా! అందఱివియైనవి గాని, మాణిక్యము నెంత బ్రతిమాలినను ముద్దగైనఁదీయలేదు.

అలమేలమ్మ—దానికి పెద్దవారి మాటయే లక్ష్యములేనపుడు నీమాటయన నెంత? అనిచెప్పి మాణిక్యము దగ్గఱకువెళ్ళి బ్రతి

మాలి లేవఁదీసి అన్నము వడ్డించెను.

ఆఁకలియొక్క వగ నుండినందున మాణిక్యము సణుగుకొనుచు లేచి భోజనముచేసి త్రేపుమఁ జేయిఁగడుగుకొని యొక మూల పరుండెను. ముందుదిన మలిగియుండుటచే మఱునాఁడుదయమున మెలకువ వచ్చియు, నామె లేవలేదు. ఘంటలు పదునొకండయ్యెను.

అలమేలమ్మ "ఏమే, మాణిక్యమూ! ఇంకను లేవలేదు. చాల ప్రొద్దైనది. లేచిస్నానముజేసి భోజనముసేయుదువు రమ్ము" అనిబలవంతపెట్టఁగా మాణిక్యము సణుగుకొనుచు లేచి చేతఁ జెంబుఁ దీసికొని దొడ్డిలోనున్న నూతియొద్దకు వెళ్లెను.

అంతటఁబొరుగు వీధిలోనున్న కామమ్మ మంచినీళ్లకై బిందెఁ దీసికొనివచ్చి నీరుతోడుకొనుచుండ మాణిక్య మామెచేతి త్రాడులాగుకొని "ఓసీ నీకేదేభావియా? ఊరిలోనింక నూతులు లేవా!" యని యడిగెను.

కామమ్మ—మాణిక్యమూ! కోపపడకుము ఈబావినీళ్లు రుచిగానుండుటచేఁబట్టి అన్నిబావులను విడిచి యిక్కడికి వచ్చితిని త్రాగుటకు మాత్రమొకబిందెడైనఁ జేదుకొననిమ్ము.

మాణిక్యము—వచ్చినదానవు త్రాడు దెచ్చుకోరాదా? ఊరివారికెల్ల నిదేత్రాడనుకొన్నావు కాబోలు! త్రాడు తెచ్చినంతలో నీచేయి విఱిగిపోవునా?

కామమ్మ—అమ్మా! యింతమాత్రమునకే నా చేయి విఱిగిపోవలయునా? నేను కాపురమునకు వచ్చినది మొదలీ బావినీళ్లకు వచ్చుచున్నానుగాని మీఅత్తగారు ఒక్కనాఁడైన నన్ను త్రాడుదెచ్చుకొనుమని చెప్పినదిలేదు. నేను దెచ్చుకొనినదిలేదు. ఈవేళ చెప్పితివిగదా యిఁకమీఁదనట్లే తెచ్చుకొనెదలెమ్ము.

అలమేలమ్మ—(లోపలినుండి వీరిమాటలు వినుచు) ఓసీ! పసిదానవు, మాటలు నీకెందులకు? నీ వూరకుండుము.

మాణిక్యము—నీకు కోడలు గిట్టకున్న వచ్చినముండలను గూడ నెక్కించుకొనుచున్నావా?

కామమ్మ—అమ్మా! యింతపిల్లవే, ఎంతమాట యన్నావు! కలిగినవారి పిల్లవు అదిగాక నోరెక్కువదానితో మనము మాటాడలేమని యూరకుంటిని పెద్దామె మీయత్తగారికన్నా డైన "ఛీ" అనినది గాదు. ఎంతో ప్రీతిగా నుండును. శుక్రవారముపూట పాచినోరైనను కడుగక ముండ యనుచున్నావా?

మాణిక్యము—ఓసీ! నీమొగము మండిపోను. నీకా నోరెక్కువా? నాకు నోరెక్కువా? రేపటినుండి యీతావికి వచ్చిన నీ కాళ్లు విఱుగఁగొట్టి పంపెద, జాగ్రత!

అలమేలమ్మ—(లోపలినుండి యీవలకువచ్చి) ఏమే మాణిక్యమూ! ఊరివారినందఱను దిట్టిన వారూరకుందురా?

మాణిక్యము—నీ చెవిలో చెట్లు మొలచియున్నవా! వచ్చినముండ తిట్టుచున్నదా! నేను తిట్టితినా? అని యేమేమో యనుచుండెను. ఘంటలు పండ్రెండయ్యెను. శివశంకరుఁడు బడినుండివచ్చి దుస్తులు విడచి కాళ్లుకడుగుకొనుటకై దొడ్డిలోనికిఁబోయి భార్య గయ్యాళితనముఁజూచి యొడలుమండ, ఓసీ! రాక్షసీ! నాపాలిటి కెక్కడనుండి దాపరించినావే! నీవు కాపురమునకు వచ్చిన రెండేండ్లనుండి కొంప తగవులతో నిండిపోవుచున్నదే! ఇంటివారిననుట చాలక బయటివారిని గూడఁదిట్టుచు నందరితోఁ దగవులాడుచున్న నే నేముఖముతో బయటదిరుగఁ గలను? ఎవరినోటఁజూచినను 'నీభార్య గయ్యాళి' యను మాటే వినఁబడును. బయటికివెళ్లుటకుఁ దలవంపులై పోయెను. 'తెలివిలేని

దాని యొక్కినకొలంది మజ్జిగ పాగ లెక్కువగుచున్నదే" యని త్రాటితో వీపుమీఁద నొకదెబ్బఁ గొట్టెను.

మాణిక్యము—ఓసీ! నీచేతు లక్కగ్గిఁ బెట్ట, పీపు మండుచున్నదే అన్నబోధ నెత్తికెక్కి యాడుచున్నావా! అని యఱచుచు వంటయింటిలోనికి వెళ్లెను.

అలమేలమ్మ—ఇదియేమి యన్యాయమే! మొండికట్టెతో వంట యింటఁజొరఁబడుచున్నావు అని చేయియడ్డముఁ బెట్టగా మాణిక్యమామె చేతిని బట్టి ప్రక్కకులాగి వీపుపై నాలుఁగు చఱపులుచఱచి నెత్తిమోదుకొనుచు వీరికొంప తగులఁబడ వీరంతయు రాకాసులవలె నన్ను పెఱికి తినుచున్నారే! యని నయ్యము పూనినదానివలె కిలారించుచుఁ బుట్టింటికి పోయెను.



# శోభావతి.

## ఆరవ ప్రకరణము.

———o———

కుంభకోణము రామచంద్రయ్యగారి యింట గౌరీ వ్రతము జరుగుచుండెను. పార్వతమ్మ కుమారుని జూచి, "యేమిరా, రామచంద్రా! బిడ్డ వెళ్ళి మాసములే కాదు సంవత్సరములు గడచినవి. ఇటీవల ఉత్తరములుగూడ వచ్చిన ట్లగుపడలేదు. పిల్లమీఁది కలవరముచే రాత్రులయందుఁ గూరుకు పట్టుటలేదు. కన్నులలోనే మెదలుచున్నట్లున్నదిరా, నాయనా" అనెను.

రామచంద్రయ్య —అమ్మా! బిడ్డ వారమున కొక యుత్తరము వ్రాయుచునేయున్నది. మొన్నటి యుత్తరమును నీకుఁ జదివి వినిపింప మఱచితిని, "యిదిగో తెచ్చెదను" అని లోనికి వెళ్ళి తన మేజాలో నున్న యుత్తరమును దెచ్చి తల్లి కిట్లు చదివి వినిపించెను.

"రాజశ్రీ, ప్రియమైన తండ్రిగారికి

నమస్కారములు. దేవుని కృపవలన మాయింట నందఱు సుఖముగ నున్నవారు. అచట మా యవ్వకు, మా తల్లికి నేను వందనపూర్వకముగ వారి కుశలంబుల నడిగితినని చెప్పఁగోరెద. మామామగారును, చిన్నత్తగారును నను మిగుల నాదరముగఁ జూచుకొనుచున్నారు. నాకేవిధమైన కొఱఁతయును లేదు. మిమ్ముఁ జూడవలయునని యున్నను నిపుడు వచ్చుటకు సాధ్యము లేదు. నాకు రావలయునని యిచ్ఛ గలిగినపుడు నేను వ్రాసెదను.

ఇట్లు, విధేయురాలు,

మీ ప్రియపుత్రి, అ. శోభావతి.

ఉత్తరము నిట్లు చదివి వినిపించి, "అమ్మా! బిడ్డ యిట్లు వ్రాసి యున్న నన్నేమి చేయుమనెదవు. చిన్నఁబోయిన మనసుతో మన యింటనున్న బిడ్డ కేమి సుఖము గలిగినట్లు? దాని యిష్టముఁబట్టియే పోదము." అనెను.

పార్వతమ్మ.—నాయనా! నీవైన వెళ్ళి చూచిరాఁగూడదా?

రామచంద్రయ్య.—అమ్మా నీ కేమియుఁ దెలియదు. ఆర కొండము వారియింట వివాహమునకు వెళ్ళిన నీకోడలిని, ముసలాయనను, నెంత గౌరవించినదియు నీకుఁ దెలియదు. నీయెదుట ననుకొన్న నీ కదే చింతగనుండునని యనుకొనుటలేదు. ఇపుడు నీ తొందర పడలేక చెప్పవలసివచ్చెను.

పార్వతమ్మ.—ఇంతటివారికి బిడ్డ నేమి సుఖపెట్టఁబోయెదను. అని కంట నీరుఁబెట్టుకొనెను.

ఇఁక నీమె కిదియే గొడవయై పోవుచున్నదని, హయగ్రీవులు, పార్వతమ్మా! 'మనల గౌరవింపకున్న మానెఁగాని మనయింట నేమియు నెఱుఁగనట్లున్న పిల్ల, అత్తవారింటికి వెళ్ళగనే యందఱకడుగులకు మడుగులొత్తుచు నెంతో ముచ్చటగ నున్నది. దానిసుగుణములకే వారు ప్రీతిగలిగియుందురు. లెమ్ము" అని యెన్ని సమాధానములు చెప్పినను ముసలామె మనసు నిలువక, "మనయింట నేమి చేసికొన్న నేమి, యెందఱు వచ్చిన నేమి, పిల్ల లేనిది యిల్లు చిన్నఁబోయి యున్నది, విస్తరముందుఁ గూర్చున్న నోటికి కన్నము సహించుటలే"దని కన్నీరు పెట్టుకొనుచు లోపలికి వెళ్లెను.

గౌరీపూజ నెరవేరిన తరువాత కల్యాణి, దేవిముందుంచిన, చీర, రవిక, పసుపుకుంకుమము శోభావతికని యొరఁగానుంచి, వచ్చిన ముత్తైదువలకుఁ బసుపు, కుంకుమము, రవికగుడ్డలు, తాంబూలము

నిచ్చి, కుడుములు బొబ్బట్లతో, సంతర్పణములు పెట్టెను.

లోకముచుంచ పెట్టి బీదలకై నను నింటనిప్పట్టుగానున్నను తమ బిడ్డలు తిన్ననేకాని తృప్తియుండదుగదా!

ఆరాత్రి కల్యాణి తనపినతండ్రి యైన ఉమాపతిని బిలిపించి, ఫలాహారములను గిన్నెలో పెట్టి, పట్టుబట్టఁగట్టి, పసుపుచీర, రవిక పెట్టి, తంజావూరికంపెను. ఉమాపతి వానినన్నింటిని భద్రముగాఁ గొనివచ్చి, శోభావతికిచ్చి యాదినముచటనుండి, మఱునాఁడు పయనమయ్యెను.

శేషయ్యయును, సుభద్రమ్మయును, కొంతదినములుండి. వెళ్లవచ్చునని, బలవంత పఱచిరిగాని, యతఁడవసరముగా వెళ్ళవలయునని చెప్పి శోభావతింజూచి "అమ్మా! అక్కయ్యకేమి చెప్పుదునమ్మ" అని యడిగెను

పెద్దవారితో మాటాడు నలవాటులేనందున లజ్జచేఁ దలవంచుకొని, శోభావతి మేనమామంజూచి, "మామా! మా నాన్నగారితోను, అవ్వతోను, తమ్మునితోను, నేను సౌఖ్యముగ నున్నానని చెప్పుడు" అని లోపలికివెళ్ళెను. ఉమాపతి యందఱితోఁ, దన పయనముఁ జెప్పి వెళ్లెను.

సుభద్రమ్మ పిండివంటలు పంపించినవాని సంతర్పణను బంచిపెట్టి, శోభావతికిని నిచ్చెనుగాని, మాసము దప్పియుండుటవలన శోభావతి కేమియు రుచింపదయ్యెను. అన్నమింతవుడప్పె, శరీరము చిక్కి, ముఖము తెల్లఁబాఱెను. బాలికచే మునుపటివలె చిన్నత్తగారికి సహాయపడుట కోపిక లేకుండెను. సుభద్రమ్మ మృదుస్వభావము గలది కావున కోడలికన్నము రుచించుటకై నెయ్యియేని పచ్చడినూరుగాయయు నారగింపఁజేసి మొదలైనవిచేసి బలవంతపఱచియన్నముఁ బెట్టుచుండెను.

ఇవన్నియుఁజూచి యోర్వలేక కోడలిమీఁదను, సుభద్రమ్మమీఁదను, మాటెంత చిటచిటలాడుచు, జానకమ్మ పగ సాధించుచుండెను. శోభావతి కాఱువాసములువెళ్లెను.

ఒకనాటిరాత్రి పట్టాభిరాముఁడలవాటుచొప్పునఁ బినతల్లిచే భార్యను పిలిపించెను శోభావతి మిద్దెమీఁదికి వెళ్ళినకొంతసేపటికి పట్టాభిరాముఁడు లేచి చెంపమీఁద నొకగట్టిదెబ్బవేసి వీఁపున గబగబఁ గొట్టసాగెను ఇప్పుడు పెనిమిటియొద్దనేకాని దెబ్బయన్న నెఱుఁగక చిన్ననాటినుండియు గోముగఁ బెరిగినదగుటచేతను, నాలుగుమాసములుసరిగనన్నములేక బలహీనయై యుండుటచేతను, దెబ్బలకోర్వలేక శోభావతి, ముకుళితహస్తయై, నాథా! నేనేమి యపరాధమొనర్చితిని? మందబుద్ధినగు నాయందపరాధములున్నను, దయయుంచి మన్నింపుఁడని వేడుకొనెద. మీకేదేని కావలసియుండిన నవి నాయొద్దనున్న నిచ్చుటకు సిద్ధముగనున్నాన"ని బ్రతిమాలుకొనుచున్నను, కఠినహృదయుఁడా పాపిష్ఠుఁడు, సరకుసేయక యామెకాలియందున్న, గొలుసులనూడదీసికొని, మంచమునుండిలాగి, నేలపైఁద్రోసి పోయెను.

పాప మాసాధ్వి మిగులబలహీనముగనుండుటచే స్పృహఁదప్పి పోయెను. పట్టాభిరాముని దుశ్చేష్టలు తెలిసియుండుటచే జాగరూకతతో మేడమెట్లయొద్దఁ గూర్చుండిన సుభద్రమ్మ దెబ్బలచప్పుడు విని గబగబపరుగెత్తివచ్చి, కోడలిదుర్గతిఁజూచి, మనసోర్వలేక నోరువిడిచి యేడ్చుచు "శోభావతీ! శోభావతీ! పలుకవేమే" యని కేకలుపెట్టెను. ఆ కేకలువిని, శేషయ్య పరుగునవచ్చి స్పృహదప్పియున్న కోడలింజూచి, ఆమెయోర్పునకు మెచ్చుకొని, కొడుకు దుశ్చేష్టలకు మనసుమండి, సుభద్రా! నీయజాగ్రత్తవలననే యిట్టి విపరీతములు జరుగుచున్నవి. ఓపికఁదప్పిన పిల్లదెబ్బలకెట్లు తాళఁగలదు? ఇఁకమీఁద

నా పాపాత్మునియొద్దఁ బిల్లనుఁ జేరనియ్యక జాగ్రత్తగఁ జూచుకొను" మని చెప్పి, సుభద్రమ్మచే మంచినీళ్లుఁ దెప్పించి, కన్నులును, ముఖమును గడిగించి, తెలివి వచ్చిన తరువాతఁ గొంచెము నీరు త్రాగు" మని క్రిందికి వెళ్లెను

శోభావతి తిన్నగా లేచి కూర్చుండి కొంచెము మంచినీళ్లు త్రాగి యోపికఁదెచ్చుకొని, "అత్తా! ఎందుల కల్లరి చేసితిరి మామగారుకూడ వచ్చిరే. ఇది బాగుగనున్నదా!" యని ముఖము చిన్నఁ బుచ్చుకొనెను. సుభద్రమ్మ కోడలి యోర్పునకు మెచ్చుకొనుచు నామె శరీరముఁ దడవితడవి "అమ్మా నిను గొట్టుటకు వాని చేతు లెట్లాడుచున్నవో" యని కన్నుల నీరు గార్చుకొనుచు, శోభావతి చేయిపట్టి, తీసికొనివచ్చి తన ప్రక్కలోఁ బరుండఁ బెట్టుకొనెను.

ఇన్నిదినములవలెఁ దాను జేసిన క్రూరకృత్య మెవ్వరెఱుఁగరనుకొని, మఱుదినము తెల్లవాఱఁగనే పట్టాభిరాముఁ డేమియు నెఱుఁగని వానివలె నింటికి వచ్చెను.

కొడుకును జూడఁగనే శేషయ్య తొక్కఁద్రొక్కిన సర్పమువలె లేచి, "యోరి దురాత్మా! రత్నమువంటి పిల్ల నేల యిట్టి కష్ట గండ్లఁ బెట్టుచున్నావురా? నీవు కొడుకవై నందున నీ మూలమున నాకును పాపము వచ్చుచున్నదే. లోకమునఁ బిల్ల లెంతో గఁబడి పోవుచున్నారు. ఒకరి నన నేల! మనపిల్ల యా శ్రీవమ్మా మగనికిని భయపడక యందఱితోను దగవులాడి మూ ముచ్చటగ మనయింటికి వచ్చుచుండలేదా? నీకంటెఁ ఈ పిల్లతో ముచ్చటగఁ గాపురము సేయుచుండ, వానిఁ జూ బుద్ధి దెచ్చుకొనరాదా? పెద్దవాఁడవని యెట్లో కష్టపడి,

నందులకు దుర్బుద్ధివైతివే! నీ చదువంతయు బూడిదలోఁబోసిన నేతి చందమైనదే? పరమసాధ్వి నిట్లలయింప నీ మన సెట్లొప్పె! నీవు పెట్టు పాట్ల కేమైన నోరెత్తుచున్నదా? గోముఖవ్యాఘ్రమువలెనున్న నీవు నా యెదుటనుండక తొలఁగిపొమ్ము" అని, మనసుమండుచుండ శేషయ్య యచట నిలువలేక గదిలోనికి వెళ్లెను.

తండ్రిపెట్టిన చీవాట్లకుఁ బట్టాభిరాముఁడు తన గదిలోఁ గూర్చుండి యాలోచించుకొనుచుండి తండ్రి స్నానముచేయుచుండు సమయమున శోభావతి పెట్టెఁదెఱచి యామె తండ్రి యిచ్చిన నాలుగు చీరలు దీసికొని యెచటికో వెళ్లెను.

మధ్యాహ్న భోజనమునకుఁ గొడుకు రాకుండుటఁ జూచి, కోడలివలనఁ దన కొడుకునకుఁ జీవాట్లు వచ్చెనని "యీదరిద్రదేవత నా కొంపఁజేరుటచే నాకు నాబిడ్డలకుఁగూడ సిదుమలైపోయెనే! దీని యమ్మ కడుపుగాల! నాకని కనిసిద్ధముగ పెట్టియుండిన దేమో!" యని నానావిధములఁదిట్టి, గదిలోపండుకొనియున్న పెనిమిటిని జూచి యిట్టి పాపికి భగవంతుఁడు పిల్లల నేల నియ్యవలెను? ఆలిని సుఖపెట్టినఁ గదా బిడ్డలను సుఖపెట్టును! దాని మొగము మండిపోను. నిన్నగాక మొన్న యెక్కడనుండియోవచ్చిన కళ్లెలమును వెనుకవేసికొని కన్న బిడ్డల నాఱడిఁ బెట్టువారు గలరా!" యని యఱచుచు జానకమ్మ గోలాడుచుండెను.

పగలంతయుఁ బట్టాభిరాముఁ డెచటనో తలఁ దాఁచుకొని రాత్రి పదిగంటలకు కనకరత్నముయొక్క యింటియరుగు ర్చుండి యిట్లు యోజించెను. "రెండుమాసములఁబట్టియు నియ్యకుండుటచే నిఁక నావలనఁ దన కేమియు సొమ్ము కనకరత్నము తన యింటఁ గాలుఁ బెట్టనిచ్చినదిగాదు. ఇంత

రచ్చఁబడి భార్య కాలిగొలుసులు దెచ్చినను లక్ష్యపెట్టక పోయినది కాన నిఁకనిచటనున్నఁ బ్రయోజనములేదని యెంచి యచ్చోటినుండి కదలి యూరి చివరనున్న పద్మావతియింటికివెళ్ళి తలుపుఁ దట్టెను. అంతఁ బద్మావతితల్లి వచ్చి తలుపుఁదెఱచి 'యెవరు వారని యడిగెను. పట్టాభిరాముఁడు, యెందువలననో, యథార్థముఁ జెప్పక నేను తిరుచినాపల్లి బ్రాహ్మణుఁడను, నిచటఁ గొంత పనియుండి వచ్చితిని పద్మావతి చాల రసికురాలని విని మీ యిల్లు వెదకుకొని వచ్చినా'' నని చెప్పెను.

వారము దినములనుండి యు నేమియు నాదాయము లేకుండుటచే''వచ్చిన దేచాలు''ననియనుకొని నీలవేణి పట్టాభిరాముని లోపలికి రమ్మనెను పట్టాభిరాముఁడు తల్లితో మాటలాడుచుండుటవిని,పద్మావతి లేచివచ్చి, వచ్చిన విటుని మరియాదతోఁదీసికొనిపోయి కుర్చీపై గూర్చుండఁబెట్టెను.

పట్టాభిరాముఁడు తాను తెచ్చిన గొలుసులను చేతఁబెట్టి, ''పద్మావతీ ఇవి నా భార్యకని యీ వేళఁ గొన్నాను. నే నూరికి వెళ్లునపు డింకొకజత కొనెదలెమ్ము. ఇవి నీకే యుంచుకొ''మ్మనిచేతఁ బెట్టి, ''ఇవిగో యీ చీరెలు నీకని దెచ్చినాను''అని వానినందిచ్చెను. తొలినాఁడె యింతసొమ్ము తన కబ్బినందుల కుబ్బితబ్బిబ్బైన పద్మావతి మహదానందముతో, ''అయ్యా! మీవంటి దాతృత్వము గల సత్పురుషుల నే నిదివఱకుఁ జూడలేదు.''అని స్తుతించి యాతఁ డిచ్చిన వానిని దీసికొనిపోయి తల్లిచేతికిచ్చి ''దాఁచు'' మని చెప్పి, పట్టాభిరాముని చెంతకు వచ్చెను.

మఱుదినము వేకువనే లేచి పట్టాభిరాముఁడు తన విటకత్తెను జూచి,''ప్రియురాలా! నా స్నేహితుఁడొకఁడు తన యజమానుని

సరకుఁ బట్టుకొని పదునైదుదినముల కిచటికి వచ్చెను. నేను దెచ్చిన ద్రవ్యము నిచట సరకులకై సంచకరు విచ్చినాను. ఈయూరిలో మా బంధువులెవరును లేకుండుటచే. బూటకూటికై బ్రాహ్మణునకుఁ జెప్పుగా నేను క్రొత్తవాఁడ నగుటచే నా బ్రాహ్మణుఁడు నావాఁడు డబ్బిచ్చిననే గాని వీలుగాదన్నాఁడు. కాఁబట్టి పదునైదు దినములవఱకు నీవు భోజనవ్యయమున కిచ్చిన నా స్నేహితుఁడు వచ్చినతోడనే నీఋణముతీర్చివేసెద"వని చెప్ప నిజమని నమ్మి పద్మావతి నానాఁడు తిండికై ద్రవ్యమిచ్చుచుండెను.

పదునైదు దినములన్నది యిరువది దినములయ్యెను. పద్మావతి తల్లిచేఁ బట్టాభిరాముని ఋణధనమునకై యడిగింప, నతఁడు "ఇదిగో, రేపు"అని "మఱునా"డని దినములు గడుపుచుండ, "నితఁడు టక్కరిగ నున్నాఁడ"ని"యెంచి పద్మావతి, రెండుదినములు డబ్బు నియ్యలేదు పట్టాభిరాముఁడు తన జరీయుత్తరీయమునమ్మి రెండుదినముల భోజనపు వ్యయము జరపుకొనెను. మూఁడవదినము డబ్బులేక పూటకూటియింటికి వెళ్లుటకు మిడుకుచుండి, యాకలియెక్కువ యగుటచే "గుడికైన వెళ్ళి చూచెద"నని, నడువలేక గుడిలోనికిఁ మెల్లగా వెళ్ళి యచటిపూజారినిజూచి"అయ్యా నేను పొరుగూరి బ్రాహ్మణుఁడను, కొంచెమన్నమిప్పింపు"మని యడుగ, నతఁడు "వేళమించిపోయినది, యిఁక రాత్రికేగాని దొరక"దని బదులుచెప్పెను. ఆఁకలి దుర్భరమగుటచే నెండలో నడువలేక పట్టాభిరాముఁడచటనే పరుండెను. ప్రొద్దున లేచి బయటవెళ్ళిన విటుఁడింకను రాకుండుటచే "సంధ్య వేళగావచ్చినది, ఋణము నెగవేసి వెళ్ళియుండు"నని తలఁచి, పద్మావతి తన తల్లితోఁ జెప్పుకొనుచుండ, నామె మునుపటి స్నేహితులు, వీరాస్వామినాయఁడును తంగవేలు మొదలారియు, నామె దర్శనమునకై వచ్చిరి.

అంతఁ బద్మావతి, తనమాటలుచాలించి, వారితోఁ గొంత సేపు ముచ్చటలాడి తరువాత వారి చెవిలో నేమో గుసగుసలాడి పంపెను.

రాత్రి యెనిమిదిఘంటలగుచున్నప్పటికి గుడిలో ఘంటలు వాయించి, దేవునికి నైవేద్యముఁజేసి, వచ్చినవారికెల్ల దేవుని దర్శన మివ్వఁబడుచుండెను.

సత్యాభిరాముఁడు వేశ్యాదర్శనోత్సుకుఁడై, దేవునినైన దర్శింపక, గుడిబ్రాహ్మణుని బ్రతిమాలి వేగిరించి యొక దోసెయు, గొంచెము చిత్రాన్నమును, గొంచెము దధ్యోదనమును, దీసికొని యచటి కోనేటియొద్ద కరిగి భోజనముఁ జేసి చేతులు గడుగుకొని కొంచెము నీరుఁదాగి, తన ముల్లె మునిగిపోయినట్లు బిలబిల నడచి తన విటకత్తె యింటికి వచ్చెను

పద్మావతి పెడమొగము పెట్టుకొని, పలుకకుండుటఁ జూచి, "నా ప్రాణపదమా! నన్నుఁజూచి ముఖము త్రిప్పెదు వేలా? పత్రకమునకు వేలకొలఁది డబ్బు వ్యయపెట్టువాఁడను, నీకు డబ్బియ్యక పోయెదనా! నా స్నేహితుఁడు వచ్చినతోడనే ముందుగఁ దెచ్చి నీకుఁ గుమ్మరించెదఁ జూడుము. అప్పటికైన నాయందు నమ్మకముకలిగి ప్రీతితో నేలుకొందువా? నేను నీవాఁడనైనపుడు నా డబ్బంతయు నీది గాదా? నా మోహనాంగీ! నా మనోహారిణీ! నాయందేదేని తప్పులున్న మన్నించి యేలుకొనకున్న, నాప్రాణంబులు నిలువ నోపవు" అని కామాతురుఁడై యింకను నేమేమో ప్రేలుచుండఁ బద్మావతి యతని వంకఁదిరిగి "ఓయి బాపఁడా! నీ టక్కుమాటల నింక నేను నమ్మను. ఇరువది దినములనుండియు, నీతిండికై యిచ్చిన పైకమును రెండుమాసములకు నాకుఁజేరవలసిన కట్టడియును నిటులఁబెట్టి తరువాత మాటాడు" మనెను.

పట్టాభిరాముఁడు—సుందరీ! నీ వందులకై సందేహపడుచున్నావా! ఇదిగో! రేపు వచ్చెదనని నా స్నేహితుఁ డుత్తరము వ్రాసియున్నాఁడు చూడుము.

ఇట్లనుచుండ వీధినుండి యిద్దఱు పురుషులు వచ్చి "ఓరీదొంగకొడుకా!" యనుచుఁ బెడరెక్కలు విఱిచి గుంజకుఁ గట్టి "పద్మావతి యెఱుఁగదని పొరుగూరివాఁడనని బొంకితివి. మేముకూడ నెఱుఁగ మనుకొంటివా? కూటికి గతిలేనివాఁడవు పద్మావతి నేమఱించి తేన వచ్చు ననుకున్నానటరా?" యని నాలుగు చఱపులు చఱచిరి.

అంతఁ బద్మావతి లేచివచ్చి "రేపటినుండి యిట్టి బొంకులు బొంకి నావంటి జవరాండ్రను మోసపుచ్చకు" మని మూలనున్న చీపురుకట్టతోఁ గొట్టులకుఁబూని, తుదకుఁ గట్లువిప్పి "వెళ్ళఁగొట్టు" డనెను. సద్గుణసౌందర్యరాశియగు నిల్లాలితో [illegible]పురము జేయువారికిట్టి దుర్గతి వాటిల్లదుగదా! నోరుదెరచిన దలవంపులగునని దొంగకుఁ దేలుగుట్టినట్లు కిక్కురుమనక, బయటికివెళ్ళి యారాత్రి యెందో దాఁగియుండి యరుణోదయముననే స్వగృహముఁ జేరెను.

మిద్దెమీఁదికి వెళ్ళిన కొడుకునుఁ జూచి, జానకమ్మ తానును వెళ్ళి "నాయనా యిన్నిదినము లెచటనుంటివి! నీవువెళ్ళి మాసము గావచ్చినదే. ఆ దుష్టురాలి నంటుటచే గదా నీ విన్నితిప్పలు బడవలసి వచ్చె. కన్న తండ్రికిఁగూడ వెగటగునట్లు జేసినదిగదా మహాపాతకి! పోనిమ్ము. ఎవరికెట్లున్నను నీవు కంటఁబడిన నాకుఁజాలును. ఉదయము తొమ్మిదిఘంటలు కాకమునుపే యాఁకలికి నిలువలేనివాఁడవు భోజనమున కెట్లు పరితపించుచుంటివో" యని తల్లి దుఃఖించుచుండ, తన దుస్థితి బయలుపడిన ముఖమున నుమ్మివేయుదురని యదార్థమును దాఁచి "అమ్మా నా స్నేహితునితోఁగూడఁ దిరుచినాపల్లికి వెళ్ళి

యుంటిని. అతఁడు నన్ను రానియ్యలేదు. నేఁడాతఁడు రాఁగా, నతనితోఁగూడ వచ్చినా"నని చెప్పెను, శేషయ్య కొడుకు రాక తెలిసియుఁ దెలియనట్లూరకుండెను.

శోభావతి కేడుమాసములు వెళ్లెను సాధారణముగ నందఱు స్త్రీలుగాని స్త్రీలుగూడ గర్భవతులుగా నున్నప్పు డనేకవిధమైన తేజస్సు గలిగియుందురు సహజసౌందర్యవతియైన శోభావతినిగుఱించి వేఱుగ వర్ణింపవలయునా? ఆ శోభనాంగి శరీరమునం దాభరణము లేవియు లేకున్నను, పున్నమనాఁటి పదియాఱుకళలతో వెలుఁగు చంద్రుని వలెనుండెడు వదనమున నలంకారము [illegible] దానివంక పుష్యరాగముతో మెఱయుచుండు [illegible], మఱియొకవంక నుంచి పచ్చలు తాపిన [illegible] నుండెను. చేతులలో బంగారపు [illegible] [illegible] [illegible] తక్కనవన్నియు వేశ్యలోలుఁడగు భర్త యపహరించుట [illegible].

"ఏడుమాసములు వెళ్లుచున్నవి ఇంకను పుట్టినింటికిఁ బంపకుండుట పాడిగా"దని శేషయ్య. 'శోభావతి గర్భవతియై యున్న'దని వియ్యంకున కుత్తరమంపెను.

శేషయ్య కుంభకోణమున కుత్తరము వ్రాయుట నెఱిఁగి పట్టాభిరాముఁ డిట్లని యోజించెను "లోకమున స్త్రీలు పురుడు చేసికొనుటకుఁ బుట్టింటికి వెళ్లెడు నాచారమొకటి యున్నది. అట్లయినచో నీ పిల్ల నెట్లైనను దలిదండ్రులు తీసికొనివెళ్లక మానరు. పిల్ల సొమ్ము లన్నియు నయిపోయినను దానితండ్రి దానికొఱకుఁ బంపుచుండు డబ్బును సంగ్రహించుచుంటిని, ఇఁక నదియు సున్న. అవియన్నియు నటుండఁ బిల్ల చీఁకటిలో వచ్చునపుడు దాని ముక్కుపుడకలు రెండును చుక్కలవలెఁ బ్రకాశించుచుండ వానిమీఁదనే నామనసంత

యు నున్నది. ఆ రెంటిని దీసి నాప్రియురాలగు పుష్పావతి కిచ్చిన ట్లయిన, నది చాల విశ్వాసముగలది గనుక,నన్నెన్నటికిని మఱువదు. ఇట్లు చాలసేపు యోచనలలోమునింగి తుద కెట్లో మనసు స్థిరము చేసికొని తల్లినిబిలిచి యిట్లనెను. "అమ్మా! తిరుచినాపల్లిలో నున్న నాస్నేహితుఁ డచట నాలుగైదుపనులున్నవనియు, నీవు వచ్చినట్లైన,నీ కిష్టమైన పనిలోఁ బ్రవేశింపవచ్చుననియు వ్రాసియున్నాఁడు. కావున నచటికి వెళ్ళఁ దలఁచుకున్నాను. ఆలస్యముఁజేసిన పనులు మించిపోవును. కావున నేడు సంధ్యాకాలముననే వెళ్లెదను. మఱియొక సంగతి, మునుపటివలెఁగాదు, ఉద్యోగము కుదిరిన తరువాత నొకరింట భోజనముఁజేయుట నా కేమాత్రము నిష్టములేదు. కాబట్టి నాయనతోఁజెప్పి యెట్లైన నొప్పించి నీ కోడలినిగూడ బయనము చేయుము."

జానకమ్మ "అట్లే కాని"మ్మని మిద్దె దిగివచ్చి, కూటము నందున్న పెనిమిటికి, కొడుకు చెప్పిన సంగతిని తెలియఁజేసెను. భార్య మాటలువిని శేషయ్య చిరాకుతో "తావెళ్ళిన వెళ్ళవచ్చును గానీ, పిల్లను బంపుటకు వీలుగా"దనెను

జానకమ్మ— [చేయిచాచి] ఎప్పటి కీ మంకుబుద్ధులేనా? ముందు మాసమొదినము లెక్కడనో గతిలేక తినినాఁడు, ఉద్యోగమైన తరువాతఁగూడ సిగ్గులేక యొకరింట భుజింపుమనెదరా!

శేషయ్య—ఓసీ! వాఁడిదివఱకు కాపురముఁజేయుచున్న గడపదెలిసియు, వైఘదప్పియున్న పిల్లను దురాత్ముని వెంట బంపుమనుటకు నీకేమి దుర్బుద్ధిపుట్టినది! లోకమునకైన వెఱువవలదా?

జానకమ్మ—నాకుఁగాదు దుర్బుద్ధి. నెవ్వతెయొకన్న నంగనాచినిదెచ్చి, దానిని దాసివలె నుంచుకొనుటమాని నెత్తినిఁబెట్టుకొని

కడుపునఁ బుట్టిన బిడ్డను శత్రువువలెఁ జూచుచున్న నీకుఁ గదా ము''..ది!

శేషయ్య కోపము పట్టలేక లేచివచ్చి, భార్య చెంపపై నొక దెబ్బఁ గొట్టెను. ''ఓరీ పాపాత్మురాలా నా చంప మందుచున్నదే'' యని జానకమ్మ నెత్తిమోఁదుకొని ''పిసిచేతులు విఱుగఁబడిపోను. ముసలిముండకొడుకు కోడలి యందముఁ జూచి విఱుగఁబడిపోవుచున్నాఁడు, నాబిడ్డలను జంపుచున్నాఁడే, వీని మొగము మండ, వీనితో నే నేగలేను. ఏదోయొక బావిలో మునుఁగుకొనెదను'' అని దయ్యమువలె నఱచుచు దొడ్డిదిక్కుఁ బరుగెత్తుచుండ, శోభావతి పరుగునవచ్చి, దొడ్డితలుపునకు గొళ్లెముఁ బెట్టి, తా నడ్డము నిలువఁబడి, యత్తగారి పాదములం బట్టుకొని, ''అత్తమ్మా కోపపడవద్దు. వారి కెనుబది సంవత్సరములు నిండినందున, వేళాకోళమాడెదరు కాన వారి మాటల మనసున నుంచవద్దు. మాయమ్మగా''యని గడ్డముఁబట్టుకొని త్రిప్పి మాలి కూర్చుండఁబెట్టి యామె యుద్రేకముఁ గొంచెము శమింపఁజేసి తరువాత శేషయ్యయొద్దకుఁ జేరి ''మామయ్యగారూ! అత్తగారు పెద్దవారైనారు ఆమె నేమనవలదు. ఎన్నిదినములైన నాకిచ్చట భోజనము సరిగాదు. కనుక దయచేసి నన్నంపినఁ బది దినము లుండి వచ్చెద. తరువాత నత్తగారినైనను, చిన్నత్తగారినైనను బంపుదును గాని''మని మిక్కిలి వేడుకొనెను.

ఆహా! పెనిమిటియొక్క క్రౌర్యము మనసున నుంచక ధర్మదేవతమైయున్న నీయబల నాదుష్టభర్త యేమి చేయఁ దలఁచెనో! కాకున్న, నెన్నఁడును గన్నెత్తి చూడనివాఁడు ''పెండ్లము నంపు''డను టెందులకు?

శేషయ్య —[కోపించి జూచి] శోభావతీ! నేను చేసికొనిన

పాపమువలన నీ క్రూరాత్ముఁడు నా కడుపునఁబుట్టి నిన్ను బాధించు చున్నాఁడు. నే నేమిసేయుదును? ఎట్లైనఁ జేయుము, "భగవంతుఁడే నిన్ను గాపాడవలయు"నని తల వంచుకొనెను.

శోభావతి మంచిమాటలాడి యత్తగారిని భుజింపఁజేసి తాను ప్రయాణమునకు సిద్ధపడియుండెను. "కొడుకేమి దురుద్దేశ్యముతో కోడలి నంపుమనుచున్నాఁడో" యని, సందేహించికోడలి పయనము సుభద్రమ్మ కిష్టము లేకున్నను, జానకమ్మకు వెఱచి, యేమియుఁ బలుకక లోలోన దిగు లొందుచుండెను.

పట్టాభిరాముఁడు తనకోరిక నెఱవేఱ్చుకొన వచ్చునని, తనలో సంతసించుచు స్నానముచేసి, భోజనము చేయుచుండ, వడ్డించుచున్న సుభద్రమ్మ యొకమచేతఁ గొడుకు గడ్డము బట్టుకొని, "నాయనా! పిల్ల కల్లకపటము లెఱుఁగనిది. నోట నాలుకలేనిది భద్రముగాఁ జూచుకొను"మని కంట నీరుపెట్టుకొని, బతిమాలుకొనఁగా నా ... నాత్ముఁడు తల నాడించి, లేచి చేయిగడుగుకొని, తన పంచెలు రెండు మూటఁగట్టుకొని, తల్లికిఁ, బినతల్లికిఁ బయనముఁజెప్పి సధి లోనికి వెళ్లెను.

పాపము! నిష్కల్మష హృదయయైన శోభావతి మగని దురా లోచన మెఱుఁగక సంతోషముతోఁ దన మూటను జేతఁబట్టుకొని, చిన్నత్తగారియొద్ద కరుగ, నామె కోడలింజూచి, "దీని నేమిచేయఁ దలఁచి తీసికొని వెళ్లుచున్నాఁడో!" యని పొరలి వచ్చుచున్న దుఃఖము నడంచుకొని కోడలి చెంపలఁ బట్టుకొని "శోభావతీ! నీ మగని గుణము నెఱుఁగుదువుగదా! జాగ్రత్తగ నుండు"మని యామెమును మోమును, బలుమాఱు జూచుచుఁ దల్లీ! సుఖముగఁ బోయిరమ్ము. మరల నిను జూచువఱకు నాకు నిద్రాహారములపై బుద్ధి పోదు సుమా!" యని కంట నీరు పెట్టుకొనెను

ఇంత ప్రీతిగల చిన్నత్తగారిని విడిచి పోలేక తానును గంటనీరు పెట్టుకొని యత్తగారు చూచిన నల్లరిఁ జేయ నారంభించు నను భయముచే, శోభావతి కన్నులు దుడచుకొని, యందఱకును జెప్పి వీథిలోనికి వెళ్ళి బండిలోఁ గూర్చుండెను. పట్టాభిరాముఁడును బండిలోఁ గూర్చుండ నిరువురును రైల్వేస్టేషనునకు వెళ్ళిరి.

శేషయ్య, సుభద్రమ్మయిద్దరును "మరలఁ గోడలిని జీవముతోఁ జూడఁ బోయెదమా?" యనియు, "యామె తలిదండ్రుల కేమి చెప్పఁబోయెద"మనియు మనసులో నాందోళనపడుచు ఖిన్నులై యుండిరి. జానకమ్మ యేచింతయు లేక తన పద్దు చెల్లినదని చాల సంతసించుచుండెను.



# శోభావతి.



## పదవ ప్రకరణము.

భక్తవత్సలుఁడైన భగవంతుఁడు సజ్జన రక్షణమందు జాగరూకుఁడై యుండకపోవునా? పట్టాభిరాముఁడాయబలను దీసికొని వెళ్ళి యొక్కడికి టిక్కెట్లు గొనెనో యెఱుఁగము గాని, భార్యాభర్తలిరువురు నొక పెట్టెలోఁ గూర్చుండిరి. వారెక్కిన పెట్టెలో నొక వైశ్యస్త్రీ యిరువది సంవత్సరముల వయస్సుగలది తన పుట్టింటినుండి పెనిమిటితోడ నత్తవారింటికి వెళ్లుచుండెను. కొంతసేపటికి నా వర్తక స్త్రీ తన మూటలోఁ దెచ్చుకొన్న ఫలాహారమును దీసి, పెనిమిటి కందిచ్చి, తానును దినుచు నిరువురు వేడుకగా ముచ్చటించుకొనుచుండిరి. తరువాత భార్య చెంబులోని మంచినీళ్ళను త్రాగనిచ్చి మూటలోనున్న తాంబూలమును దీసి, పెనిమిటి కందిచ్చి తానును వేసికొనుచు, నిరువురు వినోద సల్లాపములతో బయనము చేయుచుండిరి.

పాపము సాధ్వీమణియగు మన కథానాయిక పెనిమిటి యొక్క దురాలోచన మెఱుఁగక లోకులవలెఁ దానును "పెనిమిటితోఁ గూడ వెళ్లుచున్నానుగదా" యని లోలోనఁ బొంగుచుఁ గ్రీగంటఁ జూచి సంతసించుచుండెను.

శోభావతి యదృష్టవశమునఁ బండి కుంభకోణము చేరినపుడు రాత్రి కొంచె మెచ్చుతక్కువగాఁ బండ్రెండు ఘంటలు గావచ్చినది. బండి నిలచినది. ఇంకెల్లవారినఁ దన యుద్దేశ్యము నెఱవేఱుట కష్టమని యెంచి పట్టాభిరాముఁ డూరిపేరైన గమనింపక

మూట చేతఁబట్టుకొని రైలు దిగుటచేఁ దోడనే శోభావతియుఁ దన మూట దీసికొని దిగెను.

పట్టాభిరాముఁ డంతట స్టేషనుదారిని వెళ్లక యుత్తరముదిరిగి యొక మైలుదూరము వెళ్ళి జనసంచారములేక చీఁకటిగ నున్నచోట నొక జువ్విచెట్టుచెంత నిలువఁబడెను. పాపమా సాధ్వి! పెనిమిటివెంటనే నడిచి తానును నిలుచుండెను.

పట్టాభిరాముఁడు కొంతసేపూరక యోచించుచుండి పట్టువర దావలెఁ దలనుండి వ్రేలుచు నేలనలంకరింపఁ జాలిన యామె శిరోజముల నొకచేతికిఁ జుట్టుకొని, చెంపపై నాలుగు పెట్లుపెట్టి, "ఓసీ దుర్మార్గురాలా! నీవలననేగదా మా తలిదండ్రులకుఁ గలహములు వచ్చుట? నీపై నింత ప్రీతిగలుగుటకు మా తండ్రి కేమి యౌషధప్రయోగముఁ జేసితివి? ఇంటనే నీపై నున్నవన్నియు నూడఁదీసికొని నిను యమపురి కంప నెంచితిఁగాని మాతండ్రికి భయపడి నాపుస్తకములలో రెండు విక్రయించి వ్యయమున కుంచుకొని, నిన్నిటఁ దోడ్తేవలసిన దేర్పడెను. నీవలననేకదా నేనిన్ని తిప్పలు పడవలసివచ్చె" నని క్రూరముగఁ గొట్ట సాగెను.

పాపమా సుకుమారి చేతులెత్తి నమస్కరించి, "నాథా! మిము దైవసమానముగ భావించియున్నాను. నేను మీదాసి నైనపుడు నా సొమ్ములు మీవిగావే! ఇంత ప్రయాసమేల? అచటనే యడిగిన, రెండవమాట యాడకుండ మీ చేతఁ బెట్టి యుండనా? ఇదె తీసియిచ్చెద" నని ముక్కుపుడకలు దీయుచుండెను.

"ఓసీ! దయ్యమా 'నాతో' సమముగా వదరుచున్నావా!" యని పట్టాభిరాముఁ డామెను నేలఁద్రోసి నెత్తిమీఁదను నొడలిమీఁదను జేయి నొచ్చువఱకుఁ గొట్టెను. చూలాలగు నాయిల్లాలు దెబ్బలకు దాళఁలేక మూల్గసాగెను.

అంత నా కఠినాత్ముఁడా కటికచీఁకటిలో నిటునటు దేవులాడి యొక జాతిని మోసికొనివచ్చి యామె నెత్తిపైఁ గొట్టెను ఆజాయి సరిగా నామె నెత్తిపైఁ బడియుండిన నతని కోరికప్రకార మామె యప్పుడే పరలోకమునకు వెళ్ళియుండును గాని, యామె తలిదండ్రుల యదృష్టమువలనఁ జీఁకటిలో గురిదప్పి కుడిప్రక్క [illegible] కొంచెము దగులుటచే నెత్తిని గాయమయి విస్తారముగ రక్తము స్రవించుటచే నామెకు స్మృతితప్పి పోయెను ఆసమయమున నాక్రూరుఁడు దైవమున కయినను వెఱవక మంత్రపూర్వకముగ నగ్నిదేవుని యెదుట గట్టినదనియైన శంకింపక నామె కంఠమునుండి తాళిబొట్టును బంగారువస్తువులను దారముతోఁగూడఁ దెంపుకొని, తా నింటినుండి సిద్ధముగఁ దెచ్చుకొన్న కత్తితో నామెచేతిమురుగులు లాగుకొని, తాను వేశ్యామణి కియ్యఁగోరియుండిన ముక్కు పుడకలం దీసికొని, కొంతదూరముపోయి యేమోతలఁచుకొని, తిరుగ నామెచెంతకరిగి, యామెమూటనుగూడఁ జేతఁబట్టుకొని, యెటకో వెళ్లెను.

ద్రోహచింత గలవారి కెన్నఁడును దైవము సాయముఁ జేయఁడు గదా! "తా నొకటి దలఁచిన దైవ మొకటి దలఁచు" నన్నట్లు, పరమసాధ్వియగు భార్యను వంచించి వెంటఁ బెట్టుకొనిపోయి యనవిపాలుసేసి యామెసొమ్ముల నపహరించి, తాత్కాలిక తుచ్ఛస్నేహ భూయిష్ఠయగు స్వైరాంబకిచ్చి, దానితో ముచ్చటలు జరుపుకొనవలెనను కోరికతో వెళ్లుచుండ, దారిలో నలుగురు దొంగలు వాని నడ్డగించి, యెముకలు విఱుగ దన్ని పైబట్టలతోఁ గూడఁ జేతనున్న సొమ్మునంతయుఁ బెరుకుకొని పోయిరి.

తాను దిగంబరుఁడగుట యంత కష్టముగఁ దోఁచలేదుగాని "అయ్యో! నా ప్రియురాలికై యిన్ని కష్టములఁబడి సేకరించిన

సొమ్ము దొంగల పాలైనదే! ఇఁకనే నెట్లు దానిని సంతోషపఱచి దాని మన్నన వడయుదు!" అని కొంతసేపు చింతించుచుండి, పట్టాభిరాముఁ డొక దారినిబట్టి పోవుచుండ నరుణోదయమై కొంచెము వెలుతురు వచ్చునప్పటికిఁ దన యదృష్టవశమునఁ జీఁకటిలోఁ దొంగలకంటఁబడక మిగిలియున్న తన వ్రేలియుంగరముఁ జూచుకొని, కొంత సంతసించి బిఱబిఱ నడిచి, తెల్లవాఱక మును పా యూరిముందరనున్న యొక కాపువానియింటికి వెళ్ళి, తలుపుఁ గొట్టఁగా నా యింటివాఁడు వెలుపలికి వచ్చి "యెవరు" నియడిగెను.

పట్టాభిరాముఁ డతనితో "అయ్యా! నాది పరదేశము. కొంత పనిపడి రాత్రి యీయూరికి వచ్చుచుండ దారిలోఁ దొంగలు కొట్టి పైబట్ట దోచుకొనిరి. దైవానుగ్రహమున నీ యుంగరము వారి కంటఁబడక మిగిలెను." అని యుంగరమును జూపెను. ఇతని సంగతి విని కాపువాఁడు జాలిఁగొని, యొక చినబట్టను గట్టనిచ్చి, యా గ్రామమందున్న సాహుకారునొద్దకుఁ దోడ్కొని వెళ్ళి, యాతని స్థితిని గూర్చి చెప్పెను.

అంతఁ బట్టాభిరాముఁ డుంగరము నతని చేతికిచ్చి, "దీనికిఁ దగిన వెల నిచ్చినచో నాకుఁ జాలనుపకారముఁ జేసినట్లగు" నని చెప్పెను. సాహుకా రా యుంగరమును జేతఁ దీసికొని బయటికివచ్చి వెలుతురులో దానిని బాగుగాఁ బరీక్షించి, తలయూఁచి, లోపలికివెళ్ళి దానిని దాఁచిపెట్టి, రెండు క్రొత్త పంచెలును, నైదు రూపాయలును దెచ్చి, చేతఁ బెట్టెను.

ఉంగరము వెల యెక్కువైనను, సమయము గానందున నిచ్చిన దానితోఁ దృప్తిఁజెంది క్రొత్తబట్టలుగట్టుకొని, ప్రాతపంచెయు నొక పావులాయును గాపువానికిచ్చి పంపి, తాను బజారునకు వెళ్ళి

యొక హాఫారమును, నొకకోటును, గోనితొడిగికొని కొన్ని పండ్లను, కొంచెము పాలును గొని యాఁకలి దీర్చుకొని, దెబ్బలచే శరీర మలసి యుండుటచే నడువలేక యాయూరియందున్న శివాలయమున నిద్రించెను. మఱుదినమును ఫలములనుదిని పాలుద్రాగి యచటనే యుండి, తన చేతనున్న పైకము మార్గ వ్యయమునకు సరిగా నుండుటచే మూఁడవదిన ముపవాసముతో రైలుబండి నెక్కి రాత్రి యెనిమిది ఘంటల కిల్లు చేరెను.

కొడుకు రాకఁజూచి శేషయ్య చిన్నకుమారునితో, "ఓరీ! సుబ్బరాయా! నీ యన్న యుద్యోగముఁజేసి ముగించుకొన్నాఁడా," యని విసుఁగుదోఁప నడిగెను. దుష్కార్యము లొనర్చినవారు దానిని మఱపించుటకొఱకుఁ గలయిక నభినయింతురు కదా? పట్టాభిరాముఁడా మాట విని తనపైఁ దండ్రి కోపముకలిగి యున్నాఁడనియుఁ దాఁ జేసిన ఘోరకృత్యముఁ దెలిసిన నిఁక నెన్నఁడును దన ముఖము జూడకుండుటయేగాక, యిల్లు మెట్టింపఁ డనియు నెంచి, యేదేని బొంకు బొంకఁదలంచి తల దాఁచుకొనితిరుగువాఁడు తానే తండ్రియెదుటికి వచ్చి "నాయనా! పదిరోజులనాఁడు, నా స్నేహితుఁడొకఁడు తిరుచినాపల్లిలోఁ బనులున్నవని యుత్తరము వ్రాసియుండెను. అందులకై వెళ్ళి చూడఁగా నేఁజూడఁదగిన పనులయందు వేఱుమనుష్యులు కుదురుకొనిరి. పరికృతము విడిగానుండు పనులేవియు నాకు సరిపోకుండుటచే వృథాగా నచటనేల యుండవలెనని తిరిగి వచ్చుచు శోభావతిని బుట్టింట విడచి వచ్చితి"ననెను. పట్టాభిరాముని బొంకులు విని యప్పటికిమాత్ర మందఱు సత్యమని నమ్మి నెమ్మదిగనుండిరి. కేవల మసహాయయైన శోభావతి గతియేమైనదో కొంచెము గమనించెదము.

కుంభకోణమున రామచంద్రయ్య స్నేహితుఁడు లింగిసెట్టి వర్తకమునకై కంచిసరుకు దెచ్చుకొనఁదలఁచి రాత్రి రైలుస్టేషనుకు

వచ్చునంతలో రైలు వెళ్ళిపోవుటచే, నచటనే పడుండి వేకువనే లేచి త్వరగాఁ దనయింటికిఁబోవఁదలఁచి దగ్గఱి యడ్డత్రోవను వెళ్ళుచుండ, దారిలో బలమైన గాయముతో నొకస్త్రీ యొక చెట్టుక్రింద సొమ్మసిలి పడియుండఁజూచి, తానామెను జిన్నతనమున నెచటనో జూచినట్లుజ్ఞాపకమువచ్చి "యీమెయెవ్వరైయుండు"నని కొంతసేపు యోచించి "యెవ్వరైననేమి యాపదలో మునిఁగియున్న" దనిదగ్గఱఁజేరి గమనించిచూచి యూపిరాడుచుండుటచే గా[illegible] మూర్ఛిల్లెనని యెంచి,తనయొద్దనున్న సేవకునిచే నీళ్లు [illegible] ముఖమునఁ [illegible]చుండఁ గొంతసేపటి కామెకుఁ దెలివి[illegible] కన్నులు దెఱచి చూచినంతలోఁగన్నులు మూసికొనెను. సె[illegible]యు ధైర్యముగలిగి మరల ముఖమున నీళ్లుచల్లఁగ నా[illegible]న్నులు విప్పి నలువంకలఁ జూచి తాను చెట్టుక్రిందఁబడి యుం[illegible]యుఁ దనయొద్ద నిద్దఱు మనుష్యులుండుటయుఁ గనుఁగొని,మాటా[illegible]క చాలక యూరకుండెను.

సెట్టి యామెనుజూచి "అమ్మా! నీవెవ్వరిదానవు? నీ కింతదెబ్బ[illegible] యిచట బడియుండుటకుఁ గారణమే"మనియడిగెను. శోభావతి పెదవులు దడుపుకొనుచుఁ దిన్నగాఁ దన్నడుగుచున్న మనుష్యుఁడు తనతండ్రి యొద్దకపుడపుడు వచ్చువాఁడని తెలిసికొని కొంత ధైర్యము కలిగి, "అన్నయ్యా! యిదియేయూరు?"నియడిగెను. సెట్టి "అమ్మా! ఇదికుంభకోణము. నిన్నెచటనో చూచిన జ్ఞప్తియున్నది నీవెవ్వరో చెప్పు"మనెను. తనపుణ్యము వలన నచట దిగినందులకుఁ దనలో సంతసించుచు శోభావతి "అన్నయ్యా! నాకు మాటాడ శక్తి లేదు. తేరువీధిలోనున్న రామచంద్రయ్య గారియింట ననుజేర్చిన మీకుఁ జాలపుణ్య"మని చెప్పెను.

సెట్టి తన సేవకునిచే నొకయొంటెద్దుబండిఁ దెప్పించి, దిన్న

గా నామెను బండిపై నెక్కించి, బండి మెల్లగాఁ బోవనిచ్చి రామచంద్రయ్యగారి వాకిట నిలిపి, తానుఁ లోపలికి వెళ్ళి, "రామచంద్రయ్యగారూ!" యని పిలిచెను. రామచంద్రయ్య యీవలకు వచ్చి, సెట్టిని జూచి "సెట్టీ! కూర్చుండు" మనెను. సెట్టి "కూర్చుండుట యటుండనిగాని, వాకిట బండి యందున్న వారెవరో చూచిరండు. తర్వాత మాటలాడుకొందా" మనెను. రామచంద్రయ్య పరుగున వీధిలోనికి వెళ్ళి, రక్తసిక్తమైన బట్టతోను, చెను గాయముతోను, బడలికతోను బండిలోనున్న తన గారాబు పుత్రిం జూచి, శరీరము వణకుచుండ వీధియని యైన దెలియక కన్నీటిధారలతోఁ "తల్లీ! యిది యేమి విపరీతము?" యని దిగ్భ్రమఁ జెంది [illegible]ను

దెబ్బలు ములసట చేతను రక్తము స్రవించుట చేతను బలహీనయై మాటలాడ నోపిక లేక, శోభావతి తన తండ్రిని జూచి, కన్నుల నీరు నిండ, హీనస్వరముతో, "నాయనా! రట్టు చేయకు" మని తండ్రి చేయూఁతగొని, మెల్లగా బండిదిగి, లోపలికిఁ బోయి, కూర్చుండ లేక నేలపైఁ బరుండెను.

తాననుకొన్న "క్షేమ శోభావతియే" యని తెలిసి రామచంద్రయ్య ముఖము చూచి సెట్టి, "అయ్యా! మీ యమ్మాయిని జిన్నతనమునఁ జూచియుంటి. ఇపుడు చూడకుండుటచే నాకు గురుతు దెలియలే" దని చెప్పి రాత్రి కంచి నగరి దప్పుకొని ప్రోలునకుఁ దాను వెళ్ళుటయు, బండి తిప్పుటచే క్షేమముగాఁ బరుండి వేకువనే కాలిత్రోవను వచ్చుచుండ నొక చెట్టుక్రింద నీమె యీస్థితిలో బడియుండెననియు, ముఖమున నీళ్లు చల్లి తెలివివచ్చిన తరువాతఁ గారణ మడుగగా నామె చెప్పక "యింటఁ జేర్చు" మని మాత్రము చెప్పెననియుఁ జెప్పి "బిడ్డను జాగ్రత్తగఁ జూచుకొను" డని వెళ్ళెను

నుగాక యూరకయే యుండెను. అచట నొక స్త్రీ రైలు దిగివచ్చుచుండఁగా నామెను దోఁచఁ జేసికొని యింటికి వచ్చుచుంటిని. దారిలోఁ జోరుల దృష్టిపడి యామె బీదరాలగుట నామెను నాలుగు చఱచి వెళ్ళఁగొట్టి యొకరాతిని నా నెత్తిపైఁగొట్టిరి. ఆదెబ్బకు తెలివిదప్పి నేలఁబడితి. అంతనాకరినాత్ముఁడు నా పైసొమ్ములు దోఁచుకొని వెళ్ళినట్లున్నది. తెల్లవాఱిన తరువాతఁ గనులు దెఱచి చూడఁగా నీసెట్టి యగుపడె" యని చెప్పి, పిదప మాటాడలేక యూరకుండెను.

పార్వతమ్మ శోభవతిచెంపఁ దువ్వుచు "తల్లీ! నీమగనికి సహాయము వెళ్లుట కింకెవరులేక చూలాలైననీవే వెళ్లవలసివచ్చెనా నాముద్దులప్రాణమా "నాకిచట నేమియు కొఱఁత లేదు కాన నీవు డువచ్చుట కిష్టములే"దని వ్రాయుచుంటివే. నీసౌఖ్యమునకిదియేనా గురుత!" అని యామెశరీరమును దడవుచుండ గుదుములు చేతికిఁదగిలి "హా! నాపట్టీ! చాలదెబ్బలే పడినట్లున్నదే నాబంగరుతల్లీ! నీయొప్పి నైనమెచ్చి దేవుఁడే నీ యాపదను దప్పింపఁగూడదా!" యనిదుఃఖమాపుకొనలేక వెక్కి వెక్కి యేడ్వసాగెను.

వారిరోదనమువలన బిడ్డ కింకను శరీరమలసి పోవునని యెంచి, రామచంద్రయ్య, "అమ్మా! దేవునిదయ యుండఁబట్టియే మనబిడ్డను ప్రాణములతోఁ జూడఁగలిగితిమి. మీరు రట్టుజేసినఁ బిల్లను మఱింత దిగులుఁ బెట్టించుటే" యని ముసలామె నవతలికిఁ దీసి వైద్యుని రప్పించిరి

వైద్యుఁడామెను జూచి చాల నీరసముగానుండుటను గమనించి యొకరబ్బరుగొట్టముతో గుండెను శ్వాసకోశమును గడుపును బరీక్షించిచూచి, శరీరమంతట నున్న గుదుములను నెత్తిగాయమును జూచి యాశ్చర్యపడి రామచంద్రయ్యతో "అయ్యా! దెబ్బలచే నీమెశరీర

మును గుండెయుఁ జాల నదరిపోయియున్నది. చూలాలై యున్న యీమె కిట్టి దురవస్థ గలుగుటకేమి కారణము? ఈమె శరీరముస్వస్థపడుట కొన్నిమాసములైనఁ జాల"దనెను. "గాలి గొట్టినప్పుడుగదా తూరుపెత్తవలె" నన్నట్లు యిట్టి వ్యాధిగ్రస్తులు వచ్చినప్పుడుగదా వైద్యులు బెదరించి ధనము లాగుదురు. వైద్యుఁడిట్లు చెప్పుచుండ పార్వతమ్మయుఁ గళ్యాణియుఁ నోటఁబడిలేక చిత్రప్రతిమలవలె నిశ్చేష్టలఁబడిరి. రామచంద్రయ్య "అయ్యా! గర్భములోని శిశువున కేమైన నపాయము గలిగియుండునా?" యని దీనస్వరుఁడై యడిగెను.

వైద్యుఁడు "అయ్యా! దేవుని దయవలనను, మీ యదృష్టము మంచిదగుటచేతను, గర్భమునకేమియు నపాయములేదు, శిశువున కపాయము గలిగినఁ బెద్దప్రాణమునకుఁగూడ నపాయము సంభవించియుండును. దైవ మామె పాలిటనుండి యా యపాయమును దప్పించెను" అనెను.

రామచంద్రయ్య యశ్రుధారలతో వైద్యుని చేతులు పట్టుకొని, "అయ్యా డాక్టరుగారూ! నా కేకపుత్రి. నాబిడ్డగాదు. మీబిడ్డ. ఇవి చేతులుగావు. మీ కాళ్లనుకొనుడు. నాబిడ్డను బ్రదికించు భారము మీయది!" యని ముఖమునకుఁ గరము నడ్డముఁ బెట్టుకొని యేడువసాగెను

పాపము రామచంద్రయ్య యేడ్పుఁజూచి వైద్యునకు జాలిపుట్టి "అయ్యా! మఱేమియు భయము లేదు. మీరు ధైర్యముగ నుండుఁడ"ని చెప్పి వెచ్చని నీటిచే గాయమును గడిగి యౌషధమువేసి కట్టు గట్టి లోపలి కౌషధమిచ్చెను.

చట్టి మూయుటకు మూఁకుడున్నదిగాని సముద్రము మూయుటకు మూఁకుడున్నదా? పట్టాభిరాముని చర్య లోకరినోటనుండి

యొకరినోటఁబడి యున్నట్లు పల్లెల దాఁటి వీరి చెవిని బడుచుండినను శోభావతి వ్రాయుచుండిన యుత్తరములవలనఁ గొంత ధైర్యముతో నుండిరి. తాము వినుచున్న కబురుల కానవాలుగ నపుడు జరిగిన ఘోరకృత్యమునుజూచి బిడ్డ తనవారిపై నభిమానముచే వాస్తవమును దాఁచెనని తెలిసికొని యామె నుపచరించుటకై తలిదండ్రులిరువురు కొంత ధైర్యముఁ బూనిరిగాని గోడ నానుకొని నిలువఁబడిన ముసలామె మరలఁ లేవలేక "హా! నా ముద్దుపాపా! హా నా బంగరు బొమ్మా! లోకమునందు బుణ్యవంతుల బిడ్డలు పెనిమిటిచే లాలింపఁబడుచు నత్తవారిండ్ల నల్లారుముద్దుగఁ గాపురము చేయలేదా? భగవంతుడు నాయొక్క బిడ్డనే యిట్టి చిన్నచూపు జూపవలయునా? నా కన్నులుచేసిన పాపమా! ఇట్టిక్రూరు లెట్టి కష్టములఁ బెట్టిరో గదా! ఓ బుద్ధిమతివగు నాతల్లీ! నీ యుత్తరములఁ జూచి నీతండ్రి నమ్మికతో నుండెనే కాని. నాటికినాఁడే బిడ్డను దీసికొనిరమ్మని పోరుచుంటినే! ఈ ముసలిముండమాటను నెవరును సరకుఁ జేయకుండిరే కాలము వ్యతిరిక్తముగ నున్నపు డెవరికైన మంచిబుద్ధులు పుట్టునా వారి కెక్కుసమైన నాబిడ్డను నా యింట విడిచివేయఁగూడదా! ఎవరేమనుకొన్న నేమి? లోకమున నెందఱుపిల్లలు లత్తవారి పోరులేక తలిదండ్రులపంచ నుండలేదు! అపకీర్తికి వెఱచి కుమారి ప్రాణములకే యపాయము వచ్చినది గదా!" యని యనేకవిధముల బలవించుచు లేచి నిలుచుటకైన శక్తి లేసిదయ్యెను. వార్ధక్యము చేతను. మనోవ్యాకులతచేతను, నోరరుచియై, యన్నమితవు దప్పి, విరేచనములు జ్వరముతో యవస్థ బడుచుండెఁ గాని, శోభావతి జబ్బువలన నీమె నెవరును గమనింపరైరి.

వైద్యుఁడు శోభావతికి దివసమునకు రెండుమారులు గాయమును వెచ్చనినీటిచేఁ గడిగి యౌషధము వేసి కట్టు కట్టుచు లోపలికి

మంచి యౌషధము లిచ్చుచు వచ్చుటచే రెండు మాసములకు గాయము చక్కగా మానిపోయి శరీరము స్వస్థమై కొంచెము సత్తువ గలిగి యిటు నటుఁ దిరుగులాడ సాగెను.

పార్వతమ్మకు నానాటి కశక్తత యెక్కువై దినదినము మంచ మెక్కెను. తనకై వగచి వగచి యా చింతతో నవ్వ మంచమెక్కె నన్న వ్యాకులముతో శోభావతి తల్లికి సహాయముగ నవ్వ కుపచరించు చుండెను. లోకమున గోలిన లేఁగాక కడుపునఁబుట్టిన పిల్లకన్న నెక్కువగఁ జూచుకొనుచుండిన యత్తగారి జబ్బుఁజూచి యింక జీవించుట కల్లయని వగచుచుఁ గల్యాణి యింటను బవళ్లు కనిపెట్టుకొని యుండెను గాని, ఔషధములవలనను, నుపచారములవలనను, నేమి ప్రయోజనము లేక తుద కామె పరలోకమునకు వెళ్లెను. పదిరాత్రులు గడచెను, అపరక్రియలు ముగిసెను. దేవుని దయవలన శోభావతి జబ్బు కుదిరిన సంతోషమున రామచంద్రునకును గల్యాణికిని దుఃఖ మంతగ దోఁచదయ్యె.

నవమాసములు పూర్తియగుటచే శోభావతి కిడుగు పెట్టుటే మహాభారముగ దోఁచుచుండెను. నెలలు నిండిన కొమరితెం జూ తల్లి, పిల్ల చల్లగా లేచునరెనని కల్యాణి వేవురు వేల్పులకు మ్రొక్కొను చుండెను.

ఒకదినము రాత్రి శోభావతికిఁ బ్రసవవేదనము గలిగి కష్టప డుచుండెను. రామచంద్రయ్య భార్యనుజూచి "ఓసీ! బిడ్డ క్షేమమైనఁ సుఖముగ నుండిన నెప్పుడు. తెలిసినవారిని బిలిపించెద"నని పలుమా రనుచుండెను.

మఱునాఁడు పగలు రెండు గంటలకు ఆఁడుబిడ్డను గని యొడలు సుఖముగ నుండుటచేతను బిడ్డను జూచిన సంతోషమున

చేతను శోభావతి హాయిగఁ బవళించెను.

రామచంద్రునకును గల్యాణికిని గలిగిన యానందమునకు మేఱలేదు. పది రాత్రులు వెళ్ళినవి. పదునొకండవదినమునఁ స్నానము చేయించి యారాత్రి శిశువును దొట్ల నుంచిరి.

చక్కఁదనమునఁ జక్కెరబొమ్మవలెఁ దళ్లికిని: నవ్వు తాతలకును, శోభావతి బిడ్డ నయనానంద మొనరించుచుండెను. తల్లికిఁ దాఁబడిన కష్టములు జ్ఞప్తికి వచ్చినను ముద్దులు మూటఁగట్టెడు బిడ్డనుజూచి యన్నియు మఱచుచుండెను.

రామచంద్రయ్యకును గల్యాణికిని మనుమరాలి ముచ్చటలు చెప్ప శక్యముకాదు బిడ్డను కంటికి ఱెప్పవలెఁ జూచుకొనుచుండిరి గాని, మునలామెయుండిన బిడ్డనుజూచి యెట్లు పెంగిపోవునోయని కొంతచింత దోఁచుచుండెడిది.

పిల్లకు మూఁడుమాసములు వెళ్ళినవి. ఎవరిని జూచినను నూఁగొట్టుచు, నవ్వుచు, నెత్తుకొమ్మని చేతులు పైకెత్తుచుండ మామగారును, చిన్నత్తగారును సోదరప్రేమగల మీనాక్షియు బిడ్డను జూచిన నెంత సంతోసింతురోయని శోభావతి తలఁచుకొనుచుండెను గాని. తాను బుట్టినింటికి వచ్చినప్పటి స్థితిని దలఁచి యప్పుడేమియు జెప్ప [illegible]చుచుండి, యొకనాఁడు తండ్రినిజూచి, ''నాయనా' పిల్ల పుట్టినదని మా మామగారికుత్తరము వ్రాసితిరా?'' యని యడిగెను. ఆమాటల కెక్కువ కోపము కలిగెఁగాని కూతురి మనసు చిన్నఁబోవునని రామచంద్రయ్య కోపము నణఁచుకొని, ''తల్లీ. నీవభిమానవతివిగాన, భర్త కొట్టెనని చెప్పక, దొంగలు కొట్టిరని చెప్పితివి. దైవము మాకన్నుల బడవేయకున్న నీగతి యేమగును' నీమాటలు నిజమైయుండి దారిలోదిగిన కోడ లేమైనదోయను జ్ఞప్తి వారి కుం

డిన వా రిట్లుందురా! వారి యునికిఁజూడ నీవుండుట భ్రాంతియై తోఁచి వారిలోనే యెవరో యీపని చేసియుందురని స్పష్టమగుచున్నది.” అని పెడమొగముఁ బెట్టుకొనెను.

శోభావతి “తండ్రీ! అట్లెన్నడును దలఁపవలదు. అట్లున్న నేనింత ధైర్యముతోఁ జెప్పుదునా!” అనెను

ఇంకెవరైన నా మాట నెత్తియుండిన రామచంద్రయ్యకున్న కోపముచే పైఁబడి యుందురు గాని యత్తవా రింతఁ జేసి, తానును నక్కసముగ మాటలాడిన బిడ్డ మనసునకు నొప్పి దగులునని యెంచి వారింత క్రూరులయ్యును భక్తివిశ్వాసములు వదలకుండెడి కూతురి సుగుణములకు లోలోన మెచ్చుకొనెను.



# శోభావతి.

## ఎనిమిదవ ప్రకరణము.

ఒక దినము మధ్యాహ్నము పండ్రెండు గంట లగునప్పటికి శేషయ్య భోజనముఁ జేసి తాంబూలము వేసికొనుచు వీధి గుమ్మమున నిలిచియుండఁ దపాలా నౌకరొక యుత్తరము తెచ్చి యిచ్చి వెళ్లెను.

శేషయ్య కొంతవఱకుఁ జదివెనుగాని కడవఱకుఁ జదువక ముఖము చిన్నఁబుచ్చుకొని లోపలికివచ్చి భార్యను బిలిచి యామె వినునట్లు యిట్లు చదువ నారంభించెను.

ప్రియమైన వియ్యంకులకు,
రామచంద్రయ్య వందనములతో వ్రాయుట యేమనగా —

ఆఱుమాసముల క్రిందట మా యూరి వర్తకుఁడొకఁడు రైలు స్టేషనునుండి వచ్చుచుండ, నెత్తిపై బలమైన గాయముతో బుస్తెమొసలు సర్వమును దోఁపిచ్చి తెలివిఁదప్పి పడియున్న మా కొమరితంజూచి, మాపాలిటి దైవము వలె నా పుణ్యాత్ముఁడు మాయింటఁ దెచ్చి యప్పగించెను తరువాత కొంతసేపటి కామెకు స్మృతి కలిగినవెనుక యేమని యడిగినఁ దన పెనిమిటి కుద్యోగము కుదిరినందునఁ, వారిరువురు రైలెక్కి వెళ్లుచుండఁ గుంభకోణము స్టేషనునొద్దఁ దనకు నాయాసము వచ్చి దిగినట్లును, తోడనే రైలు వెళ్ళిపోయినట్లును, నచట రైలుదిగిన యొక స్త్రీ సాహాయ్యమునఁ దానింటికి వచ్చుచుండ దారిలో దొంగలు నెత్తిపైఁగొట్టి సొమ్ములు దోఁచుకొనినట్లును జెప్పెను. ఆమె

మాటలు నిజమేయైన నగపడనివారిని వెదకుకొనకుండువారుగలరా? ఒకవేళ మాపిల్ల దుర్మార్గముచేఁ జెప్పక వచ్చి యుండునని యభిప్రాయపడి యుంటిమిగాని, తాను పిల్లనుగన్న సంతోషమును మామగారికి తెలుపుమని ముమ్మాఱు చెప్పుచుండుటచే నేను దలఁచుకొన్నది ప్రమాదమని తోఁచెను. నాలుగు మాసములఁబట్టి వ్రాయుమని నిర్బంధించుటచే నామె తొందఱఁబడలేక కోడలక్కఱలేని మీకు బాలెంతమున వ్రాసితిని.

ఇట్లు,
మీ విధేయుఁడు,
రామచంద్రయ్య.

తల్లి చదివి యాపత్రిని యాగ్రహముగలదై, "ఏంటివే! నీకొడుకుచేసిన దుష్కృత్యము. ఇన్నిదినములు వాని వెనుక వేసికొని మాటలాడుచుండిన నోరిప్పుడు మెదల్పకున్నావేమి? మొదటినుండియు నాచెనటికి నీవు బుద్ధిఁ జెప్పుచుండిన నింత ముప్పువాటిల్లునుగదా! అట్లుగాక నీవు వానికి సాహాయ్యముగ మాటలాడుచుండి సుగుణవతియైన యాపిల్లను సిగ్గుపడఁబెట్టి నేఁడుకొని తిన్నావుగదా! నీవలెనది గయ్యాళిగనుండిన నీపిల్లకు నాతండు ముప్పుదెచ్చియుండును పాప మాపిల్ల యిన్నిపాట్లు నోర్చుకొనుటయేగాక యీచండాలుఁడేమిచేసి వచ్చెనో యెఱుఁగము. మనయందలి యభిమానముచే నాపిల్ల నిజమును దాఁచి గౌరవమును గాపాడఁ దలఁచుచున్నది ఇంతటి మానవతి నిన్ని కష్టపాట్లఁబెట్టి పాప మెన్ని జన్మములకుఁ దీర్చుకొనఁగలము? హద్దుపద్దులేక యింటి పెద్దచిన్నలనెల్ల దుర్భాషలాడి తగవులకీడ్చి ఆయాయింటివారి పిల్ల గయ్యాళి" యని యనిపించి. మూఁడుదినములకొకమారు రత్నమంటి మనమాణిక్యము నీయొద్దకుఁ బరుగెత్తి వచ్చునట్లు

జూచుచునే మహానుభావురాలగు పిల్ల నిన్ని కష్టపాట్లఁ బెట్టుటచే అడవి మృగములని చెప్పవలెనేగాని నీవుగాని నీ కొడుకుగాని మనుష్యులై యున్న నొకరికైనఁ గొంచెము పశ్చాత్తాపముగలుగదా! నీవుగని పెంచినట్లు లా మెతల్లి యామెన గని పెంచలేదా! ఆమెను మంగలము లోఁ బెట్టి వేపుకొని తినుచున్న నీ మనసిప్పుడు చల్లఁబడినదా!'' అని భార్యాపుత్రుల దుర్నయ దుశ్చేష్టితములఁ దలఁచి తలఁచి మనసు మండుచుండ ననేకవిధములుగఁ జీవాట్లు పెట్టుచుండు పెనిమిటినిఁజూచి జానకమ్మ చేయిచాచి ''చాలును. మీ పురాణమిఁక ముగింపుడు నేను దాని నేమనుచుంటిని? మగలు నెత్తికెక్కిన మీరు మెచ్చుకొనవలెఁగాని, దాని గయ్యాళితనము నేఁగాఁబట్టి యోర్చుకొంటిని. ఎంతటి యాఁడుదిగాకున్న మగని నెత్తిని నింతటినింనఁబెట్టినది?''

భార్యమాటలకు శేషయ్యకు మరింత విసుగుకలిగి ''ఓసీ! దౌర్భాగ్యపుముండా! దానిసుగుణములన్నియు నీకు దుర్గుణములుగాఁ దోఁచెనా! దురాచారిణీ! యాపిల్లను బెట్టిన పాట్లింతను జాలవని తోఁచుచున్నదా కఠినాత్మురాలా నా యెదుట నిలువక అవలకుఁ బొమ్ము'' అని తాను గదిలోనికివెళ్ళి మంచముపైఁబరుండి ''హా దైవమా! నేఁజేసికొన్న పాము నాకీ పున నిట్టి దుర్మార్గుఁడు పుట్టవలయునా: కొంచెమువరుఫుత కా ము వెళ్ళఁబుచ్చుకొనుచుండ కొంచమేని గౌరవము దలఁపక వీఁడిట్టి యవివేకకృత్యములొనర్చుచున్న నేనెట్లు నలుగురిలోఁదగుదునని తలయెత్తుకొని తిరుగుదును? అనాథ్యవ చెప్పక దాఁచిపను మార్గమధ్యమున జరపిన యీ దుష్కార్యమెల్ల దాఁగఁగలదు? ఈయపకీర్తి నేరీతి బాపుకొందు? మఱియు వీధిలోఁ దలఁజూపిన దారిఁబోవువారు నాముఖమున నుమ్మివేయకుందురా: దైవాధీనమున నాపిల్లప్రాణము దక్కినందున మంచిదయ్యెనుగాని, లేకున్నఁ దలిదం

డుగ్రిలకేమి యుత్తరముఁజెప్పుదు? లోకులకేమి సమాధానముఁజెప్పు వాఁడ? మహాపాత్ముఁ డెంతపాతకమున కొడిఁగట్టితివిరా? యీపాపమెన్ని జన్మములకు దీర్చుకొందువు?" అని పెక్కువిధములఁ గొడుకును నిందించుచు "నూరివారెవరైనఁ దన్నడిగిన వారికేమి సమాధానముఁజెప్పుదు" నని పలువిధముల యోజించుకొనుచుండెను.

అంత సాయంకాలమప్పుడు గొప్ప యుద్యోగస్థునివలె వెళ్ళియుండిన పట్టాభిరాముఁ డింటికివచ్చెను. జానకమ్మ సైగఁజేసి కొడుకును మిద్దమీఁదికిఁ దీసికొనివెళ్ళి యుత్తరముయొక్క వివరమును దండ్రిపెట్టిన చీవాట్లనుజెప్పి వాస్తవమునడిగెను. కాని యామె కేదియుఁ బ్రత్యుత్తరముఁ జెప్పక పట్టాభిరాముఁడు క్రిందుఁజూచుచుఁ బలుకకుండెను.

కుమారుని దుశ్చేష్టలకు జానకమ్మకు మాత్రిమేమియుఁ గష్టము తోఁచకుండెను గాని, యింటనింకెవరికిని యతనిముఖముఁ జూచుటకే యసహ్యముగనుండెను. సుభద్రమ్మ కతని విస్తరలోనన్నము వేయుటకయిన నిష్టము లేకుండెను గాని, మంచితనమున నతని నోటవాస్తవము నెఱుఁగవలెనని సమయముఁ జూచుచుండెను. పగలును రాత్రియుఁ దండ్రిభోజనముచేసి పరుండిన సమయమునఁ దన స్నానభోజనములఁ దీర్చుకొనుచుఁ బట్టాభిరాముఁడు తండ్రి కంటఁబడక తలఁదాచుకొని తిరుగుచుండెను.

ఒకనాటిరాత్రి భోజనములైన పిదప నందఱుపరుండిరి. గంటలు పదునొకండైనవి కొడుకునకై సుభద్రమ్మ కాచికాచియుండి విస్తరముందుఁగూర్చుండునప్పటికి వీధితలుపు చప్పుడుకాఁగా లేచితిన్నగాఁదలుపుఁదెఱచెను. పట్టాభిరాముఁడు మిద్దమీఁదికిఁబోయి గుడ్డలు దీసివచ్చి కాళ్ళుసేతులు గడుగుకొని యామెదగ్గఱ గూర్చుండెను.

సుభద్రమ్మ వడ్డించుచు నతనియొద్దఁ గూర్చుండి మంచిమాటలతో నిట్లనెను. "నాయనా! ప్రతిదినము నిట్లు వేళఁదప్పిభోజనముఁ జేసిన శరీరమున కనారోగ్యముగదా!" ఎందులకిట్లు దేహమును జెడఁగొట్టుకొనెదవు? నామాట నీకులక్ష్యము లేకున్నను నాచేతులతో సాకిపెద్దవానిఁ జేసితిని కనుక, మీపై మమకారము నన్ను నిలువనీయదు. ఇంతసేపు నీవు రానందునఁ దిండిమీఁద నైన బుద్ధిపోక నీకై వేచియుంటిని. ఏమో పిల్లలులేని దాననుకాన మీతోడిదే లోకమని మిమ్ములఁ జూచి సంతోషించుకొనుచుందునుగాని నీవిన్నాళ్లనలెఁగాక కపటప్రవర్తనుఁడవై యున్నావు. కాన నాకిచట నుండ నిష్టములేదు. మనలాయన నడిగి నాలుగు దినములలో మాపుట్టింటికి వెళ్ళఁదలఁచి యున్నాను."

ఆమెమాటలకుఁ బట్టాభిరాముఁడు తనలోనిట్లనుకొనెను "మన తల్లి గృహకృత్యములు చేతఁగాని సోమరిది. వేళకువచ్చిన నేగాని పిండము వేయదు. తండ్రిముఖముఁ జూచుటకు భయమగుచున్నది. కాఁబట్టి వేళకు సరిగా వచ్చుటకు నాకు ధైర్యములేదు. ఆదరణముతో వాస్తవముగ నీమెతల్లిగాని యామెగాదు. ఈమె వెళ్ళినఁ దిండిలేక యెండవలసినవాఁడనే కావున నీమెకు నణఁగి యుత్తర మిచ్చుటయే మే"లని యెంచి "పిన్నమ్మా! నిన్నే తల్లిగ నెంచియున్న నన్నట్లనఁబోకుము. నీ విషయమున నా కేమాత్రము కపటములేదు. నీవిచటలేకున్న నేనును దేశత్యాగినై వెళ్లవలసినదే" అనెను.

సుభద్రమ్మ:— ఓరీ! అట్లనవలదు తలిదండ్రులు చక్కగా నుండవలెఁ గాని నీకేమికొఱఁత.

పట్టాభిరాముఁడు:— ప్రీతిగ నాదరించు వారులేక యెండలున్న నేమి?

సుభద్రమ్మ:— "నాయనా! నీవుపుట్టింట విడిచితినని తం[illegible]

ఎనిమిదవప్రకరణము.

లోఁజెప్పిన వాస్తవ మనుకొంటిమి గాని, పిల్లవివాహమును గుఱించి నాతోఁ గూడఁ జెప్పక యింత మర్మముగ దాఁచనేల! లోకమునఁ బిల్ల లెంతో గయ్యాళితనముఁ జేయుచున్నారు ఒకరిననేల? మనమాణిక్యము మాణిక్యమే. అదియటుండఁ, దాఁచెన్నది, నేఁజెప్పగూడదుగాని, నీ తల్లి యేదో యొక నెపమున ముసలాయనతోఁ దగవాడుచునే యుండును. పాపమా పిల్ల నీవేమి చేసినను రెండవవారికిఁ దెలియనీక మారుమాటన్నను బలుకక సదికి తప్రీతితోఁ జూచుకొనుచున్న నా యొద్దనయిన వెలిఁబుచ్చినదికాదు. నాయనా! యట్టిసాధ్వి నెటడించి వచ్చితివి. నో చెప్పునిదే యీ యన్నము ముట్టిన నీకు గోమాంసముతో సమముసుమా'' యని యతని కుడిచేతిని బట్టుకొనెను.

అంతఁ బట్టాభిరాముఁడు చేయునది లేక తనలోనిట్లు చింతించెను. ఈమె యింతపట్టుదలతోఁ బ్రతిమాలినపుడు చెప్పకున్న నేఁ జేసినదెన్నఁడైన బయటికి వచ్చిన నీమెకు నాపైఁ బ్రీతి దప్పుటయేగాక గడ్డిపోచకైన నమ్మక నా ముఖమున్నఁ జూడనొల్లదు. కాఁబట్టి యిపుడే తప్పునొప్పుకొన్న మంచిది. ఐననేమి? ఈమెగూడఁ గాత్నురాలును, నాపైఁ బుత్రవాత్సల్యము గలదియు, కాన నామాట వెలిఁబుచ్చదు. ఎట్లైనను నీమెచే నొట్టుఁబెట్టించుకొనవలె నని తలంచి యామెతోఁ ''చిన్నమ్మా! నేఁ జేసినది నాతల్లికైనఁ జెప్పినాఁడనుగాను. ఐనను నీవు తల్లికైనఁ బదిరెట్లు లెక్కువగఁ బ్రేమించుటచే నీతోఁ జెప్పెద గాని నీ వామాటలను బయలుపఱచనని ఒట్టుఁబెట్టుకొనుము'' అనెను.

సుభద్రమ్మ:—''నాయనా! నేమేమో తెలియక జరిగినందులకు నాబిడ్డతప్పుల నేనే బయట వేసిన, వినువారు నాముఖమున నుమ్మి వేయరా! [illegible]గ నేనెవరికిఁ జెప్పుటలేదని యాతనికరమునఁ

గరమునుంచి ప్రమాణముచేసెను.

పట్టాభిరాముఁడు "అక్కలనవినుము. అది చీకటిలో నాయొద్దకు వచ్చునపుడు దానిముక్కున మెఱయుచుండు ముక్కుపుడకలఁజూచి వానిని దీసికొనవలెనని నాకిష్టముండెను గాని, ముందటివలెఁ దీసికొను టకు ముసలాయనకు భయపడి యేదోయొక నెపమునఁ బోరుగూరికి బిలుచుకొని వెళ్ళితి"ననెను.

సుభద్రమ్మ "అక్కన దేహముపైనుండిన వన్నియు నీవు దీసి కొనినవేనా?" యనియడుగఁ గుమారుఁడు తలయూపెను "ఓరీ నేనడి గినప్పుడు నాబంగారుపిల్ల పెట్టెలోనున్నవని చెప్పుచు వచ్చినదిగదరా? పోనిమ్ము, సొమ్ములఁదీసికొని దానినెక్కడ విడిచితివి?" అని సుభద్రమ్మ మరల యడిగెను.

పట్టాభిరాముఁడు "నే నిట్లు చేసి సొమ్ములన్నియుఁ దీసికొని నాదారిని వచ్చితిని అది యేమైనదియు నేనెఱుఁగ"నని తానొనర్చిన వన్నియుఁ జెప్పెను

కొడుకుమాటలకు సుభద్రమ్మ నెత్తిమోదుకొని; "హాతల్లీ నీవెన్నిపాట్లుపడితివే?"యనియెలుఁగెత్తి యేడువలసినంత యాతురముండెఁ గాని, చోరులుచేసిరనుకొన్నది కొడుకేచేసివచ్చినట్లు తెలిసిన ముసలాయన వాని నింట నిలువ నీయఁడనియుఁ గొడుకునకు దానొ ట్టుఁబెట్టినదియుఁ దలఁచి కంఠమెత్తక కన్నీరు వెల్లువలుగట్ట, గద్గదస్వ రముతో నీవునన్నెల్లొప్పురా! అన్నిసొమ్ములూడఁదీసి కొనుటయే గాక నీవుపెట్టిన శ్రమలన్నియు నోర్చుకొని యుండుటయేగాని, యింత చనువుననున్న నాతో నైనఁ జెప్పలేదుగదా కివిచటనేయడిగినఁ దీసి యివ్వదా? పరమసాధ్వియైన పిల్లనింతకష్టపెట్టినదిగాక నట్టడివి నెట్లువిడ చితివి? గొడ్రాలైన నా కే కడుపుదహించుచుండ, లేక లేక కనిప్రా ణములకంటె నెక్కువగ సాకిన తలిదండ్రులెట్లు [illegible] బావలీ.

నీచక్కదనము నాకన్నులయందే మెదలుచున్నదే! నీముద్దుమాటలు నాకెప్పుడును చెవిలో మ్రోగుచున్నవే! అనివాపోవుచు గొడుకును జూచి, "నయనా! నీవింతటి క్రూరకృత్య మొనర్పవచ్చినను నాగుణవతి మనసునొంచక దొంగలు గొట్టిరనిదాచి మనయందలి ప్రీతిచే దండ్రిని బొందఁబఱచి తన సుఖసంతోషముల మనకుఁ దెలిపెఁగదా! అయ్యో! నీవట్టి తప్పు మొనర్చితివో! భగవంతుఁడు నీకిట్టియాలినిఁ గూర్చె ఏమో తెలివిలేక జరిగినది. చదువుకొన్న నీకిట్టి దుర్బుద్ధి కలుగుట నా కనులుచేసిన పాపము గాదా. పోనిమ్ము. తండ్రీ! యికమీఁదనిట్టి కార్యములఁ జేయఁగట్టనని యాన పెట్టుకొను"మని యొకచేత గత్తిము ను మఱియొకచేత నతనిచేయియు బట్టుకొని బ్రతిమాలుచుండెను. "ఒట్టుఁ బెట్టుకొనకున్న నీమె వదలదు, పట్టుకొన్న నేమి? సమయమువచ్చినపుడిట్లుచేయకుండుట కెట్లువీలగు"నని పట్టాభిరాముఁడు దనలో యోజించుకొనుచుండెను.

వీరిద్దఱు గుసగుసలాడ నారంభించుట విని మీనాక్షి తలుపు చెంత నిలచి యంతయు వినుచుండి వీరిమాటలాగఁగనే "యిఁకనుండి రా"దనుకొని చప్పుడుగాకుండ మిద్దెమీఁదికి వెళ్లెను. భార్యగాఁక కాలవ్యయమైనందునఁ గలిగి సుబ్బరాయుఁడు "యేమే, మీనా! నాకునిద్దుర వచ్చుచున్నది. తాంబూలమునకని యెంతసేపు వేచి యుందును.' నీకు రెండుచఱపులు గావలసియున్నట్లున్నదే" అనియఱచెను.

మీనాక్షి:—ఓహో! మీయనుష్ఠానము మీకును గలిగినట్లున్నదే!

సుబ్బరాయుఁడు:—(నవ్వుచు) "పరిహాసమున కన్నానుగాని, యతనివలె నేను చదువుకొన్న మూర్ఖుఁడనుకాను. ఐనను బ్రతిదినము సుభద్రమ్మ బలవంతపఱచి మిద్దెమీఁది కంపుట కింకను జిన్నవి

ల్లవా!" "అదియట్లుండనిమ్ము చిన్నత్తగారును మీయన్నగారును నేమో గుసగుసలాడుచుండ మాయక్కయ్య మాటలేవైన బయలుపడునేమోయని తలుపుచాటుననుండి వినుచుంటి"నని మీనాక్షి కనుల నీళ్ళుగార్చుకొనుచుఁ దానువినిన దంతయుఁ బెనిమిటితోఁ జెప్పెను.

భార్య చెప్పినదంతయు విని మనసు నిలవక సుబ్బరాయుఁడు కంటనీరు పెట్టుకొని, "మీనా వానినన్నయనుకొనినఁ బాపము వచ్చును. అహా. యెట్టి కార్యమున కొడిగట్టినాఁడు! యింతటి ద్రోహి యింకెంతటి కయినను వెనుదీయఁడు! తల్లికంటెను సుభద్రమ్మకంటెను, నన్నామె యెక్కువగ నాదరించి చుండెనే! పార్వతీదేవివంటి యా పరమపతివ్రతకుఁ ద్రికాలములయందు వందనము లొనర్చుచుండిన మనకు సద్గతిక కలుగును. ఆపాపపుముచ్చటఁ జెప్పుకొన్న మనకుఁ గూడఁ బాపము సిద్ధించును. అదియుండనిమ్ము. నేనాలుమాసములఁబట్టి రాజుగారి నగరి కప్పుడప్పుడు పోవుచుంటినిగదా! నిన్నటిదినము నగరిలో బాలుర కుపాధ్యాయునిగ నన్ను నియమించిరి." అనెను

మీనాక్షి:—ఎందరు బాలురుగలరు!

సుబ్బరాయుఁడు:—పెద్ద పిల్లవాండ్రు నలుగురును, చిన్నపిల్లవాండ్రిద్దరును

మీనాక్షి:—అట్లైన జీతమెంత యిచ్చెదరు?

సుబ్బరాయుఁడు:—ఏఁబది యిచ్చెదమనిరి.

మీనాక్షి:—అంతయియ్య రనుకొనెద.

సుబ్బరాయుఁడు:—జీతముఁ దెచ్చి నీచేతికిచ్చినపుడు నీవు తెలిసికొనెదవు లెమ్ము.

మీనాక్షి:—నాథా! అట్లెన్నడుఁ చేయవలదు. మీయన్నగారివలె మీరును బెంకెతన మవలంబింపవలదు. పెద్దలు మీతండ్రి

గారున్నారు. ఇంకను నత్తగారుండగా నాచేతికిచ్చుట మర్యాదగాదు.

సుబ్బరాయుఁడు:—(నవ్వుచు)"నీమనసెఱుఁగవలయునని యంత టనిగాని నీచేతికియ్యవచ్చుటకు నంతబుద్ధిహీనుఁడనా,"

ఇట్లుచాలసేపు ముచ్చటించుకొనుచుండి యిరువురు నిదురించిరి.

మఱునాఁడుదయమున నే శేషయ్య చిన్నకొమారునిఁబిలిచి యే మోచెప్పఁదలఁచెనుగాని మరల నిట్లనియోజించెను. 'ఈఘాతకుఁడు చేసినకృత్యములకు వారికిఁజాల కోపముండును. కనుక పిల్లవాని ని బంపరాదు. మనవాని క్రౌర్యమునకు వారుత్తరము వ్రాసియు మ నము పోకున్న పిల్లకేగాక వారికంతఱకుఁ గష్టముదోఁచును లోకు లు మఱింత పరిహాసింతురు. కాఁబట్టి యెవరైనబోయి తిరవలయును. ఇంతకు నేనేపోయిన వారికిఁగొంచెము శాంతముగలుగును. అయిన నేమని వారిముఖముఁజూతునని నాకుసిగ్గగుచున్నది. నేనుకోడలి ని జూడవెళ్ళెదనన్న నిగయ్యాళిముండ తగవాడుటయేగాక, తిట్టిపో యుచుండును. ఇదిలెక్కింపక పోయినను, మనయందుఁ దప్పుండబట్టి వారు కలహమాడి నన్నేమి యగౌరవపరతురో? ఎల్లైనఁగానిమ్ము. ఇట్టి గుణవతియగు కోడలికై యేమైన నోర్చుకొనెద"ననిసుభద్రమ్మ తో రహస్యముగఁ జెప్పి నగరిపనికని వెళ్లెను.



# శోభావతి.

## తొమ్మిదవ ప్రకరణము.

---

ఒకానొక నాఁడుదయము రామచంద్రయ్య మనుమరాలి ముచ్చటంజూచి సంతసించుచు కూతురినిజూచి "తల్లీ! శోభావతీ! నీతోం దలకై మీమామగారికి వ్రాసినజాబున కింతవఱకుఁ బ్రత్యుత్తరమే రలేదు వారియోగ్యతఁ దెలిసియేగదా నేనువ్రాయనని చెప్పుచుంటిని! నీ మనసునకు నొప్పిదగులనని తోసిపుచ్చ కుండుటకేకాని మీవారెపుడు నను గౌరవించిరి?" అని ముఖమును చిన్నఁబుచ్చుకొనెను. తండ్రి చిన్నఁబోవుటఁజూచి తనకును వ్యాకులమై, "నాన్నా! వారికెన్నో పనులు. కానఁ దీరిక లేకున్నారేమో గాని, లేకున్నవారట్లుండువారు గా"రని శోభావతి చెప్పుచుండ వాకిటబండి నిలుచుటఁగని "పత్రికలెవరో వచ్చియుందు"రని తలఁచి శోభావతి బిడ్డనుదీసికొని లోపలికివెళ్ళెను.

అంత బండిలోనుండి యొక ముసలాయన చిన్న సంచియొకటి తీసికొనిదిగి లోపలికి వచ్చుచుండెను వచ్చునది వియ్యంకుఁడని యెఱిఁగి రామచంద్రయ్యకుఁ బట్టరాని యాగ్రహముగలిగి మీఁదఁబడవలె నన్నంత యాతురముండెఁగాని, యెట్టివారైనను దనయిలుచేరి నపుడాదరింప వలెననియు లేనిచోఁ గూతురిమనసు చిన్నబోవుననియు, నదియేగాక కుమారుని వివాహమపుడేగాని, మరలవచ్చినవాఁడు గాఁడనియు నిపుడు తనకోడలు, మనమరాలి కొఱకయియే వచ్చెననియు నెంచి తనకోపము నడఁచి, యతనికెదురుగవెళ్ళి బావగారూ! దయచేయండి నేఁడు మాకు సుదినము. అనివందనముచేసి లోపలికిఁ దీసికొనివచ్చి కూర్చుండఁబెట్టి కుశలప్రశ్నముఁ జేసెను.

జాలని దినములు. ఎవరేమి చేయఁగలరు' మా నాయన వచ్చుచున్నాఁడు. ఊరకుండుఁ"డని చేసైగఁ జేసి, బిడ్డను జేతికిచ్చి తాను లోపలికి వెళ్లెను.

ఆహా లోకమున నిట్టి గుణవతులున్నారా? నేను జేసిన కొండంత భాగ్యమున నాకిట్టి కోడలు లభియించియు, సుగుణ సుస్వభావములుగల యిల్లాలితో ముచ్చటగఁ గాపురముఁ జేయ భాగ్యము లేని నా కొడుకు దురదృష్టుడు" అని లోలోనఁ గుందుచుఁ గోడలి సుగుణములు మెచ్చుకొనుచు, ముద్దులు మూటగట్టెడు మనమరాలిం జూచి సంతసించుచుండ. రామచంద్రయ్యవచ్చి" కొత్తవారిని జూచినఁ జీకుగాయి పిట్టవలె నరచుచుండు పిల్ల, మీయొడిలో మెదలక కూర్చున్నది. చూడుఁడు. "తనకంపు తనకింపు" అన్నమాట సరిపోయినది" అనియిద్దరు నవ్వుచు మాటలాడుకొనుచుండిరి.

గంటలు పదునొకండైనవి. శోభావతి యీవలకువచ్చి "నాన్నా! చాలప్రొద్దైనది స్నానమునకు లేవరాదా"' యనెను. రామచంద్రయ్య "అమ్మా! యిన్నాళ్ళకు తృప్తికివచ్చిన మీమామగారికి మనమరాలిని జూచుటలో నాఁకలిగూడఁ గాదే" యని నవ్వుచు వియ్యంకునిఁజూచి "లేచిరం"డని యిరువురు స్నానములుచేసి మడుగుపంచెలఁ గట్టి విభూతిరేఖలం దీర్చుకొని సంధ్యాదికమైన పిమ్మట భోజనములకుఁ గూర్చుండిరి.

కొమరిత తనయింటికి వచ్చినప్పటిస్థితిని, నామెకువచ్చిన కష్టములను గుఱించి రామచంద్రయ్య ముచ్చటింపఁ దొడఁగెను; గాని మామగారి మనసున కాయాసము గలుగునని వర్జించుచున్న శోభావతి, తండ్రిఁజూచి "నాన్నా! పాపము వారేమి చేయుదురు? ఎవరినైనఁ బంపెదఁగాని నీవు పోవలదని నన్నెంతో బ్రతిమాలిరి. పెద్ద

మాట మీరినందులకు దేవుఁడు నన్ను మన్నించెను. విధిఁ దప్పింప నెవరితరము? జరిగిపోయినదానిని దలఁచుకొన్న నేమి ప్రయోజనము పోయినది పోనిమ్మనెను.

సూతుఁ డిట్లు చెప్పనిఁక నామెకుఁ గష్టముగ నుండునని రామచంద్రయ్య యామాటలఁ జాలించి వియ్యంకురాలితోఁ గూడ భోజనముఁ జేసి చేతులు గడుగుకొని కూటమునఁ గూర్చుండి తాంబూలము వేసికొనుచు లోకాభిరామాయణము చెప్పుకొనుచుండఁ జిన్నమూటయొకటి భుజమునకుఁ దగిలించుకొని, చేతఁ గఱ్ఱ నూతగాఁ గొని యొక వృద్ధబ్రాహ్మణుఁడు లోపలికి వచ్చెను. అతనిఁ జూడఁగనే "ఓహో! మీరా! దయచేయుఁడు. నా భాగ్యము బాగుగ నుండఁబట్టి పెద్దల దర్శనమైనది" అని శేషయ్య లేచి యతని కరముఁబట్టి కూర్చుండఁ బెట్టెను.

హయగ్రీవులు—(మూటను చేతికఱ్ఱను క్రిందఁ బెట్టి, గోడనానుకొని కూర్చుండి శేషయ్యవంక బాగుగాఁ జూచి) ఓహో! మీరా! యెవరో యనుకున్నాను. నా భాగ్యము బాగుగా నుండుటవలననే మిమ్ముఁ జూచుట యైనది. నేనప్పుడప్పుడు వచ్చువాఁడనే. తాము వచ్చుటయే విశేషము. మీమనుమరాలికొఱకు వచ్చినారు. మాకొఱకై రాఁబోయెదరా! పోనిండు, యింటియొద్ద నందఱు క్షేమమేగదా? పట్టాభిరాముఁ డింకను జదువులోనే యున్నాఁడా! ఏదైన నుద్యోగములో బ్రవేశించెనా?

శేషయ్య—పెద్దల యాశీర్వచనమువలన నందఱును గుశలులే. పిల్లవానికిఁ జాలదినములవలన నీమధ్యకొంత దుర్బుద్ధులు కలిగియుండెను ఇప్పుడు కుదురుగనున్నాఁడు. ఇంకను బనిలోఁ బ్రవేశింపలేదు.

“శ్రీభావతికిఁ గలిగిన యిడుములను గుఱించి నేనే దేనినడుగఁ బోయెదనని తానే ముందుగఁ జెప్పుచున్నాఁడు. కనుక నిఁక మనము దానిని గుఱించి ప్రస్తావించఁగూడ”దని యెంచి హయగ్రీవులు పసితనముఁ దెలివిలేకున్న నెప్పుడు నట్లే యుండురా? కూతురు పుట్టినది, కాననిఁక మంచిగుణము గలుగు”ననెను.

శేషయ్య— పెద్దలు మీరుచెప్పుచున్నారు. కాఁబట్టి మీవాక్కు ఫలించవలెను.

హయగ్రీవులు—మరేమియుఁ గొఱఁత యుండదు. ఇఁకమీఁదఁ దండ్రికి కీర్తిఁ గలుగఁజేయును లెండు.

రామచంద్రయ్య—మామా! అదియుండనిండు చాలపొద్దైనది మీరుభోజనముఁ జేసిరండు. తరువాత మాటలాడవచ్చును

హయగ్రీవులు—నాయనా! యెనిమిదిగంటల కింటియొద్ద భోజనముఁజేసి బయలుదేఱినాఁడను. ఇప్పుడు నా కాఁకలిగా లేదు

మాటలు వినఁబడినని శ్రీభావతి తొంగిజూచి,ముసలాయనకూడ వచ్చెనని యెఱిఁగి,“తాతా! కాళ్ళు గడుగుకొని కొంచెము దాహముఁ దీసికొం”డనిచెప్పి, కాళ్ళకు నీళ్ళిచ్చి కొంచెము మజ్జిగ యిచ్చెను. ముసలాయన కాళ్ళుచేతులు గడుగుకొని లోపలికి వెళ్ళి మజ్జిగఁ ద్రాగి మఱలవచ్చి కూర్చుండెను.

శేషయ్య—(హయగ్రీవులంజూచి) అయ్యా! మీరుపెద్దవారు. కానబాగుగ గుర్తింపఁగలరు,మీ మునిమనమరా లెవరిని బోలియున్నది.

హయగ్రీవులు—ఎవరిపోలికనున్నదియు మీకుఁ దెలియవలెనుగాని, కన్నులు లేని ముసలివానికి నాకెట్లు తెలియును?

శేషయ్య—ముఖము తల్లినిబోలియున్నది గాని ఛాయ యిప్పటికిఁ దల్లిని మించియున్నది పెరిగిన నెట్లుండునో!

రామచంద్రయ్య—(దృష్టిదాకునని యనుకొని) లోకమున నెందఱో తల్లిని బోలియున్నారు. పెరుగుకొలంది సాధారణముగఁ జాయతగ్గిపోవును.

శేషయ్య—ఎక్కువ నుండనిండు పూర్ణాయువుగనున్న నంతి యేచాలు. పే రేమిపెట్టినారు?

రామచంద్రయ్య—పదునొకండవ దినమున శోభావతి నదుగగాఁ "పెద్దవారు మామగారు వచ్చిన తరువాత వారియిష్టమును గనుగొనవలె"నని చెప్పుటచే మేమూరకుంటిమి.

వయసునఁ జిన్నయయ్యును సర్వవిషయములఁ దన్ను గౌరవించుచు వచ్చెడి కోడలి సుగుణములను మెచ్చుకొనుచు, లోపలనున్న కోడలిం బిలచి, "అమ్మా! మన బిడ్డ నేపేరునఁ బిలువవలెనని నీ కిష్ట"మని యడుగఁగఁ, "పెద్దవారి కేదియిష్టమో నా కదియే యిష్ట"మని చెప్పి శోభావతి లోపలికి వెళ్లెను.

హయగ్రీవులు—శేషయ్యగారూ! పూర్వము నేను వచ్చియుండినపుడొకనాఁడు మాకల్యాణి మనుమరాలి నొడియందుంచుకొని హేమవల్లీ! హేమవల్లీ యని ముద్దులాడుచుండఁ "నేమమ్మా! మనుమరాలి పేరు దేనా?" యని నేనడుగగా "నాన్నా! యేమో నేను ముద్దులకుఁ బిలుచుకొన్నాను గాని సొమ్ముగలవారుండ మనయిష్ట మేమున్న"దని కల్యాణి బదులు చెప్పెనని యనెను.

శేషయ్య—నాకును మనసున కదియే బాగుగఁ దోఁచినది.

రామచంద్రయ్య—వియ్యంకుని జూచి బిడ్డ నింకను గుడికి దీసికొని వెళ్లలేదు. తొమ్మిదవ మాసము. మీరును వచ్చియున్నారు. కాఁబట్టి మీరుండగనే వెళ్లఁ దలఁచినాను,

హయగ్రీవులు—(వేళ్లెంచుకొని, మీఁదివంకఁ జూచి గుణిం

చుకొనుచు) శేషయ్యపంతులుగారూ! రేపు శుక్రవారము. ఉత్తరా నక్షత్రము. దశమీతిథి. బాగుగా నున్నది. రేపే వెళ్ళవచ్చును.

రామచంద్రయ్య—(వియ్యంకుని వంకజూచి) అట్లే చేయుదము.

మఱునాఁడుదయమున సామగ్రులెల్ల సేవకుని చేత గుడికిఁ బంపి, యందఱు స్నానములు చేసి పట్టుబట్టలు గట్టుకొని టెంకాయలు పండ్లు, పూవులు సాంబ్రాణి, కర్పూరము, మొదలగు పూజాద్రవ్యములు పళ్లెములలో నుంచుకొని, బిడ్డను దీసికొని, చక్రపాణిస్వామి గుడికి వెళ్ళి, దేవున కభిషేకముఁ జేయించి, హేమవల్లియను బిడ్డపేర నర్చనఁ జేయించి, పొంగలి మొదలగునవి నైవేద్యము సమర్పించి, కర్పూరహారతులతో స్వామిని దర్శించి, మధ్యాహ్నమున నింటికి వచ్చిరి.

మూఁడవ దినము శేషయ్య వియ్యంకుని జూచి యూరికి వెళ్లెదనని చెప్పెను. రామచంద్రయ్య "ఇంతలో నేమియవసరము! మీ బిడ్డకొఱకైన నింక రెండు దినములుండఁ గూడదా!" యనెను. శేషయ్య "బిడ్డకొఱకేగదా పనులన్నియు విడిచి మూఁడునాళ్లుంటి" నని నవ్వుచు గోడలిం బిలిచి, "అమ్మా! నేనూరికి వెళ్లుదునా?" యనియడుగ శోభావతి ముఖము చిన్నఁ బుచ్చుకొని "మామయ్యగారూ నేనువచ్చెదా" ననెను.

తనయింట నేమిసుఖము లేకున్నను దాఁబడిన కష్టముల నావంతేని మనసునఁ దలఁపక, కోడలు తనవెంట రాఁగోరుచుండ "నిట్టి సచ్చరిత్రయగు నభిమానవతి లోకమున నుండఁ బో"దని యెంచి, శేషయ్య, పరితాపముతో దీనవదనయై వేఁడుకొన్న కోడలిని విడిచిపోవ మనసురాక నలువంకలఁ జూచి యెవ్వరు దగ్గఱ లేకుండు టెఱిఁగి, తిన్నగా "అమ్మా! శోభావతి! నీయత్తమంకుగుణము నీవెఱుఁగుదువు

గదా? ఇక్కడికని చెప్పిన దగవాడునని నగరిపనికని బొంకివచ్చితి.నిను విడిచిపోవ నాకాళ్లాడకున్నవి. వెంటఁబిలుచుకొని వెళ్ళిన, నాఁగయ్యాళి యిఁక నీమీఁద పగసాధించుచుండును. నేనూరికివెళ్ళి యెవరినైనఁ బంపెద'' నని చెప్పి, మనుమరాలిని ముద్దిడుకొని వియ్యఁపురాలింబిలిచి, ''కల్యాణమ్మా'నేను తొందఱగా వెళ్లవలసి యున్నది. కనుక నేనూరికిఁ బోయి యెవరినైనఁ బంపెదను శోభావతిని బిడ్డను బయనముచేసి పంపు''మని చెప్పి,వియ్యంకులకును హాయిగ్రివులకును జెప్పి నమస్కారము చేసి ప్రయాణ మయ్యెను.



# శోభావతి.

## [illegible]యవ ప్రకరణము.

———o———

ఒకనాఁటియుదయమున నెనిమిది గంటల సమయమున శోభావతి బిడ్డను ప్రక్కలో నుంచుకొని పరుండి తనలో నిట్లని చింతింపుచుండెను. "స్వామిగారు వెళ్ళి మాసమున కెక్కువైనది. నాముఖప్రీతికై యెవరినైనఁ బంపెదనని చెప్పిరిగాని, మఱచియుందురు. ఒకరినన నేల? పాపము! వారైన నింతమాత్రము ప్రేమచేతనో లోకులకు వెఱచియో వచ్చిచూచి పోయిరి. పెనిమిటికే యక్కఱలేకున్న నెవరేమిచేయఁగలరు? హా దైవమా! నేనెంత పాపపు జన్మమెత్తితిని! పెనిమిటి కక్కఱలేని సతి జీవించు టెందులకు? పిల్లగలిగిన తరువాతనైన సుఖము గలుగునను నాకోరిక నిరర్థకమయ్యె. నన్నుగనినందుకు నా తలిదండ్రులకును సౌఖ్యములేదు. నాచింతతోడ నే కృశింపవలసి వచ్చెఁగదా! మాయవ్వ నీదుఃఖమే తుదముట్టించెను. దైవమా! నన్నింతటి పాలిటి దయ్యముగఁ బుట్టించితివా?" యనివగచుచు తల్లిరాకఁ జూచి తనవ్యసనము దెలిపినఁ దల్లికి మనోవ్యథ గలుగునని పైకిఁ గనపడనీక కనులు దుడుచుకొనెను.

కల్యాణి మంచమునుండి లేవక యింకను బండుకొనియున్న కూతురింజూచి, "తల్లీ! యింకను లేవవేమి? ఎన్నఁడిట్లు పండుకొనుదానవుగావు. శరీరమున నేమైన జబ్బుగనున్నదా?" యనియడుగ శోభావతి "జబ్బేమియులేదు. పిల్ల పైటచెఱఁగుమీఁద పండుకొన్న" దని చెప్పెను. కల్యాణి చిన్నపరుపును బఱచి బిడ్డనుదీసి పరుండబెట్టఁగ శోభావతి లేచి లోపలికి వెళ్లెను.

క

తర్వాతఁ గొంతసేపటి కిరువది సంవత్సరముల వయసుగల చిన్నవాఁడొకఁడు నడుమునఁ జరీపంచెను గట్టి హాఫారమును దొడిగి, యుత్తరీయమును సగము తలకుఁ జుట్టి సగము వీపున వ్రేలుచుండఁ గుడిచేతఁ గొడుగును బట్టుకొని, యచట కెప్పుడో చిన్నతనమున నేగాని పిదప రానందున గుఱుతు కనుఁగొనలేక గుమ్మమున నిలిచి తొంగితొంగి చూచుచుండెను

“నేఁ దలిదండ్రుల పంచన నుండినను నానగరివారిలో నగుబాటు కాని పీడియున్నము నాకొకతెకుఁ బట్టుకున్నది పెనిమిటి కుపచారము చేయుటకుఁ గాని, తలిదండ్రుల సంతోషింపఁ జేయుటకుఁ గాని నోచక నా యావజ్జన్మమిట్లు కడచునట్లు నానొసట వ్రాసితివి కాఁబోలు దైవమా” యని శోభావతి పలువిధములఁ జింతించుకొనుచు, ముఖము కడుగుకొని కుంకుమమును బెట్టుకొని యావల వచ్చుచు, గుమ్మముఁ దాఁటి రాఁజూచుచున్న యాక్రొత్తవానిని గని పరమానంద భరితయై “అబ్బాయీ! లోపలికి రమ్ము” అని పిలిచెను.

అతఁడెవఁడని చదువరులాతురతఁ బొందుచుందురుఁ గాఁబోలు విన్ననై యుండు. శోభావతి వికసితపంకజవదనయైనప్పుడే కనుఁగొన వచ్చునుగదా! అధికానందముచే శోభావతి కొంతసేపు నిశ్చేష్టితయై యుండి తరువాత “అబ్బాయీ! రైలువెళ్ళి చాలసేపైనట్లున్నదే” అనెను, క్రొత్తవాఁడు వదినెగారూ! నాకిల్లు తెలియక చాలదూరము తిరిగి వచ్చుటచే నింతయాలస్యమైనది.” అని బదులుచెప్పెను

ఆమాటవినినతోడనే శోభావతి లోపలికిఁబోయి. మఱఁదిరాకఁ దలిదండ్రులకుఁ జెప్పి నీళ్లు దెచ్చి సుబ్బరాయునికి కాళ్లు కడుగుకొన నిచ్చి “కూర్చుండు” మని చెప్పి, “హేమవల్లీ! మీ పినబాబుగారు వచ్చిరి, చూడుము” మని యతనియొక్క బిడియము విడిచెను.

అన్నయెంత చెనటియైనను, సుశీలయగు వదినెగారియందుఁ దల్లియందువలె భక్తివిశ్వాసములు గలిగియుండు సుబ్బరాయునకు నాయమబిడ్డపైఁ బ్రీతియున్నదని వేఱుగఁ జెప్పవలయునా? పినతండ్రి చేయిఁజాపఁగనే ముందెన్నఁడుఁ జూడకుండినను హేమపల్లి దోఁగాడుచుఁబోయి యతనియొడిలోఁ గూర్చుండెను. రామచంద్రయ్యయుఁ గల్యాణియు సుగ్వాదతోఁ గుశలప్రశ్నఁ జేసిరి.

రామచంద్రయ్య—(పిల్లతాతగారి యొద్దనున్నట్టే క్రొత్తవాఁడనియెంచక పినతండ్రియొడియందును నమ్మికతోఁ గూర్చుండుటఁజూచి) యేమోయీ! సుబ్బరాయుఁడూ! మీపిల్లకేమైన మచ్చుపొడిఁ జల్లెదరా యేమి? కాకున్న నెవరిఁ జూచినను కీచుపిట్టవలెనరచు పిల్ల మీతండ్రిగారి యొద్దను, సలవాల్లైన పిల్లవలె నిక్కిగూర్చుండినది.

కల్యాణి—(సుబ్బరాయనితో) అబ్బాయీ! యెన్నటికైనను మీపిల్ల మీయొద్దనే చేరును. మేమెంతచేసినను యెఱువువాండ్ర మేగదా? ఇట్లు మాటాడుచు నందఱు నవ్వుకొనుచుండిరి.

తుదకు హేమపల్లి పినతండ్రిని స్నానమునకైన లేవనిచ్చినది కాదు. భోజనములైనతరువాత సుబ్బరాయుఁడు రామచంద్రయ్యను జూచి, మామా! రేపు పంచాంగశుద్ధి బాగున్నదని మాతండ్రిగారు వదినెను బిడ్డను బిలుచుకొని రమ్మనిరి.

రామచంద్రయ్య—ఏమోయి! ఒకపూటకెక్కువ నిలువఁగూడదనుచున్నారు. మీతండ్రిగారును నట్లేవెళ్ళిరి. మా బీదయింట రెండుపూటలుండి మమ్ము సంతోషపఱుపఁగూడదా?

సుబ్బరాయుఁడు—(నవ్వుచు) మామా! మీరెన్నఁడట్లనుకొ

నవలదు. మేముఘనకులమును మీరుబీదవారా! అట్లేయుండనిందుగాని, రేపు మంచిదినము కనుక రేపేవెళ్ళినమంచిది. మరల రావలయునన్న నేదోయొక యసందర్భమువలన కోపపడదు.

రామచంద్రయ్య—(భార్యను బిలిచి) విన్నావా! అల్లుఁడుచెప్పినది వదినెగారిని బిడ్డను గూడతీసికొని వెళ్ళఁగోరెనఁట.

కల్యాణి—అన్నిఁటి సౌఖ్యములకంటెను అత్తవారింటికే పిల్లల నంపుట తల్లిదండ్రులకిష్టముండదు ఇఁకసుఖములేని మనయింటికి సన్నుతి యుండునా?

కల్యాణి—(ముఖముచిన్నఁబుచ్చుకొని) అత్తగారా! అన్నా నని కోపపడవలదు. తొలుసారివచ్చి, యన్నియప్పుడు పడి వచ్చినదే. ఇఁకనిప్పుడెన్ని తిప్పలుపడునో! ఈమాటకు సుబ్బరాయఁడు ముఖము చిన్నఁబుచ్చుకొని మిన్నకకూర్చుండెను. తల్లియుఁ జెప్పుచుండిన మాటలు విని, మఱిందికేమి వ్యాకులముకలుగునో యని, శోభనవతి పరుగున వచ్చి, అమ్మా! యిట్టియసందర్భమైన మాటలు నన్నుఁ జెప్పవలదు పాప మాయన పసివాఁడు మీదుమిక్కిలి తల్లిదండ్రులకన్న నాపై నెక్కువ ప్రీతిఁగలవాఁడు'' అనెను.

''ఒకరుకోపముజూపినను నొకరెయొకరు శాంతమును గనఁబఱపవలె''నన్నట్లు రామచంద్రయ్య ''సుబ్బరాయఁడా! మీయత్త మాటలు మనసున నుంచుకొనవలదు. స్త్రీలకెప్పుడు మనసుమెత్తని దేగదా! కానఁ నంపుట వారికిఁగష్టమే''అనెను.

మీరు మంచివారయినందువలన, మావదినె యుత్తమ స్త్రీ కాఁబట్టియు నలుగురిలోఁ దలయెత్తుకొని తిరుగుచున్నాముగాని, నా యన్న చేసిన దుష్కృత్యముల కింకొకరైనఁ బలువురకుఁదెలిపి ఛీకొట్టించుచేగాక కంఠమునకుఁ ఉరిపేసికొన కూరకుందురా! కాఁబట్టిమనము

నేరముగలవారమై యుండియు, నీమె యిట్లన్నందుకే కోపపడఁ గూడదనుకొని, సుబ్బరాయుఁడు రామచంద్రయ్యనుజూచి "మామా పెద్దవారన్నందులకుఁ గోపమేటికి? ఐనను కుమార్తెల నెన్నైన నుంచుకొనుటకు వీలగునా? మీచిన్నకొమార్తె నంపుచున్నవారును నిక్కోపపడుచున్నారు

రామచంద్రయ్య—ఎన్నాళ్లైనను తీగకుఁ గాయబరువగునా?

సుబ్బరాయుఁడు—మాకదినేమాట యటుంచి నిచ్చి బిడ్డనుబంపుట యత్తరు మఱియుఁ గష్టముగనుండును

ఇట్లీరువురు మాటలాడుకొనుచుండఁ బుఱఁదికిఁ గష్టముతోఁ జనేదని యెఱిఁగి శోభావతి లోపలికిఁబోయి తల్లినిజూచి, "అమ్మా! యిది యేమి? వెఱ్ఱిదానివలె గోడకుచేరగిలఁ బడితివి. ఇపుడు వెళ్ళిన రెండు మాసములలో మరల వచ్చెదనులే" యనెను.

కల్యాణి, కన్నీరు దుడుచుకొనుచు గద్గదకంఠముతో "తల్లీ! నీవు వెళ్లవలసినదే, కాని యటనేమి సుఖింపఁబోయెదవు" అని ఆపలేని దుఃఖముతోఁ దరువాతఁ జెప్పలేక ముఖమునకుఁ జెఱుగడ్డముఁ బెట్టుకొని వ్యసనపడుచుండెను. తనకై వగచుచుండు తల్లినిజూచి తనకువచ్చెడి దుఃఖమునాపుచుకొని తల్లిచెంత గూర్చుండి "అమ్మా! కాలమెప్పుడో కరఁగక నుండునా? కష్టమనుభవించువారిని భగవంతుడు కనులు దెరచి చూడకుండునా? ఇటుచూడుము నీవేడ్చుచుండుట చూచి పిల్లదిగులుపడిపోయినది." అని బిడ్డను జేతికిచ్చెను.

కల్యాణి—(కన్నీరుదుడుచుకొని బిడ్డను ముద్దుకొని) తల్లీ! మగనియొద్ద సుఖములేక పోవుటయే గాక మునుపేసిను వేపుకొని తినుచున్న యత్తగారికి బిడ్డనుగూడఁ బొయిలోఁబెట్టి పెడలోఁదీయుచుండదా?

శోభావతి—అమ్మా! నేనిటనున్న నాచింతయే మీకుఁ జాలక లోకులచేఁ జిన్నమాటలు విననలసియుండును. మీరు చల్లగానున్నంత వఱకు నా కేమిటఁ గొఱంతలేదు. చెడుదినము లెవరిని వదలినవి! మా యత్తగారి మాటయేమి! తక్కినవారందఱును మునుపటివలెఁ గాక యిప్పుడు కంటికి రెప్పవలెఁ జూచుకొందురు. అందులకై నీవు బెంగఁ బెట్టుకొనకుము.''

అని శోభావతి ధైర్యముచు జెప్పి తన యవ్వను దలఁచుకొని, ''అమ్మా! నీవిట్లున్న నీకుఁ బెద్ద లెవరున్నారు! అవ్వ యుండగ నన్నియుఁ జూచుకొనుచుండెను. ఇంకఁ గొన్నాళ్లామె మనిపవలె మనియుండు నదృష్టము గలవారము కామైతిమి'' అని చింతించెను.

రామచంద్రయ్య భార్యను బిలిచి, ''శోభావతికిని బిడ్డకును గావలసినవి జాగ్రత్తపఱచి యుంచు''మని చెప్పఁ గల్యాణి వీరభద్రుని నంగడి వీధికంపి, పండ్లుదినుసులు మొదలైనవి తెప్పించి బిడ్డ కాడుకొనుటకు రంగువేసిన కొయ్యబొమ్మలు పిడుతెలు, గిలకలు దెప్పించియుంచెను.

తానువెళ్ళినఁ దల్లికెవరును సాహాయ్యము లేరనుచింతతో నున్నంత వఱకైనఁ గొంతయూఱటఁ గలిగింపఁదలఁచి శోభావతి వంటప్రయత్నముఁ జేయుచుండెను. తామెంతకష్టపడినను బిడ్డలచే బనిఁ జేయించుట తల్లులకిష్టముండదుగదా!

కల్యాణి, ''తల్లీ! శోభావతీ! నీయింటికి వెళ్ళిన వలసినంత పని యుండనేయున్నది. ఇచటనుండు కొన్నిదినములైన నూరకుండరాదా!'' యని యామె నీవలకంపి, తానే వంటవార్పులు చేయుచుండెను.

వంటలైన రాత్రి యందఱు భోజనముఁ జేసి పరుండిరి. అయినను సుబ్బరాయుఁడు దప్ప నింటివారెవ్వరును గన్నుమూసినవారు గారు. ఎంతటి క్రూరుఁడైయున్నను బెనిమిటిసన్నిధి కరుగుచున్నానన్న సం

తోమము శోభావతికి మెండుగనుండెఁగాని, "యవ్వగూడ లేనందునఁ దానువెళ్ళినఁ దల్లి యొంటిగ నుండవలయుఁగదా" యన్న చింతచే నామె తల్లిని విడువలేక యోజించు కొనుచుండెను.

అల్లుఁడు దుర్మార్గుఁడగుటచే దమబిడ్డనేమిచేయునోయనియు, నిపు డంపక యున్నఁ గోపమునఁ దిరుగవారు పిలిపింపకున్న లోక నింద యొకటేగాక బిడ్డ మునుపటివలె నిద్రాహారములు మాని కృశిం చుననియుఁ, దరువాత నంపినఁ గొంచెము ప్రీతిగలిగియున్న మామ గారికిఁగూడ నాయాసముగలుగుననియు, నట్లుపంపుటచేఁ దపుపగువె తగ్గుననియు, నిట్లు పలువిధముల యోజించుకొనుచు భార్యా భర్త లిరువురు నిమిషమేని నిద్రపట్టక రాత్రి యంతయుఁ జింతదో ముగించిరి.

వేకువనలేచి కల్యాణి శీఘ్రముగవంటఁజేసెను సుబ్బరాయుఁ డును వదినెగారును వేగిరము స్నానభోజనములఁ దీర్చుకొనిరి రామ చంద్రయ్య జరీపంచెయు రుమాలును దాంబూలముతోడఁ బళ్ళెమున నుంచి సుబ్బరాయనికిచ్చెను. సుబ్బరాయుఁడు నవ్వుచు, "మామా! యీవేల! మాయన్నయ్యగారి కియ్యవచ్చును లెండు." అని యవిదీసికొ వక యూరకుండెను

రామచంద్రయ్య, "నాయనా! అవి మీయన్నయ్య గారికే," యని చెప్పి కొమార్తెకని పట్టుచీరలును రవికెలును మనుమరాలికని పావడలు చొకములు తిసి భార్యచేతికిచ్చెను, వానిని గల్యాణి లోపలి కిఁ దీసికొనివెళ్ళి యొక జతకుఁ బసుపు రాచి పళ్ళెమునఁబెట్టి తక్కిన వన్నియుఁ శోభావతి పెట్టెలోఁబెట్టి, పండ్లు, పసుపు, కుంకుమము పళ్ళెములో నుంచి కూతురికందిచ్చెను. శోభావతి యవి దీసికొని పళ్ళెమునఁ బసపు, కుంకుమము, నుంచి, తల్లిచేతికిచ్చి, క్రొత్త

చీరఁ గట్టుకొని. తండ్రియొద్దకు వచ్చి, నాన్నా! వెళ్ళి వచ్చెదనని నమస్కరించెను.

“అమ్మా! దీర్ఘసుమంగలీభవ, శీఘ్రముగఁ గొడుకుల తల్లివి గమ్మ”ని దీవించి రామచంద్రయ్య మనమరాలిని యెత్తి ముద్దులాడుచు, “హేమవల్లీ! నీముచ్చటలఁజూచియైన నీతండ్రికి మంచిమనసు గలుగవలె”నని చెప్పుచుండఁ, గల్యాణిబిడ్డను దీసికొని “హేమవల్లీ! మీ యింటికి; మరల వచ్చునప్పటికి మమ్ముల మఱచెదవేమో! నీకు శీఘ్రముగఁ దమ్ముఁడు పుట్టిన నిన్నిచటనే యుంచుకొనెద”నని ముద్దాడుచుండెను.

సుబ్బరాయుఁడన్నట్లు కల్యాణికిని రామచంద్రయ్యకును గూతురిమాట యటులుండనిచ్చి మనుమరాలి నంపుట చాలఁగష్టముగ నుండెను

వీరభద్రుఁడు పెట్టెలను మూటలను దెచ్చి బండిలోఁబెట్టెను. సుబ్బరాయుఁడు వదినా! తెలుకు వేళగుచున్నదని వేగిరపఱచి రామచంద్రయ్యకును గల్యాణికిని బయనముచెప్పి బండిలోఁగూర్చుండెను. శోభావతిబిడ్డను చంకఁబెట్టుకొని తలిదండ్రులకుఁ దనపయనముచెప్పి బండియెక్కెను.

రామచంద్రయ్యకును గల్యాణికిని కనులనిండనీరు మెదలుటఁ జూచి సుబ్బరాయుఁడు తనయన్న దుర్గుణమునకై వీర ధైర్యపడుచున్నారని తెలిసికొని, మామా! “మునుపటివలె నికమీఁద జరగునేమోయని మీరు చింతఁబెట్టుకొనవద్దు. నేనపుడు పసివాఁడను. ఇపుడట్టి తెలివిమాలిన యాటలు సాగనియ్య”నని ధైర్యము చెప్పి బండి వెళ్ళనిచ్చెను.

మామగారికున్న ప్రీతియు మఱఁదికున్నభక్తి, విశ్వాసమును

జూచి, శోభావతి కిక నట్టి కష్టములేవియుఁ గలుగనీయక చూచుకొనందురని తలిదండ్రులు ధైర్యముగనుండిరి.

మధ్యాహ్నము మూఁడున్నర గంటలగునప్పటికి శోభావతియు సుబ్బరాయుఁడును బిడ్డనుదీసికొని రైలుదిగి యింటికివచ్చిన తోడనే గయ్యాళి గంపయును, నన్నభార్యను పెనములోఁబెట్టి వేఁచుచుండినదియునయ్యు, మాణిక్యాంబ, శోభావతి చంకను ముద్దులొలుకుచున్న బిడ్డను జూచి పరుగునవచ్చి లాగి యొడిలోఁ బెట్టుకొని చెక్కులు దువ్వి ముద్దులాడసాగెను.

ఆ సందడి విని లోపలనున్న సుభద్రమ్మ పరుగునవచ్చి, మేనత్తయొద్దనున్న బిడ్డనుదీసికొని ముద్దులాడుచుఁ దనకన్నుల కఱవుదీఱ కోడలి ముద్దుమోమును పలుమారుచూచుచు, "శోభావతీ! మీపుట్టింట నందఱు సౌఖ్యమేగదా? బిడ్డను బంపుట మీతల్లికిఁ జాల కష్టముగనుండు"ననెను.

శోభావతి "అత్తయ్యా! నామాట వారికంతలేదుగాని, మనమరాలినంపుట చాల కష్టముగనుండె"నని చెప్పుచు నత్తగారగుపడలేదు. ఆమెతో మాటలాడకున్న నామెకువిసుగెక్కువగునని తలఁచి యాఁడుబిడ్డనుజూచి "మాణిక్యాంబా! అత్తగారేరీ? అగుపడరే"దని యడిగెను.

"మాయమ్మమిద్దెమీఁదనున్న"దని మాణిక్యముచెప్ప, శోభావతి మిద్దెమీఁది కరిగి యత్తగారికి నమస్కారముఁజేసి వినయవిధేయురాలై యెంతో పలుకరించెను. అయినను కోడలెన్నిసారులు పిలిచినను జెక్కుటఁ జేయిఁ జేర్చికొని క్రిందుఁ జూచుచు బలుకక యుండఁగా శోభావతి యీవలకు వచ్చెను. తెలివిమాలినవారేమియు నెఱుఁగని పసికూనలయందును దమయసూయను జూపుచుందురుకదా? జానకమ్మ

తుదకు ముద్దులు మూటఁగట్టుచుండిన మనుమరాలినైనఁ జేరఁదీసి నదికాదు.

సుభద్రమ్మ కొడుకు చెవి నిల్లుగట్టుకొని హితముఁ జెప్పుచుఁ గొన్ని సమయములయందుఁ దండ్రిమాట చెప్పి బెదరించుచుండుటవలనఁ బట్టాభిరాముఁడు భార్యనగలఁ దీసికొనుట మానెనుగాని, తనయుంపుడు కత్తెలకేదేని యిబ్బందిగనున్ననాఁడు చీఁకటిలో దొంగవానివలె భార్యసుతాక వెళ్ళుచుండుటేగాని, రతీదేవివంటి యామె దివ్యసుందరవిగ్రహమును కనులారఁగాంచి యానందించుటకును నాసతీమణిచేత నుపచారములఁ జేయించుకొనుటకును భాగ్యమతనికింకను రాలేదు.

తండ్రి తనకు డబ్బిచ్చుట లేదు. కావున వేశ్యల దర్శనము లభించుట కష్టముగ నుండుటచేఁ దాను చదువుకొన్న పాఠశాలయందితఁడిరువది రూపాయల జీతమున నుపాధ్యాయుఁడుగఁ గుదురుకొనెను. కాని, తండ్రి చీవాట్లు పెట్టునని భయపడి యిరువది యైదురూపాయలు తండ్రి చేతికిచ్చి వేయుచుండుటచేఁ దక్కినవి తనకుఁ జాలక శోభావతికిఁ దండ్రి మాసమునకుఁ బదిరూపాయలు పంపుచుండ, నామె పెట్టెలోనుండి వానినిగూడఁ దీసికొని వ్యయము చేసికొనుచుండెను. ఎముకలు విఱుగఁ దన్ని పైసొమ్మునుఁ బెఱుకుకొనుటయేగాక ప్రాణాపాయమొనర్చి నట్టివిపాలుఁ జేసినప్పుడైన వెలిఁబుచ్చని మహాసాధ్వి యీయల్పమును బయలుపఱచునా?.

హేమనపల్లికి రెండుసంవత్సరములగు నప్పటికి శోభావతికి మాసము దప్పినదెలిసెఁగి. మూఁడు సంవత్సరములనుండి కాపురముచేయుచున్న తనకూతురి కింకను బిడ్డయుఁ బీటచెక్కయు లేదనియుఁ గోడలు పిల్లల వడయదనియు, జానకమ్మ వచ్చువారితోను బోవువారితోను జెప్పుకొనుచు గోడలిని దిట్టిపోయుచుండెను.

లోకములోవలెఁ బెనిమిటి తనతోఁబల్లగా, గాపురముఁజేయకున్నను, ముద్దులొలుకుచుండు బిడ్డను గ్రిగంటనైనఁ జూడకుండుటవలనను, దానుగర్భము ధరించినందుకు సంతోషము లేక, శోభావతి పలుమారు విసుగుకొనుటఁజూచి, సుభద్రమ్మ "యేమే శోభావతీ! పదిమందిని గని యలసిపోయినట్లు విసిగికొనుచున్నా"వని కోడలి నదలించెను,

శోభావతి నిట్టూర్పు విడుచుచు, "అత్తయ్యా! యున్నిట సంతోషముగనున్న వారి కెందఱు కలిగినను సంతోషమేగాని నావంటి మందభాగ్యురాలికి భగవంతుఁడేల యొడిగట్టను నుసు" అని తల వంచుకొని చింతించుచుండెను కోడలింజూచి, సుభద్రమ్మ "శోభావతీ! యట్లనగ చుటకు నీకే కాదు, మాకందఱికవి చాలనిదినములుఁ కనుక నల్లెల్ల జరగినది. మీరుముచ్చటగ నున్ననే కదా, యందఱకు సంతోషము ముకుపటికం బెఁ బెద్దవాఁడిపుడు చాలనుంచిదారిని బడినాఁడు కాని దేవునిదయ చక్కగాలేనందున నింకను వయసు నకుఁ దగిన తెలివిరాలేదే! ఏమిచేయఁగలము? ముసలామె మాటలు మనసునంనుంచకుము ఇఁక నామెప్వభావము మాఱఁబోదు. ఎవరి భాగ్యమువారి దే లేనివారికిరమ్మన్న వచ్చునా! ఉన్నవారికి సలద న్పఁబోవునా' వెఱ్ఱిపిల్లా." యనియోదార్చుచుండఁ జిన్నత్తగారి మాటలకు "అత్తయ్యా! మీదయవల్లనే కదా యింతమాత్రి"మని శోభావతి చిఱునవ్వు నవ్వుకొనుచుండెను.

తొలిచూలువలెఁ గాక శోభావతికి నెల లెక్కకొలఁది శరీరమునఁ గొంతనీరుపట్టి నందున, శేషయ్య, చిన్నత్త దిగులుపడుచుండిరి కాని నవమాసములు పూర్తియైె యొకదినము రాత్రి శోభావతి సుఖముగఁ గుమారునిఁ గనెను.

గ్గ్రామమునకు వచ్చితిమి, యింటియొద్ద నెవరునులేరు. కాన శీఘ్రము గా వెళ్లవలసినదే కదా?

ఇంతకాలమున కరుదుగ మనుమఁడు గలిగినందున శేషయ్య వేడుకఁగా జరుపు నభిలాషతో బంధువులనేగాక యూరిలోఁద నస్నేహితులను నెఱుకఁగలవారి నందఱను బిలిచి శ్రావ్యముగ వాయింపఁగల ఘనమైన మేళగాండ్ర నుంచెనుగాని, వదుగురువచ్చిన పుడు కొడుకు పీటపైగూర్చుండక మౌర్ఖ్యముఁజూపిన నగుబాట్లగునని భయపడుచుండెను.

ఇచ్చినవాఁడు మచ్చికలాడి యియ్యనివాఁడు కొవ్వువాఁడు నే శ్యాస్త్నన్నాపమే నైకుంఠపదవిగ సంతసించు వివేకదూరుఁడగు పట్టాభిరామునకు సతీతిలకము చెంతఁగూర్చుండుట కిష్టములేకున్నను తండ్రికి వెఱచియుఁ, బలువురు పరిహసింతురని వెఱచియు విధిలేక పీటపైఁ గూర్చుండెను. తలిదండ్రులకును మామగారికిఁ జిన్నత్తగారికిని వారు వీరననేల, కన్నులుగల వారికెల్లను నయనానందమగునట్లు శోభావతి బిడ్డనొడిఁయుందుంచుకొని పెనిమిటిచెంతఁ గూర్చుండెను.

సాధ్వీమణియగు భార్యయంత గుట్టుగదాఁచినను బట్టాభిరాముని చర్యలు జగమెఱిఁగినవే గావునఁ గుమారుఁడు పుట్టిన తర్వాతనైన నీతఁడీపాటి బుద్ధిమంతుఁ డయ్యెఁగదా యని బంధువులు మొదలు వచ్చినవారందఱ నినుకొనుచుండిరి. "కన్నచురులునకన్న సాకినవారలు పుట్టునకు"నన్నట్లు కొడుకు కోడలి ముచ్చటఁజూచు సంభ్రమమునఁ గాలినొప్పియైన నెఱుఁగక సుభద్రమ్మ ప్రాయ్యిమీద నొకటి ౦బెచు ముంగిటవచ్చి తొంగిచూచుచు నిల్లువిరాముము లేక దిరుగుచుండెను.

తెలివిలేనివారికి కెన్నఁడును గౌరవవృష్టి యుండదుగవా! తేన

చూపోవమికి బంధుగులు నిందింతురు. లోకులు పరిహసింతురని ద్వైనను లేక కొడుకు చెంగటఁ గూర్చున్న కోడలి వేడుకఁ జూడనొల్లక, జానకమ్మ, మిద్దెపైనొక మూల ముసుఁగుఁబెట్టుకొని పవళించెను, వచ్చినవారి నాదరింపకున్నమానెఁ గాని పలుగురు నవ్విపోవునటుల గయ్యాళితనము చేయకుండుటే చాలునని, పెనిమిటిగాని, సుభద్రమ్మ గాని యామెను లేపనే లేదు. కల్యాణి యెంతో బ్రతిమాలెను, గాని యాదినమంతయు జానకమ్మ లేచిన దే కాదు.

శేషయ్యయు సుబ్బరాయఁడును వచ్చినవారిని గౌరవించి కూర్చుండఁబెట్టుచుండిరి, మీనాక్షియుఁ గల్యాణియు, ముత్తైదువలను గూర్చుండఁబెట్టి పసపుఁబూసి కుంకుమముఁ బెట్టుచుండిరి. పురోహిత బ్రాహ్మణుఁడు పళ్ళెమున బియ్యమును, బెల్లమును, పండు తాంబూల ఫలములను, గర్పూరమును, సాంబ్రాణి మొదలగు పూజాద్రవ్యముల నుంచుకొని, పసుపుముద్దచే వినాయకునిఁ బ్రతిష్ఠింపఁజేసి, విఘ్నేశ్వర పూజయైన తరువాతఁ దనకుఁ జేరవలసిన బియ్యము మొదలగువానిని బంచెలో మూటఁ గట్టిపెట్టి యింటి యజమానుని జూచి "ఏమండీ! శేషయ్యగారూ! దక్షిణ! దక్షిణ! దక్షిణ! మఱచినారేమండి!" యని కేకలు పెట్టెను. శేషయ్య "నేను మఱచిపోలేదుగాని, యన్ని కార్యములు జరిగినతరువాతఁగదా దక్షిణ?" యనెను.

పురోహితుఁడు "మనుమఁడు పుట్టినాఁడు కనుక సంతోషములో సంభావన మఱచిపోవద్దండి బీదబ్రాహ్మణుఁడను" అని హెచ్చరికఁజేసి కొన్నియక్షతలు దీసికొని దంపతులకును శిశువునకు నెత్తిపై జల్లి మామిడాకుల గుత్తని శిశువుతలపైఁ బెట్టి కొంతసేపేవో మంత్రములను జదివి తర్వాత "శేషయ్యగారూ! మనుమని పేరు! పేరు!" అని యఱచెను.

శేషయ్య— అంత కొండఱు నొంగురకంటె మీదక్షిణ పాలు పోవుచున్నదా?

పురోహితుఁడు—అందులకుఁగాదండి, ఇక్కడ పూజలన్నియు ముగిసినందున నడిగితిని కోపపడవద్దు బాబూ.

శేషయ్య— ఁరే, మావియ్యంకుల నడుగవలెను

పురోహితుఁడు—రామచంద్రయ్యగారూ మనుమనికి, పేరేమి పెట్టవలెనని మీవియ్యంకు లడుగుచున్నారు

రామచంద్రయ్య— పెద్దలు వారి కేదిష్టమో నాకదియే యిష్టము!

స్త్రీలనోరూరకుండదుగదా? శేషయ్య తనతండ్రిపేరు పెట్టునని కొందఱును, రామచంద్రయ్య తన తండ్రిపేరు పెట్టునని కొందఱు ను, గుసగుసలాడుచుండిరి,

పురోహితుఁడు తనలో నేదో యొకటి పెట్టుకొని నాదక్షిణనా నాకు జాలవేసిన వెళ్ళిపోదునుగదా? సిరిదనము నాకుత్సుక యొండి పోవునట్లున్నది యనుకొనుచుఁ బ్రకాశముగా "ఏమండి శేషయ్య గారూ! లగ్నము దాటుచున్నది" అనెను.

శేషయ్య నడుమున నొకచేయియుంచుకొని కొంతసేపు యోజించుకొనుచుండి పురోహితునిఁ జూచి, "అయ్యా మధుసూదనుఁడని యుంచవలెనని నాయభిప్రాయము. వియ్యంకుల కేదియిష్టమో!" యని రామచంద్రయ్యనుజూచెను.

రామచంద్రయ్య—(తలనాడించుచు) ఆఁ బాగుగా నున్నది. నాకును నిష్టమే

అంతఁ బురోహితుఁడును వచ్చిన బ్రాహ్మణులను శిశువుపైఁ జిత్తజల్లుగ నక్షతలఁ జల్లుచు మధురముగ సుధుసూధనుఁ డని మువ్వూఱు చెప్పినతర్వాత నాశీర్వాదములను జేసిరి.

రామచంద్రయ్య—అల్లునకు జరీ యంచులుగల ధోవతుల చాపును, జరీపట్టురుమాలును, కొమార్తెకుఁ బట్టుచీరయుఁ బట్టురవికయు, మనుమనికిఁ బట్టుజరీ చొకాయును, చేతులకు బంగారు మురుగులును, గాళ్లకందియలును, జదివించెను శేషయ్య మనుమనికి బంగారు మొలత్రాడును, మువ్వలును జదివించెను. ముత్తాతయగు హయగ్రీవులు చంద్రహారముఁ జదివించెను. తరువాత బంధువు లందఱును జదివింపులు చేసిరి.

శేషయ్య బ్రాహ్మణులకు దక్షిణల నొసంగి స్నేహితులకుఁ బండ్లను, తాంబూలములునిచ్చి, గౌరవించి బందుగులకెల్లను బెరుగు వడలు, బొబ్బట్లు, నప్పడములతో భోజనములఁ బెట్టించెను ఆరాత్రి శిశువును పుష్పములతోఁ గూర్చిన తొట్లలోనుంచి కిన్నర కంఠములతో జోలలఁ బాడిరి. వచ్చినవా రందఱు వెళ్ళిన తరువాత దృష్టి తాకియుండునని కల్యాణి తల్లిబిడ్డల కెఱుపునీళ్లును గర్పూరమును దిగఁదుడుపు చేసెను.

మఱునాఁడు రామచంద్రయ్య కొమార్తెంజూచి, "అమ్మా! యీవేళ మే మూరికి వెళ్లుదుమా!" యని యడుగఁ దండ్రి మాటలకు శోభావతి ముఖము చిన్నఁబుచ్చుకొని "నాన్నా! యింకనాలుగు దినము లుండి వెళ్లఁగూడదా!" యని అనెను.

రామచంద్రయ్య—తల్లీ! నీవు చిన్నదానవుగావు. ఇంటియొద్ద నెవరును లేరుగదా!

శోభావతి—నాయనా! నీవన్నది నిజమేకాని, తలంచినప్పుడు వచ్చుటకు మీకు వీలుండదుగదా! అమ్మ వచ్చిన నీకు భోజనమున కిబ్బందియగును. ఇద్దఱు వచ్చుటకును వలనుగాదు. కాన వచ్చినప్పుడైన నాలుగు దినము లుండకున్న నెట్లు!

కూతురు చిన్నఁబోవుట చేతను పండువంటి కూతురిని ముత్యములవంటి బిడ్డలను విడిచిపోవఁ గల్యాణికిని మనసు రాసందువలన నాలుగు దినము లుండి రామచంద్రయ్యయు గల్యాణియుఁ గుంభకోణమునకు వెళ్ళిరి.

లోకమందత్త లోక కోడలిని గష్టపెట్టినను తమ కార్యార్థమై మఱియొక కోడలిని బ్రేమించుట కలదు; కాని జానకమ్మ కట్టి పంచనలేక, మీనాక్షి పెద్దకోడలితో నొద్దికఁగలిగి యుండుట తనకిష్టము లేక నిరుత్సుకై సేవో వృథాతప్పులు గల్పించి చుఱచుఱఁ జూచుచుఁ దిట్టిపోయుచుండును.

సుభద్రమ్మ యెప్పుడైన సమాధానము చెప్పవచ్చినఁ "గోడండ్ర నెత్తి కెక్కించుకొని కొంపఁ జెడఁగొట్టుచున్నా" వనియుఁ, "జెనిమిటి యెదురాడిన" వయసు కోడండ్ర జూచి ముసలివాఁడు ననుగాల్చుకొని తినుచున్నాఁ"డనియు, నేదో యొక యల్లరిఁ జేయుచు, వేళకన్నము దినక, నాఁకటి పెల్లుచఁ గంటికి నిదురరాక, శరీరముఁ జెడఁగొట్టుకొనుటచే, నజీర్ణవ్యాధి గలిగి విరేచనము లారంభమయ్యెను.

నానాఁడు విరేచనము లధికమై నోరరుచిపుట్టి యన్నబలము తగ్గిపోయి తుదకు లేవలేక మంచముఁ బట్టిన జానకమ్మ యెప్పుడైన నోటికి విశ్రాంతి నియ్యక 'యిట్టిచెడిపె కడుపున మనుమఁడు పుట్టి, నన్ను వైగలాస మంపుచున్నా'డని కోడలిని బిడ్డలనుగూడ నెప్పుడును దిట్టిపోయుచునే యుండెను.

ఎంత నిందించినను శోభావతి మనసున నుంచక, మిగుల జాలిగలదియై యత్తగారి కుపచరించుచుండెను ఔషధములును బథ్యములును జేయుటకు సుభద్రమ్మకుఁ బ్రొయ్యియొద్ద నరిపోవుటఁబట్టి, మైలబట్టతోఁ గోడలికిఁ సాహాయ్యముగ నుండి జానకమ్మను జూచు

కొనుట కామెకు వీలులేక పోయెను.

పసిబిడ్డల నోదార్చుకొనుటకును, సత్తగారి కపుకపుడు బట్టలు దీయుటకును, నుదికిన వేఱుబట్టలు వేయుటకును, శోభావతికి రేయింబవళ్లు సరిపోవుచుండెను. బాలెంతరాలగు తోడికోడలికిఁ గొంత యూరటఁ గలుగఁజేయనెంచి, మీనాక్షి కొంతసేపత్తగారి యొద్దఁ గూర్చుండెను, కాని యామెపైఁ బ్రీతిచేతఁగాదు. మాణిక్యము మాణిక్యమే. తల్లి జబ్బుతోనున్నదని యానంతయు లేక, శోభావతి పిల్లల నోదార్చుచుండ, "మీ యమ్మయొక్క నుండు"మని యెంత బ్రతిమాలినను నామెవాసన నాకుఁ గిట్టదని, తలద్రిప్పును, నవతలికి వెళ్లును.

జానకమ్మకుఁ గోడండ్రు గిట్టకున్నను దన కొమరులపైఁ బ్రేమ గలిగియే యుండెఁగాన యొకదినము మధ్యాహ్నము పెద్దకోడలి నూరక తిట్టిపోయుచుండ, భోజనముఁ జేయుచుండిన సుబ్బరాయునికి విన సహింపక లేచివచ్చి, తల్లియొద్దఁ గూర్చుండి. "అమ్మా! నీకీ చెడుగుణములు పనికిరావు. లోకమున నెంత చెడిపుత్రైనను నత్తలెంతో ప్రీతిగఁ జూచెదరు. మన మాణిక్య మందరితోఁ దగవులాడి యెవ్వరిని లక్ష్యపెట్టకున్నను, నత్తగారు మంచిమాటలతో సరిపుచ్చుకొనువారని, యందఱనుకొనలేదా? నీవు లోకులకైనను వెఱవక యామె నిట్లు వేపుచుండినను, మనసులోనుంచక రేయింబవళ్లామె యుపచరించుచున్నదే కాని, కడుపునఁబుట్టినపిల్ల నీచెంతకైన వచ్చుచున్నదా." యనెను.

నాలుగుమాటలాడ నశక్తయైయున్న జానకమ్మ కొడుకు మాటలకుఁ దోఁకఁద్రొక్కిన త్రాఁచువలె లేచి, "యోరీ! నీదుంప తెగ. నీయబ్బ యొకఁడే యనుకొంటిని వానికి సాహాయ్యముగ నీవును

జేరితివా. "ముందువచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములు వాడి" యన్నట్లు అన్న పెండ్లమును శ్లాఘించుట తోఁబుట్టినపిల్లను నిందించు టకు, నీబుద్ధి బుగ్గిలోఁగలిసినదా? నివటరా, నాకు బుద్ధిఁ గఱపుటకు వచ్చితివి! నీయుపదేశమింకఁ జాలును. ఛీ! నాయెదుట నుండక తొలఁగిపొమ్ము" అని చెప్పి, తెఱచిన నోటికడ్డము లేక "ఱుద్దఱురాకసులా కట్టైమె కొడుకునుగూడ లోకువఁ జేసికొన్నా" నని కోపంబుతోఁ బాటు, కొడుకును దిట్టిపోయ నారంభించెను.

ఏసంగతులుగాని యింటివారు చెప్పకొనకున్నను వచ్చిపోవు వారిచే నొకరినోటనుండి మఱియొకరి నోటఁ బడుట సహజమే కదా? నూతులయొద్దను దేవాలయములచెంతను బలువురు చేరిన చోట్ల నెల్లను శోభావతి సుగుణములను జానకమ్మ దుర్గుణములనే వల్లె వేయుచుందురు.

భూదేవివంటి మోస్పుగలదయ్యును, మనుమఁడు పుట్టి తన్ను వెళ్లనంపుచున్నాఁడని యత్తగారనుమాట కోర్వలేక యానిందనుండి తనబిడ్డను దప్పించి యత్తగారిని బ్రదికింపుడని శోభావతి వేయివేల్పు లకు మ్రొక్కుకొనుచుండెను.

ఒకదినము రాత్రి జానకమ్మకు మలమూత్రములు బంధించి, కడుపుబ్బి, కాలుసేతులు చల్లఁబడి, కొంతసేపటికి కన్నులు మూఁతపడెను. శోభావతి, "అత్తా! అత్తా! యని యెన్నిసార్లు పిలిచినను బలుకకుండఁగా దిగులొంది, సుభద్రమ్మను బిలిచెను.

సుభద్రమ్మ దగ్గఱకు వచ్చి, జానకమ్మ ముక్కు పట్టిచూచి, "శోభావతీ! యింక నేమున్నదే! అక్కయ్య యీలోకమును విడిచిన" దని మంచమునుండి క్రిందికి దింపెను. ఇంతలో నందఱును వచ్చి చూచి యూపిరి వెళ్లెనని యేడ్చుచుండిరి.

అంతట యెప్పటుండ దన్నింతగాఁ బెట్టినకష్టము మనసున నావంతయు లేక యత్తగారి మరణమునకు శోభావతి పలువిధములఁ బలవించుచు "మనుమని సంతోషముఁ జూడకుండ, నాయత్తగారిని దీసికొనివెళ్లుట న్యాయమా? భగవంతా! భక్తవత్సలా!" యని వేయి విధముల వాపోవుచుండెను.

పతివ్రతలకు దేవతలు సహా వెఱతురుగదా? సావిత్రికి వెఱచి పతిభిక్షనిచ్చిన యమధర్మరాజు శోభావతికేల వెఱవకుండును? రాత్రి యంతయు మరణించియున్న జానకమ్మ శుక్రోదయమునకు కనురెప్పలును గాలివ్రేళ్లును గదల్చుచుండ, మీనాక్షి చూచి భయపడి అబ్బో! యిదేమివింత! పీనుఁగు కాలు గదల్పుచున్నదే! యని యఱచుచు దూరముగఁ బరుగెత్తెను. అంతట సుభద్రమ్మ దీపము పెద్దదిగఁజేసి, నిదానించిచూచి, జానకమ్మకు మెల్లగా నూపిరివచ్చుట గని శోభావతిని నీళ్లుదెమ్మని, నోటఁబోయఁగ గుటగుటమ్రింగి, కన్నులు దెఱచెను. అత్తగారు మఱలఁ బ్రతికినందునఁ దనభిక్షకు నిందపోయెనని శోభావతి మహదానందము నొందెను. వచ్చినవారందఱు నాశ్చర్యపడుచుఁ దమయిండ్లకు వెళ్ళిరి.

కోడలి యుపచారములవలన జానకమ్మకు నానాఁటికిఁ దేలికయ్యె నిటునటు దిరుగులాడసాగెను ఆమె మరణించి మఱలఁ బ్రతికినదునఁ గొంచె మశక్తయైయుండెనేకాని యామె వాక్కునకుమాత్రము మునుపటికంటె నెక్కువ శక్తి కలిగియుండెను. శోభావతియు, మాణిక్యము తప్ప నింటివారేకాదు, ఊరివారందఱును రత్నమువంటి కోడలిని రాచి యంపులఁబెట్టుటకై జానకమ్మ మఱల బ్రతికివచ్చినదని నిందింపసాగిరి.



# శోభావతి.

## పదునొకండవ ప్రకరణము.

---o---

"అత్తగారెన్నైన ననునుగాక. ఆమె బ్రతికినదే చాలు"నని, శోభావతి సంతసింపుచుండెఁ గాని, "తనకుఁ గరచరణాదులు ప్రసాదింపఁ బడినందుకుఁ బెనిమిటికి సర్వోపచారములను జేసి యతని సంతసింపఁ జేయుచు లోకులవలె ముచ్చటగఁ గాపురముఁ జేయ, దయఁజూడక నా జీవితము వృథాచేసితివిగదా! భగవంతా!" యను దుఃఖ మామెను సదా బాధించుచునే యుండెను.

"గోరుచుట్టుపై రోఁకటిపోటు"న్నట్లు శోభావతికిఁగల మనోవ్యథకుఁ దోడుగ నీళ్లాడిన పదునైదుదినములకే యత్తగారికి జబ్బు గలుగుటచే, బాలింతరాలత్తగారి బట్టలు గుంజుటలోను, రేయింబవళ్లామె నుపచరించుటలోను, వేళకన్నము లేక, రాత్రులు నిద్ర లేక, మూఁడుమాసములవఱ కలసటపడి, జ్వరము తగులుచు, దగ్గు గలిగి, నోరరుచిపుట్టి, యన్నము సహింపక నానాఁడు నీరసమై తుదకు బిడ్డల నోదార్చుటకైన నోపికలేక, శోభావతి మంచము పట్టెను.

పట్టాభిరాముఁడును జానకమ్మయు నిద్దరు తప్పఁ దక్కినవా రందఱును శోభావతి జబ్బునుగుఱించి చింతలో మునిఁగిపోయిరి. సుభద్రమ్మ గృహకృత్యములు చేసికొనుచుఁ బొంగి పొరలివచ్చెడి దుఃఖముచేఁ గోడలినే తలఁచిదలఁచి, "తల్లీ! నాకుఁ గోడలివిగావె. నాకడుపునఁబుట్టిన బిడ్డవలె నుంటివే. నాపై నింతప్రీతి యుంచుటచే

నాదురదృష్టమే నిన్ను మంచమెక్కించె నేమో! నేను బిల్లలుగన కున్నను, భగవంతుడు నిను జూపుటచే నా యంత్యకాలమున నుపచరించి, పై గుడ్డ వేయుదువని యెంతో సంతసించియుంటినిగదా! నా బంగరు బొమ్మా! నీభాగుదప్పిన నీయింట నాకేమి పనియున్నది. నేనెవరి ముఖముఁజూచి నీయింట సంసారముఁ జేయుదును. నాకోపిక లేని దినములలో, దిక్కులేని దానిని జేసెదవా?" యని కన్నీరుఁ గార్చుకొనుచు. మనస్థిమితము లేకుండుటచే మునుపటివలెఁ బని సేయుట కోపిక లేనిదయ్యెను.

సామాన్యవైద్యులచే గుణములేకపోయెను. అందుచే శేషయ్య గొప్పవైద్యునిఁ బిలిచి చూపించెను. ఎంతటి వైద్యులైనను శరీరవ్యాధిని గుదుర్పఁగలరేకాని మనోవ్యాధిని గుదుర్చువారు లేరు కదా? మనోవ్యాధి కుదురక శరీరమున కౌషధము లెట్లు పనిచేయ గలుగును? కాఁబట్టి శోభావతి కేమాత్రము గుణములేక వ్యాధి నానాఁడు పెరుగుచుండెను.

తోఁబుట్టువులకన్న నెక్కువప్రీతికలిగి యిద్దరొద్దికతో మెలగుచుండువారగుటచే, శోభావతి జబ్బునకుఁ జాలవగచుచు మీనాక్షి బిడ్డల నక్కఱతో నోదార్చుచు, నక్కగారి కుపచారము చేయుచు నెపుడును బ్రక్కఁబాయకుండెను.

మీనాక్షి కేవల సరిపోవుచుండుటచే దానసహాయురాలై, పెద్ద కోడలి దిగులునఁ బనిసేయలేక యొకదినము మధ్యాహ్నము సుభద్రమ్మ వంటయింటి వాకిటిపైఁ దల నుంచుకొని పండుకొని, శోభావతిం దలఁచి, "తల్లీ! చింతతోనైనఁ గొంతకాలము బ్రదికియుండఁ గూడదా? నీవంటి గుణవతి భూమిపై బ్రతికియున్న నావంటివారికి దిక్కుగ నుండదా! నాకెల్లనఁ గానిమ్ము నీతలిదండ్రులకొక్క బిడ్డవై

వారిని చింతలో ముంచి, పసికూనల దిక్కుమాలినవారినిగఁ జేసి, వెళ్ళఁదలఁచితివా: శోభావతీ! నావంటి యనాథలుండిన నేమిప్రయోజన''మని, పెక్కువిధములఁ దలఁచితలఁచి కన్నీరుఁ గార్చుకొనుచు నట్లే కనుమూసెను,

మీనాక్షి, బిడ్డల నోదార్చి, నిద్రఁబుచ్చి, జబ్బుపడిన శోభావతి యొంటరిగనున్నదని, యక్కగారిచెంతఁ గూర్చుండఁ "చెల్లెలా, చిన్నత్తగా రగపడలేదేమి! ఇంకను భోజనముగాలేదా?'' యని శోభావతి యడిగెను.

మీనాక్షి—అక్కయ్యా! ఆమె భోజన మేమిటో, నేఁజూచినది లేదుగాని, నేనడిగినపుడెల్లఁ దిన్నానని చెప్పుచున్నది. పాపమామెకు నీదిగులుతోఁగూడఁ బొయ్యియొద్దఁ జేయులేక చచ్చిపోవుచున్నది. నడుము లాగుకొని పోవుచున్నదని యిపుడే పంచుకొన్నది.

శోభావతి—చెల్లెలా! మన కామె యత్తగారుకాదే! తల్లివంటిదేసుమా! నీవన్నట్లు నాదిగులుతోనే యామెకృశించుచున్నది. అది యటుండనిమ్ము. నేను వెళ్ళినతరువాత హేమవల్లిని మాయన్న తీసికొనిపోవును కాని, మాయయ్యగారు మధుసూధనుని నామెవెంట బంపుట కిష్టపడరు. కాఁబట్టి వానికి నీవేతల్లివి సుమా! నాకడుపునఁ బుట్టలేదు నీవే కన్నట్టు భావించి, వానిని రక్షించుభారము నీది నాజబ్బునకు వగచి వగచి చిన్నత్తగారు చాల నీరసమునఁబడిపోయిరి ఆమె యింకఁ బెక్కుదినము లీసంసారము నీదునని నాకునమ్మకము లేదు. కాఁబట్టి మధుసూధనునకు నీవే తల్లివి.

మీనాక్షి—[కన్నీటిధారలతో] అక్కయ్యా! నీవట్లధైర్యపడఁబోకుము. అత్తగారి కంతవ్యాధి గుణముగాలేదా. రేపే నీవ్యాధి కుదురఁగలదు.

శోభావతి—చెల్లెలా! ఆశ్చర్యమేల!నాకు బ్రతుకుపై నాస యున్నఁగదా?

మీనాక్షి—అక్కయ్యా! నీవేమి ముసలిదానవా? నీతలి దండ్రుల కొకబిడ్డవు. నీబిడ్డలు పసికూనలు అదియటుండ, నను దోఁబుట్టువున కన్న నెక్కువగ గారవించుచున్నదానవు. నీవువెళ్ళిన నేనును దిక్కుమాలిన దాననేగదా!

అని ముఖమునకు చెఱఁగడ్డమువేసికొని వెక్కివెక్కి యేడ్వ సాగెను.

శోభావతి—చెల్లెలా! పుణ్యవంతులై సంతోష మనుభవించు వారికి జీవితేచ్ఛ యుండవలసినదే కాని, నావంటి దుఃఖభాజనురాలు జీవించు టెందులకు?

మీనాక్షి—[కన్నులు తుడుచుకొనుచు] అక్కయ్యా నీకేమి కొఱఁతే?

శోభావతి—[మీనాక్షి చేయిపట్టుకొని] వెఱ్ఱిదానా! లోక మున స్త్రీలకుఁ "బెనిమిటితోఁ బేదఱికము లేద"న్నట్లు కుడువ గంజి యుఁ గట్ట బట్టయు లేక ముష్టిఁ దెచ్చుకొన్నను, నత్త లాడుబిడ్డ లెంత యాఁటడిఁ బెట్టినను, బెనిమిటి చల్లగాఁ జూచిన నెన్నికష్టములున్నను దోఁచవు. అట్టి భాగ్యములేని నాజన్మ మెందుకు?

మీనాక్షి—అక్కయ్యా! నీవు కోపపడుదువని నేననను కాని మాబావగారి కేండ్లు వచ్చినవే కాని, లోకులనుజూచియైనఁ దెలివి దెచ్చుకొనరుగదా? పార్వతివంటి భార్య నింకొకరైన నెంతో పూ జింతురు.

శోభావతి—అట్లనఁ బోకుము ఆయన ననవలసినది లేదు. "పూజకొద్ది పురుషుఁ"డన్నట్లు తక్కువనోములునోచిన మహాపాపిని

ఎవరి దాంపత్యమును జూచి యోర్వకుంటినో!

అని పొరలివచ్చు దుఃఖముచేఁ దరువాత మాటాడలేక శోభావతి ముఖమును మరలించుకొని వాపోవుచుండెను.

సుభద్రమ్మ నిదుర లేచివచ్చి శోభావతి కన్నీటిలో మునిఁగియుండుటఁ జూచి తనకు వచ్చెడి దుఃఖము నణఁచుకొని, "ఏమే శోభావతీ' లోకమున భాగ్యవంతు మనుష్యులకు రావె ప్రమాదములకు వచ్చునా! లేవే గుణవంతుఁగును మాడుము పెద్దమొకంత జబ్బు గలిగి కుదురుబాటుగా లేదా! అదే మనచే యును' వెర్రిదానా నీవట్లు ధైర్యపడకు" మని ధైర్యము చెప్పి, "పిల్లా! నాయనా! యిపుడే వృద్ధురాలివలె వ్యాధిగ్రస్తురాలి చెంతఁ గూర్చుండి, దానిని మఱియు దిగులుఁ బెట్టించుచున్నావటే! పిల్లవాఁ డేడ్చుచున్నాఁడు వెళ్లు" మని చెప్పి, తాను గొంత సేపు కోడలి చెంతఁ గూర్చుండి ధైర్యము చెప్పుచుండి, సంధ్యవేళకు మనుగుఁ గట్టుకొని వంటప్రయత్నమునకు వెళ్లెను.

కోడలి కొంతలో ఘనవైద్యులచే నౌషధము లిప్పించియు, గుణము లేకుండుటచే శేషయ్య కేమాత్రము ధైర్యము లేక యా రాత్రి భోజనముఁ జేయుచు, సుభద్రా! ఎవరిచేతను పిల్లకు గుణము గపడలేదు. మన పాలిటఁ బడి దాని కేమి సుఖము లేకున్నను, గన్నవారిని శోకమున ముంచి, బిడ్డలకు దిక్కులేకుండఁ జేసి, వెళ్ళిపోవుచున్నదన్న చింత యుండనే యున్నది. అందమునకుఁ దగినట్టి దాని సుగుణములు మన పాపికి మనసునకుఁ దెలియక దాని నిన్నిపాట్లఁ బెట్టియు, నా సాధ్వి వానినంతయు మనసున నుంచక, నేను పోయి యుండిన నాతోఁగూడ రావలయునని నన్ను బ్రతిమాలుకొన్నది. తలఁచిన నాగుండె నీరగుచున్నది. అని కన్నీటితో నావలఁ జెప్పలేక యన్నము విడిచి చేయిఁ గడుగుకొనెను.

శోభావతికి జబ్బని తెలిసి తలిదండ్రులు వచ్చిరి. రామచంద్రయ్య మగవాఁడు గనుక దుఃఖము లోలోన నడఁచుకొని, "తల్లీ! యీ పాపికడుపునఁబుట్టి సుఖమెఱుఁగకున్నను జీవముతోనైన నుండువని తోఁచలేదే!" యని చింతించుచుఁ దనలోఁ గ్రుంగుచుండెను. కల్యాణి రేయింబవళ్లు కొమార్తె కుపచరించుచు నీవలవచ్చినపుడు బిడ్డలను జూచి కన్నీళ్లు వఱదలు గట్టించుచునుండెను.

లోకమున సవతులెంత చెడుమనసు గలవారైనను, బాగు దప్పినపుడైనఁ గొంత ప్రీతిగలిగియుందురు. తన జబ్బుకుఁ గంటికిమంటికి నేకధారగాఁ నేడ్చుచు సంతోశ్రద్ధతోఁ రేయింబవళ్లుపచరించుచుండినదైనఁ దలఁపక యిప్పటి కేదో యొక వంకఁ బెట్టుచుండెనే కాని, జానకమ్మ యొకనాఁడైన శోభావతివంకఁ దిరిగిచూచినది గాదు.

ఒకదినము రాత్రి యందఱు భోజనానంతరము పరుండిరి. శోభావతి మంచమునొద్ద, కల్యాణి బిడ్డలను బ్రక్కనుంచుకొని పరుండెను. అలవాటుచొప్పునఁ బట్టాభిరాముఁడు పదునొకండు గంటలకు భోజనమునకు రాఁగా, సుభద్రమ్మ వడ్డించుచు, "ఓరీ! పాపాత్ముఁడా! అది కైలానమునకు దారిజూచుచున్నదే, ఇఁకనైన దానిఁ గన్నెత్తి చూడక దానియుసురుఁ బెట్టుకొనుచున్నావుగదరా? యని కన్నులనీ రిడుకొని నాయనా! నీవిట్లుచేసినను నిన్నన్నఁ డొకమాటయన్నదానను గాను. ఈవేళ దుఃఖ మాపుకొనలేక" అని యవతలఁ జెప్పలేక ముఖమునకుఁ జెఱుఁగడ్డముఁ బెట్టుకొని యేడువసాగెను.

పట్టాభిరాముఁడు "నిజమే! మాతల్లియైనను గోపమువచ్చిన పుడు నాలుగు తిట్టిపోయును కాని, యీమె యెన్నఁ డొకమాట యన్నదిగా"దనుకొని, "పిన్నమ్మా! అయిననేమి. నీవుగాక యిం కెవరు నన్ననఁబోయెద"రనెను.

సుభద్రమ్మ కన్నులు దుడిచికొని "నాయనా! మనోవ్యాధియే దాని నింతవఱకుఁ దెచ్చెను. ఆ మానిసి యింతవఱకును వెలిఁబుచ్చినది కాదు. ఇప్పుడు తాను బెనిమిటి కుపచరించుటకు నోచుకొనలే దనియుఁ, దన్ను పెనిమిటి కన్నులాఱఁ గాంచుటలేదనియు, నిట్టి పాపి బ్రతుకు బ్రతుకుట యెందుకనియుఁ దన చెల్లెలితోఁ జెప్పి గోడు గోడునఁ నేడ్చుచున్నది. వైద్యుఁడు వచ్చినప్పుడెల్లను మిణుకుచున్నాఁడు. కడ కీచింతయే దానిని దుదముట్టించునట్లున్నది." అని చెప్పి "హా సుగుణవతీ నీ ముద్దుమోమును నా పాపపుఁగనుల నిఁకఁ జూడఁబోవుగదా! కడుపునఁబుట్టిన పిల్లకన్న నెక్కుడు ప్రీతిగలిగియుంటివే," యని గోడను జేరగిలఁబడి, కోడలిని దలఁచుకొనుచుండెను.

ఎంతటి దుష్కాలమో కాని, భార్య చక్కదనము నొకరు వర్ణించినప్పుడైనఁ గ్రిగంటనైనఁ జూతమను బుద్ధి పుట్టదుగదా! పట్టాభిరాముఁడు భోనముఁజేసి యథాప్రకారము వీధిలోనికిఁ బోయెనుగాని, తాను వెళ్ళఁదలఁచినచోటికి వెళ్ళక మఱలివచ్చి మిద్దెమీఁది గదిలోఁ బరుండి యోజించుకొనుచుండెను.

మునుపటివలె భార్య యొడలిమీఁది నగలు దీయకున్నను, మానమున కామె తండ్రి పంపుచుండిన పదిరూపాయలైన నతనికి దొరకుచుండెను. ఇఁక భార్య వెళ్ళిన నదియు లేకపోవుననియో, లేక యింతసేపు చెప్పిన హితము త్రోసిపుచ్చి వెళ్ళెనని సుభద్రమ్మ కోపపడుననియో, యోజించుచుండెఁగాబోలు. కొంతసేపట్లు యోజించుకొనుచుండి తరువాత నిదురించెను

కోడలి సౌందర్యమును, బసితనము నట్లుండనిచ్చి తనకొడుకు దుష్కృత్యములను సైరించు నోర్పును, బెద్దలయందుఁగల భక్తి విశ్వాసములును, నడఁకువయు, వినయవిధేయతలను దలఁచితలఁచి,

శేషయ్య రాత్రులు నిదుర యెట్టిదో లేక చింతించుచుండి, యొక నాఁడుదయము గొప్ప జ్యోతిష్కుని బిలువనంపి, శోభావతి జబ్బును గుఱించి యడిగెను.

జ్యోతిష్కుఁడు వ్రాఁతపలకపై గీట్లుగీచి, వ్రేళ్లెంచుకొని, కొంతసేపు మీఁదివంకఁ జూచుచు, నాలోచించి "పాపగ్రహముల వలన నిట్లు వేధింపఁబడుచున్నది. ఇఁకమీఁద జబ్బు కుదురుఁబాటగు" నని చెప్పెను. "అయ్యా! మీరు చెప్పునది నాకు సరియని తోఁచలేదు. వ్యాధి నానాఁడు పెరుగుచున్నది. ఎట్టి ఘనవైద్యులును, మూఢులగుచున్నారుకాని, యే యౌషధమును బట్టకున్నది" అని శేషయ్య యిటునటు దగ్గఱ నెవరు లేకుండఁ జూచి, కన్నుల నీరుగ్రమ్మ "నింక నేమాత్రము నాకు నమ్మకము తోఁచలేదు. తలిదండ్రుల కేకపుత్రి. సుగుణవతి. బిడ్డలు పసికూనలు" అని కన్నీరు దుడుచుకొనుచుఁ "బిల్లవాని జాతకమును జూడుఁ"డని యొక కాగితము నతనిచేతి కిచ్చెను.

జ్యోతిష్కుఁ డా కాగితమును దీసికొని, పలకపై వేలుగా గీట్లుగీచి వానియందు గ్రహములువేసి వ్రేళ్లెంచుకొని, తలనాడించి, నవ్వుచు, "శేషయ్యగారూ, పిల్లవాని జాతకమునకు మాతృబలము బాగుగానున్నది! ఆమెలగ్నమునకు గురువును, శనియుఁ జాలకుండి నందున, నిన్నిదినము లౌషధము పట్టకుండెను. ఇఁకమీఁద పాపగ్రహమైన శని తొలఁగిపోవుచున్నాఁడు. గురువును మంచివాఁడగుచున్నాఁడు, కుమారునికి మాతృబల ముండుటచేతను నామెకుఁ బ్రాణభయము లేదని గట్టిగాఁ జెప్పవచ్చును. అయ్యా! దీని కేమాత్రము సంశయము లేదు. మీకోడలు స్వస్థపడిన తరువాత నాకు దోవతుల చాపు కొని పెట్టవలయు"ననెను.

"ఇందుకేనా నీవుఁదోఁచిన బొంకులు బొంకినా" ననుకొని, శేషయ్య, ఆహా! రత్నమువంటి కోడలు బ్రతికిన బహుపుత్రుల కేమి తక్కువ? అని చెప్పి, తాంబూలము, దక్షిణయు నిచ్చి పంపి, చిన్న కుమారునిఁ బిలిచి సుబ్బరాయా! వైద్యుఁడు నాలుగుదినములనుండి వచ్చుటలేదు. "నీవైన వెళ్ళి యతనిఁ దీసికొనిరమ్ము." అనిపంపెను

సుబ్బరాయుఁడు మిద్దెమీఁదికి వెళ్ళి చొక్కాయఁ దొడిగి, యుత్తరీయమును దలకుఁ జుట్టి, చేత గొడుగుఁదీసికొనివెళ్ళి, నాలుగు వీధులు దాఁటి బజారువీధి చివరనున్న యొక మిద్దెటింటి లోపలికిఁ బోయెను. ఆయింట వైద్యమునకై స్త్రీలును, పురుషులును బాలురును సందులేక క్రిక్కిఱిసియుండిరి. సుబ్బరాయుఁడు వారిని దాఁటి లోపలికూటమునకు వెళ్లెను.

అచట నొక బల్లముందుఁ గుర్చీపైఁ గూర్చుండి యుండిన నలుఁబదిసంవత్సరముల వయసుగల పురుషుఁ డితనిజూచి, "యేమండీ! సుబ్బరాయలుగారూ! చాలదూరము వచ్చితి" రనెను. సుబ్బరాయుఁడు "నాయుఁడుగారూ! మీరు నాలుగు దినములనుండియు రాలేదని మా తండ్రిగారు నన్ను వెళ్ళి పిలుచుకొనిరమ్మని చెప్పి" రనెను.

వైద్యుఁడు "సరే" యని తలయూఁచి యచటనున్న మఱియొక కుర్చీపై యతనిఁ "గూర్చుండుఁ"డని చెప్పి, వచ్చినవారి నందఱిని జూచి, వారి వారికి నివ్వవలసిన యౌషధముల నిచ్చి పంపివేసి, సుబ్బరాయునివైపుఁ జూచి, "అయ్యా! నేనువచ్చి యేమి ప్రయోజనము? ఔషధము లొకదారిని బోవుచున్నవి, వ్యాధి మఱియొక దారిని బోవుచున్నది. ఆమెకు మందులు పోసి వృథా శ్రమపెట్టుట యేకాని లాభమేమియు లేదు.

వైద్యుని మాటలకు సుబ్బరాయుఁడు కన్నుల నీరునింపుకొని "అయ్యా! మీరిట్లు చెప్పిన నెట్లు? మీబిడ్డయని యెంచి కొంచెము శ్రమఁ దీసికొనవలె"నని, దీనుఁడై ప్రతిమాలెను. వైద్యుఁడు నలువంకలఁజూచి, యెవరులేని దెసఁజూచి సుబ్బరాయులుగారూ! నే నొక మాటఁ జెప్పఁ దలఁచినాఁడను. మీకుఁ గోపము గలుగునట్లైన మానుకొనెద"ననెను.

సుబ్బరాయుఁడు—[కన్నులఁ దుడిచికొనుచు]అయ్యా! యాపదలోనున్న వారికి, వైద్యునిమాటయన్న దేవవాక్కు గదా? అట్లుండఁ గోపమేల కలుగును?

వైద్యుఁడు—అయ్యా! నోరు మూయుటకు మూకుడున్నది కాని, యూరుమూయుటకు మూకుడున్నదా? మీయన్నగారి చరిత మిదివర కెంతరివలననో వినియున్నాను. ఇపుడు మీవదినెగారి జబ్బు వగు విన్నను "నామె మనోవ్యాకులముముందు నీయౌషధ మేమిపనిఁ జేయఁగల"దని చెప్పునట్లు నేనును జూచిరాచి యౌషధములవలనఁ బ్రయోజనము లేక మనసువిసిగి వచ్చుట మానుకొంటిని.

వైద్యుని మాటలకుఁ దన కేమియుఁ దోఁచక కన్నీరుఁగార్చుకొనుచు, సుబ్బరాయుఁడు కొంతసేపూరకుండి, తరువాత "యేమి సేయఁగలము? పెద్దవాని నిందింపఁగూడదు ఆపాపాత్ముని చర్యలందఱకును దలవంపులు సేయుచున్నవి. వీనియొద్ద నామె యేమియు సుఖ మెఱుఁగదు నాకేకాదు మాతండ్రిగారికిఁగూడ నామె యీ దుఃఖసముద్రముదాటి వెళ్ళిపోవునన్న చింత లేదు. కాని బంగారమునకుఁ బరిమళ మబ్బినట్లామె సౌందర్యమునకు సరిగా గుణము నట్లే యమరియున్నది. పెనిమిటి యింత క్రూరుఁడయ్యు నితరులు కావంతేని తెలుపకుండుటయే కాక యామెఱుఁగల పతిభక్తియు

పెద్దలయందు భక్తివినయములును జిన్నలయందుఁ బ్రీతియు వేనో ళ్ళఁ బొగడినను జాలదు సౌందర్యసద్గుణములయం దామె సాక్షాత్పా ర్వతీదేవియని చెప్పవచ్చును. అట్టి సతీరత్నము వెళ్ళిన లోకమున నామెవలె నెవరిని జూడఁబోయెదనన్న చింత నన్ను బాధించుచు న్నది. ఎన్నో దైవయత్నమున బిడ్డలు పిల్లలు పుట్టిరిగాని యట్టి సతీ మణిని గన్న తల్లియైనఁ జూచి యెఱుఁగఁడు. ఆమె నా మనోవ్యథ యే యింతకుఁ దెచ్చె"నని చెప్పుచుఁ గన్నులు దుడుచుకొనుచుండెను.

వైద్యుఁడు—అయ్యా! ఆ సంగతి వేఱుగఁ జెప్పవలయునా? చక్కని చుక్కయయ్యె నామెచింత. యామె ముఖదర్శనమే చెప్పు చున్నది పసిబిడ్డ లటుండనిమ్ము. పాపము తలిదండ్రుల కేకపుత్రి యని మీతండ్రిగారు చెప్పిరి: ఒక్కబిడ్డయైనను నిట్టిబిడ్డను గను గొన్నఁజాలును వారేమి సంతోషపడినారు? దైవమునకేమి వంచ నయో కాని, యన్నియు సరిగాఁ గూర్పఁడు

సుబ్బరాయుఁడు—ఆమె యిట్టిదుముల బడుచుండియు, నొక బిడ్డను విడిచియుండలేక, తలిదండ్రు లెన్నిసారులు పిలువనంపినను బుట్టినింటికి వెళ్లదు.

వైద్యుఁడు—అయ్యా! మీరామెవిషయమున నింత విశ్వాస మున నుండుటవలన భేదము లేక యడుగుచున్నాను లేకున్న నే నడుగుట సరికాదు ఇట్టిమాట యడిగినానని మనమున కాయాప ముఁ జేసికొనవలదు అతనికిఁ బైవ్యాపక మున్నదనిగూడవిన్నాను

సుబ్బరాయుఁడు—అయ్యా! మన్న మాటకుఁ గోపపడినఁ బ్రయోజన మేమి? ఊరంతయు నెఱిఁగినసంగతి నేను దాఁచిన మాత్రమున మీకుఁ దెలియకుండునా? ఆ సాధ్విని నానాశ్రమలఁ బెట్టి ప్రె సొమ్మంతయుఁ బెట్టుకొనిన దండుగ లేకదా? పెదవానినన్న

పాప మనుభవించెదఁ గానిండు. వారెల్లా పతివ్రత యనురంటక పోదునుమా! ఇందువలననే యామె కుందముట్టున్నది. అయ్యా! యా గుణవతి యని దుఃఖమున మనను నిలుపుకొన్నది. మీరన్నియుఁ దెలిసినవారే కదా: వెఱ్ఱివానివలె మీతో నన్నియుఁ మొఱఁ బెట్టుకొంటిఁగాని యెవరితోనైనఁ వెలిబుచ్చఁబోయెదనా? నేనువచ్చి చాల సేపైనది. నాయనగారు కోపపడుదురు.

వైద్యుఁడు—ఇదెవచ్చెద. మీరు ముందు వెళ్లుఁడు బట్టలు తొడుగుకొని మీవెంటనే వచ్చుచున్నాను.

సుబ్బరాయుఁడు—అయ్యా' మఱువఁబోయెదరు శీఘ్రముగ రండు [అని వెళ్లెను.]

వైద్యుఁడొక సీసానుండి కొంచెము చూర్ణము కాగితములోఁ బోసికొని దానిలో నేమో కలిపి, చిన్నమాత్రలు జేయుచుండెను.

సుబ్బరాయుఁడు రాకముందుఁ జెవిలో నౌషధము వేయించు కొనుటకై వచ్చి, జనులు నిండియుండుటచే గదిలోఁ దలుపు చాటున గూర్చుండియున్న రాగమంజరి వీరి మాటలన్నియు వినుచుండి సుబ్బరాయుఁడు వెళ్లుట యెఱిఁగి లేచి యీవలకువచ్చి "నాయుఁడు గారూ నేనువచ్చి చాలసేపైనది. మీరుపనిమీఁద నుండుటచే తొందఱ పెట్టఁగూడదని గదిలోఁ గూర్చుంటిని. మూఁడు దినములనుండి మీరువేసిన యౌషధముచేఁ బోటేమియుఁ దగ్గలేదు. యీవేళ వేరు మందేదైన బోయుదురా!" అనెను

వైద్యుఁడు—నేనును త్వరగా వెళ్లవలెను. చేతిలోనిపనిఁ జేసి వచ్చెద నుండుము.

రాగమంజరి—అయ్యా! ఇంతసేపు మీతో మాటలాడుచుండినవారెవరు?

వైద్యుఁడు—[తనలో నోహో! యీమె చాటునఁ గూర్చుండి, యన్నియు వినినట్లున్నది. అయిన నేమి? అందఱకుఁ దెలిసిన విషయమే." యని ధైర్యముఁ దెచ్చుకొని] అతఁడా! అవధానము శేషయ్యపంతుల చిన్నకుమారుఁడు.

రాగమంజరి—వారియింట నెవరికి జబ్బు?

వైద్యుఁడు—అతని యన్నభార్యకు.

వైద్యుఁ డిట్లనుచుండ, లోపలినుండి యొక ముసలి చెవిని బంగరు కమ్మలు వ్రేలుచుండఁ బండ్లన్నియు రాలిపోయిన బొక్కినోటితోఁ జేత నొక తాంబూలము దంచు నినుపఱోలును, మఱియొక చేతఁ దాంబూలపుఁబ్రదిత్తియుఁ బట్టుకొని, తిలనాడించుచు వచ్చి, గుంజ నానుకొని కూర్చుండి. తిత్తిలోని వక్కలాకులను ఱోటిలోఁ బెట్టి టక్కుటక్కు మని దంచుచు నతనిమాట చెవినిబడఁగ నిట్లనెను. "అయ్యో! పాపము! ఆమెయేనా? మంచి చక్కనిదే కాక, చాల గుణవతి. ఆ మగనికిఁ దక్కునదికాదులే. ఈవెనుక నదుముదాచుకొని యా చివరకుఁ బోలేక పోవుటచే మాయింటిని కాని వాకిటికి వెళ్ళినతోడనే "అవ్వా రో"మ్మని యెంతో మర్యాదతో ముద్దులొలుక మాటలాడును, అయ్యో తలిదండ్రుల కొకబిడ్డవే. బిడ్డయున్న బిడ్డా! మగని కిల్లా లక్కఱలేకున్నను వారి యదృష్టమైన బాగుగ నుండదా? తల్లీ! నీకు వచ్చిన చావు నావంటి ముసలి ముండలకు రాఁగూడదా? బంగరుబొమ్మా! నాకుఁ దెలిసిన నొకసారి పోయి కను లారఁ జూచివత్తునే! ఇఁక నాయందము నెక్కడ జూడఁబోయెదము." ఇట్లామె వాపోవుచుండ వైద్యుఁడు "అవ్వా! నీవుచెప్పిన దెవరి మాట!" యని గట్టిగా నడిగెను.

వృద్ధురాలు "నాయనా! ఇపుడు నీవామెతోఁ జెప్పుచుం

టివే శేషయ్యగారి పెద్దకోడలు వెళ్ళినదని, యామెమాటయేనా! నాతో నొకమాటఁజెప్పిన నెట్లనేఁ దిన్నగాఁబోయిచూచివత్తు నే?తల్లీ! నీకన్నులపోయగ మింకెక్కడఁ జూడఁబోయెద'' నని కన్నీరుగార్చుచు ముక్కుఁ జీదుచు నుండెను. వైద్యుఁడు నవ్వుచు రాగమంజరినిఁ జూచి, ''ముదుసలివారిట్లే. యొకటివినిన మఱియొకటిఁగూడఁ గల వేసికొందురని చెప్పి, తల్లినిజూచి ''అమ్మా! చక్కగా వినకయే మాటాడవద్దని యెన్నిమాఱులు చెప్పియున్నాను. ఆమెకు జబ్బుగా నున్నదని చెప్పితినిగదా'' యని బిగ్గఱగా నఱచెను.

ముదుసలి ''అటులనా! నాయనా! పోనిమ్ము ఆమెకుఁబట్టిన పీడ తొలఁగినది నా కట్లు వినఁబడినందున మనసు నిలువలేదు. పోనిమ్ము. తల్లికడుపు చల్లగానుండవలె'' నని చెప్పుచుఁ గాళ్లఁ జాపుకొని, తాంబూలము నోటవేసికొని నములుచుండెను.

వైద్యుఁడు మాత్రలన్నియుఁదీసి యొక సీసాలో వేసి,బీరువలో నుంచి, చేయికడుగుకొని, రాగమంజరిచెవిలో నౌషధముఁ వేసి చేత నొక సీసాలో నౌషధ మిచ్చి, దినమునకు నాలుగుసార్లు చెవిలో వేసికొనుమని చెప్పి, యామెను బంపి, తాను బట్టలు తొడిగికొని, శేషయ్యగారి యింటికి వెళ్లెను. శేషయ్య వైద్యుని మర్యాదతోఁ గూర్చుండఁబెట్టి యేమండీ నాయుఁడుగారూ! మాపై దయతప్పినారు. ఏమో మీపిల్లగ భావించి కొంచెము శ్రమఁ దీసికొనుఁడు'' అని దైన్యముతోఁ బ్రతిమాలుకొనెను. శేషయ్య బ్రతిమాలుటచూచి వైద్యునకు జాలిపుట్టి, అయ్యా! నాదేమున్నది? భగవంతుఁడు దయ తప్పినాఁడు. నేను మంచి యౌషధముల నుపయోగింపఁగలవాఁడనే కాని, తరువాత నేమగు?నని యేవో యౌషధమిచ్చి వెళ్లెను.

వైద్యుఁ డధైర్యముతోఁ జెప్పినాఁడని శేషయ్య నోటఁ దడి

లేక, చింతతోఁ బరుండియుండ, ప్రొద్దు చాలయగుటచే సుభద్రమ్మ తలుపుచెంత నిలిచి బావగారిని "స్నానమునకు లేయరాదా?" యని హెచ్చరించెను.

శేషయ్య—[(గుడ్లు నీరు గ్రుక్కుచు] సుభద్రా! ఏమిస్నానము! ఏమిభోజనము? వైద్యుఁడీవేళ యున్నసంగతి బయలుపఱచినాఁడు.

సుభద్రమ్మ—[కన్నీరువిడుచుచు] అతఁడేమన్నాఁడు?

శేషయ్య— [పొరలి వచ్చెడు దుఃఖముతోఁ జెప్పలేక, తిన్నగా] ఏమన్నాఁడు, దేవునికి దయతప్పినది. మీా యదృష్టమని వెళ్ళినాఁడు.

అని చెప్పి, ముఖమును దిండుపై బోరగించుకొనెను.

సుభద్రమ్మ గుండెమీాఁద చేయిఁబెట్టుకొని, "హా తల్లీ! నీ వ్యాధి నిన్నింతవఱకుఁ దెచ్చినదా! తిన్నగా గుణ మలవడుననుకొంటినే! నా గుణనిధీ! నీకని యెక్కడి పాడురోగము వచ్చినదే! బంగారు తల్లీ!" యని దుఃఖించి శేషయ్యను జూచి, పోనిండు, పిల్లకుఁ గాని, దానితల్లికిఁగాని తెలిసిన, దిగులుపడిపోదురు. మన యదృష్టమింతేయని, కన్నులు దుడుచుకొని యీావలకు వచ్చెను.

"హా సుగుణవతీ! తలిదండ్రుల కేకపుత్రివై గోముగఁ బెరిగి నాయింటఁ బడి, నీ వేమాత్రము సుఖ మెఱుఁగకున్నను, గౌరీదేవి వలెఁ జూచువారికిఁ గనుబండువు సేయుచు, సద్గుణములచేఁ గీర్తిఁ దెచ్చితివి. చెడిపెలై దీర్ఘకాలము బ్రదికిన నేమి ప్రయోజనము? పోనిమ్ము. బ్రదికిన కొంతకాలములో నాలుగుదినములైనను లోకసుఖము ననుభవించి సంతోషము నొందితివా! మహాపాపి యొక్క నాఁడైన నిన్ను సుఖపెట్టకపోయినాఁడు గదా" యని శేషయ్యపలు

విధములఁ దలఁచితలఁచి చింతించుకొనుచుండి, తుదకు మనయదృష్ట మింతే. ఇట్టి శీలవతి వెళ్ళిన నెట్టి గయ్యాళితో ఁగవలయునని వాని నొసట వ్రాసియున్నదో! మన మేమి చేయఁగలఁ?" మని మనసున ధైర్యముఁ దెచ్చుకొని లేచి స్నానమునకు వెళ్లెను.

శేషయ్యకుఁదప్ప నై దుగ్గఁడన్న మాట యెవరికిఁ దెలియకుండు టచే నెప్పటియట్లుండిరిగాని, సుభద్రమ్మయు, శేషయ్యయు సుఖముల వ్రేలవేసికొని లోలోనఁ గ్రుంగుచుండిరి అలవాటుచొప్పున రాత్రి భోజనమైనతరువాతఁ బట్టాభిరాముఁడు రాగమంజరియింటికి వెళ్లెను.

లోకమునఁ గలిసహృదయులై విటపురుషులచే నిల్లాండ్ర పుస్తెలతోఁగూడఁ దెప్పించుకొని కులసతుల మాడ్చి, కొంపల ముంచునట్టి వేశ్యాంగనలవలెఁగాక, రాగమంజరి వేశ్యకులమునఁ బుట్టినదయ్యు, దైవ భక్తియు, బ్రాహ్మణ భక్తియుఁ, బాపమునందు భయమును గలిగి, పరుల నొప్పించకుండుటే,పరమధర్మంబని యెంచఁగినదియగుటచే పట్టాభిరాముని జూడఁగనే లేచి నిలువఁబడెను.

పట్టాభిరాముఁ డచటనుండిన కుర్చీపైఁ గూర్చుండి, రాగమంజరిని జూచి, "ప్రియురాలా! నీ చెవిబాధ యెట్లున్నది" అని యడిగెను. ఈవేళ వేడె యౌషధముఁ వేయించుకొంటిని దానివలన గొంచెము గుణముగనున్నదని చెప్పి, రాగమంజరి స్తంభము నాను కొని కూర్చుండి రెండు దినములనుండియు మీరు వచ్చుటలే దేలఁ?" యనెను.

పట్టాభిరాముఁడు—నీవు చెవిబాధతో నుండ నినుఁ గష్ట పెట్టుట కిష్టములేకయే.

రాగమంజరి—అది యుండనిండు. మీయింట నెవరికో జబ్బని విన్నాను.

పట్టాభిరాముఁడు—నీకెవరు చెప్పిరి.

రాగమంజరి—ఔషధమునకు వెళ్ళినపుడు వైద్యుఁడు శేష య్యవంతులవారింటికిఁ ద్వరగాఁ బోవలయునని చెప్పుచుండెను. అందు వలన నూహించుకొంటిని.

పట్టాభిరాముఁడు—ఈమధ్య మాతల్లికి జబ్బుగానుండెను.

రాగమంజరి—అది సరే, యిప్పు డెవరికి జబ్బు?

పట్టాభిరాముఁడు, విననట్లు మోఁదుఁజూచుచుఁ దనలో "నిది రెండుసంవత్సరముల నాఁటనుండి క్రొత్తగా వచ్చినది అందు చే నీయూరిలో నేనుదప్ప నింకెవరితోడను స్నేహముఁ జేసియుండలే దు నాచరిత్రము నెఱుఁగదని, నాప్రతినఁ జెప్పుకొంటిని ఇది నన్ను జేరనియ్యదని తలఁచి, నాకింకను వివాహము గాలేదని, దీనితో బొంకి రెండుసంవత్సరముల నుండి తప్పించుకొంటిని ఇపుడెట్లో వాస్తవము గనుగొని నన్నడుగుచున్నది. ఇఁక నెట్లు తప్పించుకొనఁ గలు" నని యోజించుకొనుచుండెను.

రాగమంజరి—ఏమట్లు మోఁదుఁజూచుచున్నారు. అది యుం డనిండు. మీ రెందరు సోదరులు?

పట్టాభిరాముఁడు—రెండుసంవత్సరముల నుండి యడుగనిదా నవు. నేఁడడుగుటకుఁ గారణమేమి?

రాగమంజరి—ఏమో యీవేళఁ దెలిసికొందమని యడుగు చున్నాను, అందువలనఁ దప్పేమి?

పట్టాభిరాముఁడు—మా తల్లికి నేను తొలిచూలు, నా కొక తమ్ముఁడును నొక చెల్లెలు నున్నారు.

రాగమంజరి—మీ చెల్లెలు బుద్ధిఁదెలిసి కాపురముఁ జేయు చున్నదా?

పట్టాభిరాముఁడు—నాలుగుసంవత్సరములనుండి సంసారముఁ జేయుచున్నది కాని, యింకను బిల్లలులేరు.

రాగమంజరి—మీ తమ్మునిసంసార మింటికివచ్చెనా?

పట్టాభిరాముఁడు—సంవత్సరమైనది

రాగమంజరి—అట్లైన మీకంటెఁ జిన్నయగు తమ్మునకు ముందు వివాహముఁ జేయుట కేమి కారణము?

పట్టాభిరాముఁడు మీఁదుఁజూచుచు మిడుకుచుండెను.

రాగమంజరి—(ముఖముఁ జిట్లించుకొని) అయ్యా! నీవు బ్రాహ్మణుండవు, విద్యావంతుఁడ వని చెప్పుచుంటివి. నీకుఁ దెలియనిది లేదు. తుచ్ఛభోగమున కాసించి, యిట్లు చేయుట యుచితమా? మీరు డబ్బిచ్చినందుకు మీ కుపయోగపడవలసినదాననే కాని, యంతకంటె నెక్కువ నాకధికారము లేకున్నను, మీమేలుఁగోరి చెప్పుచున్నాను. మీయిల్లాలు సుందరవతియనియు, గుణవతియుఁ, బరమసాధ్వియు ననియు నీమూఁడుదినములనుండియుఁ బలువురినోట, వినుచున్నాను. అట్టి పతివ్రతను, ఒన్నఁబుచ్చుట యొక పాపము. తన యక్క యొకరి వ్రతమును జెడఁగొట్టుట మఱియొక పాపము రెండువిధముల పాపము సంపాదించుకొంటిరి. ఆహా. "చదువరికన్న చాకలిమే"లనుసామెత మీయందు సార్థకముఁ జేసికొంటిరి. అయ్యా! నా పూర్వకర్మముచే వెలయాలినై పుట్టినను, భగవంతుని దయవలన నొంత తెలివిగలిగి యుండుటచే, లోకములో విటకత్తెలవలె, నెరి కోపమునిఁగిసను వచ్చినదానిని రాఁబట్టుకొనవలెననికోరి యగ్నిసాక్షికముగఁ బెండ్లాడిన యిల్లాండ్రింట యున్నురుసున నిట్టూర్పువిడుచు కనుల నీరుగార్చుచుండ, మనము సకలభోగముల ననుభవించుటు మహాపాతకమని తలఁచి వివాహము లేనివారితో జను, గర్భాధీన

మున భార్య గతించినవారితోడనే కాని, సతు లున్నవారితో సంసర్గము చేయుటలేదని ప్రతిన గలదాననై యట్లే జరుపుకొనుచుంటిని. అట్లుండియు నా సుఖముఁ గోరక వారిమేలుఁ గోరినదాననై, "పుట్టించినవాఁడు పూరి మేపక పోఁడు, మన జీవనమెట్లైన జరుపు"నని తలఁచి, వారిని నిర్బంధించి, వివాహములఁ జేయించుచు, గృహస్థులైన తరువాత మఱి వారిపొందుఁ గోరక, హితముఁ జెప్పి పంపుచు నిట్లే యింతవఱకుఁ జరుపుకొనుచుంటిని. ఇట్టి నా నడవడి నాతల్లికిఁ గిట్టక యామెకు ధనమే ప్రధానము కనుక, యౌవనముననే కాని వార్ధక్యమున నార్జించుకొనుట యసాధ్యమనియు, నెట్టి యధర్మములకైన నొడిఁగట్టి ధనమార్జింపక యిట్టి వేదాంతముల ననుష్ఠింపుచున్నాననియుఁ గులముఁ జెఱుపఁ బుట్టినాననియు నెల్లప్పుడుఁ బోట్లాడుచుండ నామె పోరుఁ బడలేక మా యూరు విడిచి వచ్చితిని. ఈ యూరు క్రొత్త యగుటకుఁ దోడు నీ బొంకులచే వంచింపఁబడి, నా ప్రతినఁ జెడఁగొట్టుకొంటిని. తొలినాఁడే నా ప్రతినఁ జెప్పి, నిన్నడుగుకొనినను వాస్తవమును దాచి నన్ను మోసపుచ్చితివే! ఇది యుచితమా?

అని రాగమంజరి కనుల నీరు పెట్టుకొని యంజలి ఘటించి, గోడను వ్రేలుచుండిన రుక్మిణీసత్యభామా సహితుండైన శ్రీకృష్ణమూర్తి పటముపైఁ జూపు నిలిపి, "సర్వపాప సంహారకుఁడును, నాశ్రితవత్సలుండునైన భగవంతుఁడా! నాకుఁ దెలియమిచే సుగుణసుందరి యగు పతివ్రత నలయించి నేను తుచ్ఛసుఖము ననుభవించి నందులకై యనుభవింపవలసిన పాపమునుండి నన్ను దొలఁగించి రక్షింపు"మని వేడుకొని, పట్టాభిరాముని జూచి, "అయ్యా! యిల్లాలు లేకున్న వెలయాలి నాశింపవలెఁగాని, యగ్నిసాక్షికముగఁ బెండ్లాడిన యిల్లాలు కుంటిదైనను, గుహ్యవ్యాధియైనను, గుణవతి కాకున్నను, దరి

ద్రురాత్మ యున్నను మనము చేసిన పుణ్య మింతేయని తృప్తిఁజెంది, దానిని మన్నించి యేలుకొనుటయే మగతనముగాని, పతియే దైవ మని నమ్మిన యిల్లాలినిఁబోనాడి, పరస్త్రీ సంగమముఁ గోరుట కాల సర్పమని యెఱుఁగక, కంఠమునకుఁ జుట్టుకొన్నట్లుగదా? మూర్ఖులకు బుద్ధిఁ జెప్ప నెల్లరు సమర్థులు. తెలిసినవారికిఁ జెప్ప నాదిశేషునికిని సాధ్యముకాదు గదా?" యని యుద్బోధించి మఱలఁ గృష్ణమూర్తిపట ముపైఁ జూపు నిలిపి, "అహల్యాశాపవిమోచనా! ద్రౌపదిమాన రక్షకా! కరుణాకటాక్షా! యిట్టి పాపమొనర్చి ఘోర నరకబాధ ననుభవింపఁజాలను కనుక, నా ప్రార్థన మంగీకరించి, సూర్యకిరణ ములు మంచును దొలఁగించునట్లు నీ కరుణాకటాక్ష వీక్షణములచే నా పాపముల హరింపఁజేసి నన్ను రక్షింపు" మని ప్రార్థించుకొను చుండెను.

తన యవివేకమును గుఱించి తా నేమి చెప్పుటకుఁ దోఁచక వేశ్యాంగనయయ్యు రాగమంజరికిగల తెలివియైనను బండితబ్రాహ్మ ణుఁడైన తనకు లేనందుకుఁ జింతగలవాఁడై నోరుమెదల్పక పట్టాభి రాముఁడు క్రిందుఁజూచుచుఁ దనలో, "అహా! యీ రాగమంజరి చెప్పిన వెల్లను నీతివాక్యములే కాని, నన్ను నిందించుటకాదని నా బుద్ధికిఁ జక్కగా గోచరించుచున్నది. గౌరవనీయుల కడుపునఁ బుట్టి చదువరినై యుండియు నా చెడునడవడిచే నేనే యపకీర్తిఁ దెచ్చుకొం టిని ఏమో పసితనమున నింద్రియచాపల్యముచేఁ గొంత బుఱదలోఁ గాలుఁ బెట్టిన నది నన్ను గొంతువఱకీడ్చివేసెను. ఈడ్చిననేమి? నేను కొంత తెలివిఁదెచ్చుకొని యిల్లాలి నింత వేసటఁబెట్టక సామాన్య ముగ నడచుకొనిన నింత యపకీర్తి పాలుగాకుందును. అట్లు కాక కామాంధుఁడనై కట్టుకొనినదానిని గీగంటనైనఁ జూడక నానా కష్టములఁబెట్టి సర్వమును దోచుకొని, జారచోరుఁడ ననిపించుకొని

నన్నుతండ్రి కేకాక, పిన్న పెద్దల కందఱకు **నసహ్యము** గలిగించితిని. ఇఁకనైనఁ గొంత తెలివిఁ దెచ్చుకొనిననే కాని లేకున్న నెందులకును గొఱగానివాఁడను కావలసినదే." కొంతసే పిట్లెంతయుఁ జింతఁ జేసి కొనుచుండి "యింకమీఁద రాగమంజరి యేదేని **నడుగు**" నని తలఁచి చిన్నగా లేచి వెళ్లెను.



# శోభావతి.

## పండ్రెండవ ప్రకరణము



సహవాసయా దోషగుణాభవంతి సహవాసయా పుణ్యగుణాభవంతి

"సహవాసమే మోక్షము సహవాసమే నరక"మన్నట్లు దుష్టాంగనల దుర్బోధనలువిని యిల్లాలిని హింసించి యిల్లుదోఁపిడీఁ జేసినను, సత్సహవాసముగలిగి సద్బోధనలు వినుచుండుటచే సద్బుద్ధి గలుగవచ్చునుకదా? వారము దినములనుండియుఁ బినతల్లి చెప్పుచుండిన సద్బుద్ధులవలనఁ గొంత మనసు మాఱె, యందుకు సాహాయ్యముగ గుణవతియగు వేశ్యయొక్క ప్రసంగముఁ గూడఁ దెలివి గలుగుటకుఁ దోడయ్యెను.

మఱుదినము రాత్రి భోజనమైన తరువాత "నిన్నరాత్రి రాగమంజరి నాపైఁదిరుగఁబడినదే ఈవేళ నెట్లున్నదో చూత"మని పట్టాభిరాముఁ డామె యింటికి వెళ్ళెను. రాగమంజరి యెప్పటివలెనే గౌరవపూర్వకముగ నతనిని "కుర్చీపైఁ గూర్చుండు"మని దానును చెంతఁ గూర్చుండెను.

పట్టాభిరాముఁడు "ప్రియసఖీ' రాత్రి నాపైఁ జాల సలిగితివి. నేఁజెప్పినదే ప్రమాదమని యొప్పుకొనెద, నీవేళనైన శాంతమువహించితివా!" యని వినయముతో నడిగెను. పట్టాభిరాముని మాటలకు రాగమంజరి నవ్వుచు "అయ్యా! మీరు సంపన్నులు, విద్యావంతులు నేను లంచమున కాసించెడి మీదాసిని. మీపైఁగోపింప నేనెంతటిదానను? మీకుఁ బసితనముగాదు. చక్కగా యోజింపుఁడు మీ మేలునకుఁ జెప్పినదాననేకాని, వేఱుకాదు. అది యుండనిండు.

మీభార్య సుందరవతియని వినుటవలన నాకామెను జూడవలయునని చాలఁ గోరిక యున్నది''అనెను.

పట్టాభిరాముఁడు—మామ యేమి? అందరికున్నట్టి ముఖమునఁ గన్నులు ముక్కు నున్నవి.

రాగమంజరి—మీ చోద్యఁపుమాట లుండనిండు. అట్లైన రూపవతియు గుణవతియు నన్నమాట యుక్తదేనా! నన్నుంవటివలె నెంచక యిప్పుడైన వాస్తవమును జెప్పుఁడు. లేకున్న మీకుఁ బార్వతీ పతిపై నాఁ బెట్టితిని.

''ఇదియేమి, యిట్లసాధ్యముఁ జేయుచున్నది! ఇది యున్నట్లిది వఱకు నేను స్నేహముఁజేసిన కాంతలు నాభార్యను గొట్టి పెఱుకుకొని తెమ్మనుచుఁ దేనినాఁడుపారకఁ బ్రహరించి పంపుచుండిరి కదా!ఇదియన్ననో, నేను బొంకినదియే సత్యమని నమ్ముటయేకాక, నే నిచ్చినంతయే తప్ప నెక్కువనాసింపకుండి, నాబొంకులకు మోసపోయి తనప్రతినఁ దప్పినందు కెంతయో పరితపించుచున్నదే! ఇట్టియోగ్యురాలియొద్ద నిజముదాఁచిన నెప్పటికైనఁ గష్టము గలుగు''నని యోజించి పట్టాభిరాముఁడు''రాగమంజరీ'ఏమో తెలివిలేక యిపుడసత్యమాడితిని కాని, నీవింత యోగ్యురాలవయియుండి నాకు హితముఁ జెప్పుచుండ, నీతోఁ బరిహాస మాడుదునా? నేఁజేసిన క్రూరమునెల్ల నోర్చినపుడే గుణవతివని తెలియవచ్చినది. ఐనను రూపవతి యను మాట నేనెఱుఁగ''ననెను.

రాగమంజరి కన్నీరు విడుచుచుఁ జెక్కిటఁజేయిఁ జేర్చి ''అయ్యో! పాపము! అంతకష్టపడెనా! అదియటుండనిచ్చి, మీమాటలందేమియు నాకు నమ్మకములేదు. ఇద్దరు బిడ్డలుగూడ నున్నట్లు వింటిని. మీరామె నెఱుఁగకున్నఁ బిల్లలెట్లుపుట్టి''రని యడిగెను

సద్బోధనలచే మునుపటిమతి కొంతమారుటచేఁ బట్టాభిరాముఁడు తానిదివఱకు నడచినమార్గము చెడ్డదని చక్కఁగ నెఱిఁగినవాఁడై తనలోఁ దాను పరితపించుకొనుచుఁ దన వ్యసనముఁ జెప్పుకొన, నింతకంటె నాప్తు లెవరు లేరని తలఁచి, "రాగమంజరీ! ఏమో నా పూర్వకర్మమువలన నిన్నిదినములు గోతిలోఁ బడియుంటిని ఇపుడు నీ సద్బోధనచే వెలుతురుగు పడినది. కాఁబట్టి నీకుఁ జెప్పక యింకెవరికిఁ జెప్పఁగలను? నీతోఁ జెప్పుకొన్నను నాపాపము కొంతతొలఁగును ఐనను గతిచుఁడనని నీవు కోపపడకుండిన నన్నియుఁ జెప్పెద"ననెను.

రాగమంజరి "అయ్యా! అట్టిదానవైన మిమ్మింతగ నడుగుదునా!"యనెను. ఎన్నున్నను దనదుశ్చరితమును నానచెప్పుకొన జంకుఁగలవాఁడై పట్టాభిరాముఁడెట్లు చెప్పుదునని కొంతసేపు యోచించుకొనుచుండి, "రాగమంజరీ గంటలు పండ్రెండైనవి. నాకేమో నేఁడు నిద్రవచ్చుచున్నది ఇంటికి వెళ్లెద"ననెను తనతప్పు నొప్పుకొని దీనుఁడై యుండుటఁ జూచి మిగులఁ దొందఱ గలిగింపఁ గూడదని యెంచి, రాగమంజరి, "మంచిది వెళ్లుఁడు రేపెల్లైన మీరే స్వయముగ మీ భార్యనడిగివచ్చి యామె శరీరస్థితి నాకుఁ జెప్పవలయు" ననగఁ బట్టాభిరాముఁడు తలయూపి వెళ్లెను.

"కర్మము కాలుఁబట్టి యీడ్చినపుడు లంకె మోకాళ్లు బట్టి యీడ్చు"నన్నట్లు పట్టాభిరాముని దుర్బుద్ధికిఁ తోడు విటకత్తెల దుర్బోధనలు దోడుఁబడుచుండెను. కాలము మంచిదైనపుడన్నియు ననుకూలించుచునే వచ్చునుకదా! సచ్చరితయగు రాగమంజరి బోధనలును, బినతల్లి యుపదేశమును, జెవి కెక్కఁగొలఁది సదుద్దేశములుగలవాఁడై పట్టాభిరాముఁడు రాగమంజరి కుత్తరముఁ జెప్పకున్నఁ దన ముఖముఁ జూడదని తలఁచి, తనకును భార్యను జక్కఁగఁ

జూడఁ గోరికపుట్టి మఱుదినము రాత్రి మిద్దెమీఁది గదిలోఁబరుండి "యేముఖమున దాని యెదుట కరుగుదు? నేమని పలుకరింతు?" నని నానా విధముల యోచించుకొనుచుండెను.

శోభావతి చాలసేపు దగ్గుచే శ్రమపడుచుండి కూఁతురు పుట్టినందునఁ బిల్ల లఱచిన మెలకువ యగునని కల్యాణికి సందడిఁ జేయక వెనుకటి లోఁగిటఁ బిల్లలఁ బ్రక్కనుంచుకొని పండుకొని యుండెను. "చప్పుడు లేకుండుటచే నందఱు నిద్రించియుందురు. కనుక నిపుడు వెళ్ళి భార్యతో మాటాడెద" నని తిన్నగా మనసు కుదుట పరచుకొని పట్టాభిరామయ్య కాలు చప్పుడుకాకుండ దొంగవానివలెఁ దిన్నగా దిగివచ్చి, శోభావతి శయనించియున్న మంచమునొద్ద నిలువఁబడెను. చాలసేపు శ్రమపడుచుండి యప్పుడే కనుమూసి నందున, నతని రాకను శోభావతి యెఱుఁగదయ్యెను.

సౌమ్యులక్ష్మి ప్రహరించి నప్పుడును, తనయక్కగారి తాకినపుడును, గుపితుఁడై ముందు దీపము నలిపివేయుచుండిన వాఁడు కావున, నచట వెలుగుచుండు దీపకాంతిని మించుచున్న యామె ముఖకాంతినిఁ జూచిఁ తనలో, "నాహా! పూర్ణచంద్రుని ధిక్కరించు నీమోము నాపాపపుఁ గనుల నిదివఱకుఁ జూడనైతిఁ గదా! వ్యాధిచే శరీరమెల్లను శుష్కించి యుండునప్పుడు నింత శోభించుచున్న నీమోము, సహజమున నెట్లు వెలుగుచుండెనో చూచి నోచుకొననైతిఁ గదా!" యని చింతించి యామెకు మెలఁకువ కలుగువఱకుండి క్షేమము నడుగఁ దలఁచెఁ గాని, తా నిన్నాళ్లు మక్కువతో మాటలాడ యెఱుఁగనందున, ముందేమి యడుగవలయుననియు, నెవరైన వచ్చి చూచెదరనియు జంకి మరల మిద్దెమీఁదికి వెళ్ళి మంచముపైఁ బరుండి నిదురపట్టక శోభావతి సౌందర్యమును, దా నిదివఱ కామెను బెట్టిన

హింసలును, నామెకుఁగల యోర్పును, దనయందుఁగల భక్తియు, నభిమానమును, దలఁచి, తలఁచి "హా! సుగుణసుందరీ! సుభద్రమ్మ చెప్పుటలో నిఁక నీవీ లోకమునం దుండునట్లు తోఁచదు. ఇట్టి సుందరితో సంసారమనుభవించుట కిచ్ఛ పుట్టనికారణముననే నాకీ దురవస్థ కలిగినదా! సౌందర్యరాశీ! నీదర్శనముఁ జేయుచుండిన నాఁకలియు నిద్రయుఁగూడఁ దోఁచదుకదా! ఆహా! మూఢుఁడనై యింద్రలోక సుఖమువంటి నీతోడి సుఖముననుభవింపక నలుగురిలోఁ జెవటి వనిపించుకొని, యిహపరములరెంటను జెడితినికదా! నీ మృదువైన తేనెలొలుకు మాటల నందఁ గనుకొనుచుండ నా పాపపుఁ జెవుల వినుటకైన భాగ్యములేనివాఁడనైతినా! నిను బ్రియముతో నేలుకొని యుండిన నీవెట్లుపచరింతువో! ఎట్టి యమృతవాక్యములచే నను దని యింతువో కదా!" అని యిట్లు నానా విధములఁ జింతించుచు నా రే యెల్లనుఁ గడపెను.

పట్టాభిరాముని వలన నేరములేదు. లోకమునం దెట్టివారికిని కర్మాధీనమువలన నొకొక్కదానియందు బుద్ధిలోపనుగుట సహజమె కాని, యెట్టిబాములకైన సిల్లాంద్రు, శోభావతివలె నోర్పుఁగలిగి యుండుట యేయరుదు. మఱుసటిదినము మధ్యాహ్నము బయటనుండివచ్చి స్నానభోజనములయందు బుద్ధిపోక, కొంతసేపు యోజించుకొనుచుఁ గూర్చుండి యుండదఱఁ బనులమీఁద నున్నప్పుడు, పట్టాభిరాముఁడు భార్యయొద్ద కరిగి, యేమి చెప్పుటకు దోఁచక నిలిచియుండెను.

పెనిమిటి కేదేని గావలసియుండి, తనకు వెళ్లనోపిక లేనందున నతఁడే వచ్చెననియు, నీవిధమునైన భర్తృదర్శనము తనకు లభించినందులకుఁ దనలో సంతసించుచు, శోభావతి లేచుటకై మెల్లగాఁ దల పైకెత్తెను. పాపము! లేవ శక్తిలేక తనదురదృష్టమునుదలఁచి దీనాననయై, కంటనీరువిడుచుచు, ముకుళితహస్తయై, హీనస్వరముతోఁ

బెదవులుఁ దడపుకొనుచు "ప్రాణనాథా! నాకీవేళ సుదినము కావున నీమహాపాపియందు దయయుంచి తమ దర్శన మొసంగినందునఁ గృతార్థురాలనైతిని. నాయందిదివఱకుఁ గల తప్పులనెల్ల మన్నించి రక్షింపవేడదను ఏలినవారి మన్నన లేకున్న నాకుఁ బరమందును సద్గతి లేదుకదా! మీ కేదేని యవసర ముండిన నడిగినదాని నిచ్చుటకు సిద్ధముగ నున్నాను. నాతల్లికిఁ దెలియఁబోయెదనని మనసున నెంచవలదు. ఎవరైన నడిగినఁ బరువని తీసి దాఁచితినని చెప్పెదను. అందులకై మీరు యోజింపఁబనిలేదు." అని వినయవిధేయురాలై చిలుకవలెఁ బలుకు భార్యమాటలకు మనసు కరఁగి కనులవెంబడిఁ గారుచున్నదో యనునట్లు జలజల బాష్పములఁ గురియించుచుఁ జిత్రాభిరాముఁడు దనలో, "ఆహా! నీసుగుణముల నేమని వర్ణింతును. నా దుర్గుణముల నేమని నిందింతును! ఇట్టి సుగుణఖనియగు సుందరినిగూడి సకలభోగముల ననుభవింపక, భాగ్యహీనుఁడనై "లభించిన రత్నమును బోగొట్టుకొన్న వెనుక జాగ్రతగలిగినట్లు" నీమె కైలాసప్రయాణమున కెదురు చూచుచుండ నిపుడు వెఱ్ఱివానివలెఁ జింతించిన నేమి ప్రయోజన" మనుకొని, ప్రకాశముగా సాధ్వీమణీ! నీవెట్లు పాపినగుదువు? నీ సుగుణములు నా వంతేనిఁ జింతింపక మహాక్రూరుఁడనై యుండిన యీపాపిని మన్నింపవలసినదానవు నీవే కాని, నేను కానని దుఃఖ మాపలేక ముఖమునకుఁ జేయి యడ్డముఁబెట్టుకొని చింతింపఁ దొడఁగెను.

సతీమణు లెన్నికష్టములకైన నోర్తురుకాని, పతి దుఃఖమును జూచి యోర్వఁగలరా? దుఃఖించుచున్న పెనిమిటిని జూడలేక శోభావతి యతని చేతులందీసి తనముఖమునఁ జేర్చుకొని, "జీవితేశ్వరా! మీరేమి చేయుదురు నాకుఁజాలని గ్రహములు మీ మనసునఁ జొచ్చి యుండెను కాని, దయార్ద్రహృదయులగు మీవలనఁ దప్పులేదు. కడచినదాని గురించి చింతించినఁ బ్రయోజనమేమి? నేనిచ్చి పెట్టిన

దింతే. అందులకు మీరేమి చేయఁగలరు? నా యంత్యమునందైనను గరుణించి మన్నన యొసఁగిన నే ధన్యురాలనై, వెళ్లినప్పుడైనను సంతోషమున వెళ్లెద''నని, చిఱునవ్వుతోఁ జెప్పెను.

సతిమాటలు మఱియంతదనను లెఁగలఁచుచుండఁ బట్టాభిరాముఁడు "సతీ తిలకమా! రూపమునందును, గుణమునందును, నీపేరును సార్థకముఁజేసికొంటివి. నే నన్నతో, నీయందుఁ గఠినుఁడనై, నీవారి నెల్ల దుఃఖములోముంచి నీయుసురుఁబోసికొని పాపముఁగట్టుకొంటిని శునకమునకుఁ గొబ్బరికాయ యబ్బినట్లు, నీవు నాకబ్బక వెళ్లుచున్నావు. పూర్వజన్మకృతపుణ్యము ననివంటి సతి లభించియు ననుభవింపనిచ్చ పుట్టకున్నదేకాక, లోకనిందితుఁడనై చిరకాలము బ్రదుకనున్నాను. నా చక్కెరబొమ్మా! నీ దీనాలాపములు నాదుఃఖము నినుమడింపఁజేయుచున్నవి'' అని పంచముపైఁ దలవాల్చి కన్నీరు కాలువలు గట్టించుచుండెను.

శోభావతి రెండుచేతులతోఁ బెనిమిటి తలపైకెత్తి తన చెరుగుతో నతనికనులుదుడిచి "నాధా! మీ దయారసము మీశోకమున నే తెలియుచున్నది. ఏలయిట్లు వగచెదరు. మీపరితాపము చేజూడలేను. జరగిపోయినవన్నియు నిఁకఁ దలఁపవల''నితనప్పై యూనఁబెట్టెను. పట్టాభిరాముఁడు దుఃఖము నణఁచుకొని యొకమచేత భార్యగడ్డమును బట్టుకొని, కుడిచేత నామె శరీరమును నడవుచు, "నాధుశీలా! నేఁజేసిన దుష్కార్యములకు నిన్నడుగుటకైన ముఖములేక లజ్జించుచున్నాఁడ''నని గుటకలుమ్రింగుచు గద్గద కంఠముతో "నిజబ్బెట్లున్నది!'' అని యడుగ శోభావతి చిఱునగవు దన ముఖమున కలంకారమొసఁగుచుండ, "మనోనాయకా! మీ కరుణాకటాక్షములు నా పై బ్రసరింపఁజేసిన వెనుక నాకిఁక జబ్బెక్కడిది? ఇఁక

నావంటి ధన్యురాలీ ముల్లోకముల నుండఁబోదు. ఇదివరకు మా తండ్రిగారి నిర్బంధమువలన నౌషధములు దినుచుంటిని కాని, బ్రతికి యుండవలయునన్న యాస యించుకంతయు లేకుండెను. ఇప్పటి నా కోరిక జబ్బుకుదిరి చిరకాలము మా యనుఁగుఁదమ్ములఁ గొలువవల యునని యున్నది. కరుణాకటాక్షుఁడును, గామితార్థఫలప్రదాయకుఁ డును నగు భగవంతునికి వందనము లొనర్చెద"నని యంజలిఁ బట్టెను.

ఆ సుగుణవతి యొక్క మృదుభాషణములకుఁ బట్టాభిరా ముఁడు చిఱునగవుతో నామె చెంపలు దువ్వుచు, "నీవంటి పరమ పావని కోరిక యీశ్వరుఁడు సఫలముఁ జేయకున్నఁ దనకీర్తికిఁ గళంక ముఁ దెచ్చుకొనును. కావున నట్లే కరుణించు"నని పతికిఁ దనపైఁ గలిగిన యనుగ్రహమునకు శోభావతి పరమానందభరితయై వికసించిన తామరవంటి తన ముఖముయొక్క దర్శనము కనిమిటికిఁ గనులపండువు చేయుచుండ, నతని హస్తమును బట్టుకొని "యువన్ని యుండవింకు. మా కింకను భోజనము లేనట్లున్నదే" యనెను.

పట్టాభిరాముఁడు—నా ప్రాణపదమా! నీ యమృతవాక్యములచే నాయాఁకలి దీఱినది. నిను జూడవలెనన్న కోరికతో మూఁడు దినములనుండియు, సమయము వేచియుంటిని. మా తల్లి సదా నీయొద్ద నుండుటచే నాకు వీలుపడలేదు. రాత్రి యందఱు నిద్రించిన వెనుక నిటకు వచ్చియుంటిని కాని. నీవు కనుమోడ్చి యున్నందున నీసుదర్శనమున నానేత్రముల సఫలత నొందించుకొని వెళ్ళితిని.

శోభావతి—ఎవరున్న నేమి? మనము చిన్నపిల్లలమా? అందఱును మన ముచ్చటఁ గోరువారే కదా?

పట్టాభిరాముఁడు—ప్రియురాలా! చిన్నమ్మ పరితాపమును, నామె సుబోధనయే నను గ్లెక్కించినది.

శోభావతి—నాథా! మీముఖము వాడఁబాఱియున్నది. గంటలుపండ్రెండునకుఁ బైఁబడినట్లున్నది. మీరు భోజనముఁ జేసిరండు.

పట్టాభిరాముఁడు—[దీనవదనుఁడై శోభావతి గడ్డముపట్టుకొని] నాపాలిటి పెన్నిధీ! ఇదివరకు నేను జేసినదికాక, నిన్నింతకుఁ దెచ్చితిని. ఇఁక నీదీనుని ప్రార్థన మంగీకరించి యౌషధసేవఁజేసి నీ వ్యాధిని బోఁగొట్టుకొని, యారోగ్యవతివి కమ్ము [అని బ్రతిమాలుకొని స్నానముఁ జేయుటకు వెళ్లెను.]

ఆవలి గదియొక్క గవాక్షి చెంత నిలిచి వీరి సంభాషణ వినుచుండిన మీనాక్షి ముసిముసినగవులతోఁ బరుగునవచ్చి తోడికోడలి చేయిఁబట్టుకొని, "యక్కయ్యా! భగవంతుఁడు నీమొఱ నాలకించి నీకోరిక సఫలముఁ జేసెనా? ఇఁక జబ్బు కుదురుట కేమాత్రము సంశయము లే"దని పరమానందముతో వికవిక నవ్వెను.

శోభావతి—[మీనాక్షి చేయి పట్టుకొని] చెల్లీ! నీ కెట్లు తెలియును?

మీనాక్షి—మా. బావగా రీగదికి వచ్చినదిచూచి మునుపటి వన్ని జ్ఞప్తికివచ్చి, నాగుండెలో దిగులువుట్టి నేను గవాక్షముచెంత నిలుచుంటిని. పార్వతీదేవి యనుగ్రహముచే నే ననుకొన్నట్లుకాక, మీ ముచ్చటలు నా చెవిని బడఁగనే నే నానందమును బట్టలేక పెద్దమ్మగారికిని జిన్నత్తగారికిని జెప్పి బావగా రీవలకురాఁగనే నీసంతోషముఖమును జూడవచ్చితిని.

శోభావతి—నీవాక్కమృతవాక్కే.

మీనాక్షి—అదెట్లు?

శోభావతి—నీజబ్బు రేపే కుదురునని నాలుగు దినముల నాఁడు నీవనలేదటే?

మీనాక్షి—పోనిమ్ము. 'మట్టిపిల్లి యైనను, నెలుకను బట్టుటయే చాలును' అనునట్లైనరి వాక్యమైనను, నీజబ్బు కుదిరి మేలుకలుగుటయే నా కోరిక.

పట్టాభిరాముఁడు స్నానముఁ జేసి భోజనమునకువచ్చెను సుభద్రమ్మ కుమారునికి వడ్డించుచు నతనికి సద్బుద్ధికలిగినందున కానందముఁ బట్టలేక పట్టాభిరాముని యిప్పుడు జూచుచుఁ, "దండ్రీ! నాముద్దులయ్యా! నా నేత్రముల సఫలత నొందించితివిరా! ఈ చింతవలననే కదా నాబంగరుబొమ్మ మంచముఁ బట్టినది! భగవంతుని దయవలన నిఁకె నానాఁడు గుణముఖమగుననుకొనెద" నని యానందబాష్పముల నొలికించెను.

పట్టాభిరాముఁడు—ఓయమ్మా! సుఖ దుఃఖములు శాశ్వతములు గావు. భగవంతుఁ డెల్లకాలము దుఃఖమునే యనుభవింపఁ జేసిన భరించువా రెవరు? కాఁబట్టి కాలవశకల్పముచే జరగిన దాని కేమి చేయఁగలము?

సుభద్రమ్మ—నాయనా! నీవు చదువుకొన్నవాఁడవు. నీకు నేనేమి చెప్పఁగలను? గుణములకుప్పయగు పిల్ల నిట్లటమటఁ జేసినందులకు నీ కొడుకు చెడ్డవాఁడను నపవాదము వినలేక నా చెవులు కూట్లు పడుచుండెను. ఎట్లైనఁ గానిమ్ము, రత్నమువంటి పిల్ల బ్రతికి చల్లగానున్న నంతియే చాలును [అని కన్నుల నీరు పెట్టుకొనెను.]

పట్టాభిరాముఁడు—తెలివిలేక జరిగినవి పోనిమ్ము. నీ సుబోధకులచే నను దారికిఁ దెచ్చినట్లు, నీకోడలికి ధైర్యముఁ జెప్పి యారోగ్యవతిని జేయుట నీ భారము. తరువాత నా యదృష్టము [అని కంట నీరుపెట్టుకొని లేచి వెళ్లెను.]

మీనాక్షి కల్యాణిని బలవంతపఱచి తీసికొనివచ్చి, చిన్నత్త

గారికిని, కల్యాణికిని భోజనములు వడ్డించెను. కల్యాణి భోజనముఁ జేయుచు "వదినెగారూ! మీ కుమారుఁ డేమో చెప్పుచుండెను! పిల్ల వాని రోదనముచే నాకు వినఁబడలేదు" అని యడుగ సుభద్రమ్మ "ఏమున్నది? కాలవశంబునఁ దాను దెలివిలేక నడచుకొన్నందుకుఁ జింతఁబడుచుండె" ననెను. కల్యాణి జలజలకన్నీళ్లు కార్చుచు, "హా తల్లీ! యీ పాపికడుపునఁబుట్టి నీవు సుఖమెఱుఁగకుంటివి. నీయంత్యమున నీ మగనికి దయ పుట్టెనా! నాబంగరుబొమ్మా!" యని గోలను జేరఁ గిలఁబడి వెక్కి వెక్కి యేడ్వఁజొచ్చెను.

సుభద్రమ్మ చేయిఁ కడుగుకొనివచ్చి కన్నులు దుడిచి, "వదినా! మీ కేమి వెఱ్ఱి! పిల్ల మీ కంఠము వినిన దిగులుఁ జెందదా! దానిజబ్బు రేపే నయమగును. మా యమ్మవుగా, ఊరకుండు" మని గడ్డముఁ బట్టుకొని ప్రతిమాలుకొనెను. కల్యాణి పొంగి పొరలివచ్చెడి దుఃఖముతో "వదినెగారూ! కుంటి, కురూపియై పుట్టినను, దెలివిలేక యున్నను, బాగుగ నుండునేమో యనియు, రత్నమువంటి పిల్లను గని దాని యందమును సుగుణములను జూచి మగపిల్లలు పుట్టలేదన్న చింతగూడ లేక కీర్తిఁ దెచ్చిన యీఁడుబిడ్డయే చాలుననియు నుంటిని దాని జీవితము దుఃఖముతో జరుపుకొన్నదే కాని, లోకసుఖ మావంతయైన నెఱుఁగదుకదా? నాకనులలోఁ గంపఁగొట్టినట్లు,సం దిల్లుగూడఁ గటిగిపోయిన నాబిడ్డ యింక బ్రతుకుట సంభవించునా!" యని వాపోవుచుండెను,

అంతట మీనాక్షి పరుగునవచ్చి పెద్దమ్మా! అక్కయ్య నీకంఠమువిని దిగులుపడి ముఖముఁ జిన్నఁబుచ్చుకొనినది. మా యమ్మా! నీ పున్నెము. ఊరకుండుము. శ్రీకంఠయ్యగారన్నది నీవు వినలేదా? ఇఁకమీఁద గురువు మంచివాఁడగుటవలన, వ్యాధి గుణముఖమగు

ననియుఁ, బిల్లవాఁడు పుట్టిన యదృష్టమున మనోల్లాసము కలుగుననియుఁ జెప్పిరికదా? అందులకు నిదర్శనము నేఁడు జరిగినది. చూచుకొమ్ము. లేచిరమ్ము అక్కయ్య పిలుచుచున్న"దని చేయిపట్టి లేవఁదీసెను. కల్యాణి లేచి చేయికడుగుకొని, కన్నులు దుడుచుకొని, చిన్నబిడ్డ నెత్తుకొని, శోభావతియొద్ద కరిగెను.

మఱునాడు రాత్రి పట్టాభిరాముఁడు భోజనముఁ జేయుచు "శోభావతి కెట్లున్నది?" యని తల్లి నడిగెను. అంధుఁడైయున్న బిడ్డ కనులు దెరచినట్లును, మూఁగబిడ్డ 'యమ్మా' యని పిలిచినట్లును, సుభద్రమ్మ పట్టరానిసంతోషము నప్పుడు కలుగ, కొడుకుని చెంపలు దువ్వి, "నాయనా నా బంగారు కొడుకా! పరమేశ్వరుని దయవలన నీగుణము కుదిరినపుడు దానిజబ్బు కుదురుటకేమి? తండ్రీ! నిన్నటికంటె నీవేళ దగ్గు చాల తగ్గినది. రాత్రి చక్కగ నిదురపట్టెను. పిల్లవానిని దాఁకె రెండుమాసములైనది, నేఁడు మధ్యాహ్నము తల్లియొద్దనున్న బిడ్డను దనప్రక్కలోఁ బరుండఁబెట్టుకొని చాలసేపు ముద్దులాడుకొనుచుండెను, నీవు వెళ్ళి చూచెరాదా?" యనెను.

పట్టాభిరాముఁడు చేతులుగడుగుకొని, శోభావతి యున్నగదికి వెళ్ళుచుండె, హేమవల్లి తండ్రియని యెఱుఁగక నిదురకనులతో నేడ్చుచుఁ 'దాతయ్యా!' యని పంచె పట్టుకొని యడ్డము నిలుచుండెను. అంతఁ బట్టాభిరాముఁడు కూతురి నెత్తుకొని కనులు దుడుచుచు. "అమ్మా! నేను తాతయ్యను కానే, తాతయ్య గదిలోఁ బండుకొని యున్నా"రని లోపలికి వెళ్ళెను. వనజ నల్లగా నిచటనుండుటఁ జూచి పిల్లనచట విడచి, తరువాత రావచ్చుననుకొని తన్ను గట్టెక్కించిన వేశ్యాసుశీల దనకష్టముఁ జెప్పుకొనవలఁచి రాగమంజరి యింటికి వెళ్ళెను.

రాగమంజరి—[పట్టాభిరామునిఁ జూచి] అయ్యగారూ! పది దినముల నుండియు వాడుఁబాఱియున్న మోము నేఁ డుల్లాసమునఁ గనఁబడుచున్న దేమి?

పట్టాభిరాముఁడు—[చిఱునవ్వుతో] ప్రియురాలా! నీవు నన్ను పరిహాసముఁ జేయుచున్నావు కదా?

రాగమంజరి—అది యుండనిండు. మీ యిల్లాలికి జబ్బెట్లున్నది?

పట్టాభిరాముఁడు—నిన్నటిదినము వైద్యుఁడు చూచి వ్యాధి కొంత తిరిగినట్లున్నదని చెప్పినట్లు మా పినతల్లి చెప్పెను. దానికి నిదర్శనముగ నింట నందఱు ముఖవికాసముఁ గలిగియున్నారు.

రాగమంజరి—అయ్యా! అందఱిముఖములు చూచితిరి కాని, మీ సతిమోముఁ జూడలేదుకదా!

పట్టాభిరాముఁడు—ప్రియురాలా! మంత్రివలె సదుపదేశముఁ జేయు నీమాటఁ ద్రోసిపుచ్చుదునా? ఒకదినము రాత్రి నాభార్యనుజూచి మాటలాడవలయునన్న కోరికతో నది యున్న గదిలోనికి వెళ్ళితిని కాని, దగ్గుచే చాలసేపు శ్రమ పడుచుండి యపుడే కనుమోడ్చి నందున నొంతసేపు నిలువఁబడియుండి యీవలకు వచ్చితిని,

రాగమంజరి— [చిఱాకుతో] చాలు మీ మాటలు. దీనికి లగ్నము కావలయునా? అపుడు కాకున్న, లేచిన తరువాతఁ జూడఁ గూడదా!

పట్టాభిరాముఁడు—దానితల్లి యెప్పుడును దగ్గఱనేయుండును, ఆమె పిల్లల నోదార్చునపుడు నా తమ్మునిభార్య యక్కడనే యుండును. కాఁబట్టి పిలువఁబడుటలేదు.

రాగమంజరి—ఎవరున్న నేమి! క్రొత్త పెండ్లికొమరులా?

పట్టాభిరాముఁడు "సుగుణవతీ! నా పైఁ గోపపడకుము నీమాటచొప్పుననే ధైర్యముఁ దెచ్చుకొని, మఱుదినము మధ్యాహ్నము దగ్గఱకుఁబోయి నిలువఁబడఁగా నదియన్నుఁజూచి, తాను మహాపాపియని యు, నేను నాశ్నంవలయుననియుఁ బ్రార్థించి కన్నీరు విడచెనని చెప్పుచు, నశ్రుపూరిత నయనుఁడై, "రాగమంజరీ! వేశ్యల నెందరినో చూచితిని కాని, నామేలుకోరకే భగవంతుఁడు నీ చెలిమిఁ జేయించె ననుకొనదను లోకులవలెఁగాక నీవు గుణవతివై నా శ్రేయముఁగోరి నాకు సదుపదేశముఁజేసిన ప్రియురాలికి నా తప్పులఁ జెప్పుకొన్న నా పాపము కొంత శమించును కదా!" యని, కనకరత్నముతోఁ జెలిమి చేయుటయు, తరువాత నాలుమాసములకు భార్య తన యింటికి వచ్చుటయు, నది మొదలు చీఁకటిలో దొంగవానివలె నామె పైఁబడి ప్రహరించి శరీరమునందలి నగ లొకటొకటిగఁ బెఱికి వేశ్యలకిచ్చుటయు, మొదలగు సర్వమును జెప్పి, "మూలాలిని నట్టడవిలో నత్తిఁ బగులఁగొట్టి విడచివచ్చితి" నని తరువాతఁ జెప్పలేక, ముఖమునకు వస్త్ర మడ్డముగఁ గొని యేడ్వసాగెను.

రాగమంజరి యామాట విని కన్నీరు విడుచుచు, "రామరామ! ఎంతపాపమునకు సాహసించితిరి?" అని రెండుచేతులతో చెవులుమూసి కొని, "అయ్యా! మీ మనసిట్టి క్రూరకృత్యమున కెట్లు లోఁబడెను? పోనిండు తరువాత నేమిజరిగినది?" యని యడిగెను

పట్టాభిరాముఁడు దుఃఖముచే మాటాడలేక కొంతసేపూరకుండి తరువాత గద్గదకంఠముతో నిట్లనియె! "నాకేమి చెడుకాలమో కాని, కనికరమనునది తోఁచకుండెను. నేనా పతివ్రతను బెట్టిన కష్ట మప్పుడే యనుభవించితి" ననెను

రాగమంజరి—అదియెట్లు!

పట్టాభిరాముఁడు—"కామాతురాణాం నభయం నలజ్జా" యనునట్లు వేశ్యలవలపులోఁదగిలి. లోకులు పరిహాసింతురని యైనను లేక, యుద్యోగమేదియుఁ జూచుకొనక, 'యిదియే యింద్రభోగ'మని యెంచి, భార్యను గొట్టితెచ్చిననాఁడు ముచ్చట లనుభవించుచు, దేనినాఁడు పౌఱకదెబ్బలు దినుచుండియుఁ, దెలివిలేక తుదకా సాధ్వీమణి ముక్కున మెఱయుచుండిన పుడకలుదీసి, స్వర్ణాంబ కియ్యఁదలఁచి, యింట నూడఁబెఱికికొనుటకుఁ దండ్రికిని, బినతల్లికిని వెఱచి, యేవో బొంకులు బొంకి, యాసతిని తీసికొనిపోయి నట్టడవిని రాతితో తలఁ బగులఁగొట్టి, పుస్తెతోఁగూడఁ బెఱికితెచ్చుచుండఁ జీకటిలో చోరులు సంధించి నాయెముకలు విఱుగఁదన్ని పైగుడ్డలతోఁగూడ దోఁచుకొనిరి.

రాగమంజరి—తరువాత నామెగతి యేమైనది?

పట్టాభిరాముఁడు—ఏమైనదియు నే నెఱుఁగను కాని, నెత్తిగాయముతో దెలివిఁదప్పి పడియున్న కూతురి నొక కోమటి దన యిలుఁ జేర్చినట్లును, నామెకు దెలివి వచ్చినతరువాత నడుగగ నుద్యోగమునకై మేమిద్దరము రైలులో వెళ్లుచుండగా, దారిలోఁ దనకుఁగడుపుబ్బి దిగినట్లును, వచ్చునంతలో రైలు వెళ్ళినట్లును, నచటివారి నడిగి, యాయూరు కుంభకోణమని తెలిసి పుట్టింటికివెళ్లుచుండ రాత్రివేళ కావున దారిలో దొంగలు వెంటఁబడి తనకు సాహాయ్యముగ వచ్చిన స్త్రీని వెళ్ళఁగొట్టి తన్ను రాతితోఁ గొట్టినట్లును తరువాతఁ దన కేమియుఁ దెలియదనియుఁ జెప్పినట్లు దానితండ్రి మాతండ్రి కుత్తరము వ్రాసెను.

రాగమంజరి—[ముక్కుపై వ్రేలుఁ జేర్చుకొని,] ఆహా! నీవు నపుంసకుండవు కావు! జాతిబొమ్మవుఁ గావు! చెప్పిన ట్లామెచేడుకా

లము నిన్నిట్లు చేయించినది; అయ్యో! నిన్నేమన్నను నాకోపము తీఱదు బ్రాహ్మణుఁడవని యోర్చుకొనుచున్నాను, నీవింత చేసియు నామె నీయందభిమానము వదలినది కాదుకదా? ఇంకొక పశువైనఁ దానొకబిడ్డయైన గోమునఁ జెఱిగినదయ్యో, నీవు చేసిన క్రూరమునకు నిట్టి మగఁడు లేకున్నమానెనని, నిను దూలనాడి పుట్టింటఁ బడియుండదా! ఈఘాతుక కృత్యములువిన్న గోడ్రాలనైనను నాకడుపు దహించుచున్నదే! ఏకపుత్రిగల తలిదండ్రు లెటు పొక్కిరో కదా? తరువాత నేమైనది?

పట్టాభిరాముఁడు కన్నుల బాష్పములు రాలుచుండఁగా "ప్రియమణీ! నే నేమని చెప్పుదును? గాఢాంధకారమునఁ బడియుండి యిప్పుడు నాకు దాని సుగుణసౌందర్యము లగుపడకుండెనే కాని, యిపుడు నా యంతరాత్మ యేనను ఛీకొట్టుచున్నది. నేను నట్టడవిని విడిచివచ్చి తన పుట్టింటఁ జేరి పిల్లనుగన్నతర్వాతఁ దనతండ్రిని తొందరపెట్టి మాతండ్రికి జాబు వ్రాయించినదఁట! అపుడు మాతండ్రి మాదివత్తమని వెళ్ళియుండఁ దానుగూడవచ్చెదనని దీనవచనముతో బ్రతిమాలుకొనెనఁట! ఇరువది దినముల నాఁడీసంగతిని మా పినతల్లితోఁ జెప్పి మా తండ్రి చింతించుచుండెను. ఇట్టి సౌందర్యసుగుణనిధియగు భాగ్య యుండియు, నే నంధకారకూపమునఁ బడియుంటినికదా" అనుచుఁ బ్రతిమాటకును నశ్రుధారల నొలికించుచుండెను.

అతని శోకపశ్చాత్తాపములను జూచి రాగమంజరికి మనసు నీరై యింక నితని శోకమ్ము నడఁచి, యోదార్చవలయునని యెంచి, "యయ్యో! కడచినదానికై యేల యిట్లు కన్నీరుమున్నీరుగాఁ జింతించెదరు? మనయత్న మేమున్నది: దైవనిర్ణయమునకు మనమేమి చేయఁగలము! ఎట్టివారికిని కాలవైపరీత్యమువలన బుద్ధిభ్రంశము గలుగును.

ఇఁకఁ జింత వదలుఁడు. జరుగవలసిన దానినిగుఱించి యోజింపుఁడు. అదేమియన,మీ ప్రేమచే నాయభిమానవతిని నారోగ్యవతిని చేసి ముచ్చటల ముఱియించుచు,నానందాబ్ధి నోలలాడింప వలయును.ఉత్తమస్త్రీల కంతకంటెఁ గావలసిన దేమున్నది?" యని యుద్బోధించెను.

ఆమె మాటలచేఁ బట్టాభిరాముఁడు కొంతచింతమాని,కనులు దుడుచుకొనుచుఁ "బిడ్డ పుట్టిన సంవత్సరమునకు మాతమ్ముఁడు వెళ్ళి పిలిచికొనివచ్చెను మరల నాకు మునుపటి దురాలోచనలు కలిగెను. కాని, యట్లు చేయకుండునట్లు మా పినతల్లి యొట్టుఁ బెట్టించుకొను టచే, నిఁక నట్లుచేసిన మా తండ్రి ముచ్చెలోఁగొట్టి వెళ్ళఁగొట్టునని యుఁ,నేఁ జెడ్డవాఁడనగుటచే మాతమ్ముఁడుగూడ ధైర్యమున నాపైఁ దిరుగఁబడి యున్నందునను ధైర్యముచాలక మునుపటి దుష్టచర్య మానుకొంటిని కాని,యొకనాఁడైనను పూర్ణచంద్రునివంటి దానిముఖమును జూచి చల్లగామాటలాడినవాఁడనుకాను. దానితండ్రి దానికిఁ మాసమునకుఁ బదిరూపాయలు పంపుచుండెను.ఆసంగతిఁ దెలిసి దానిపెట్టెఁ దెఱచి యవియు నేనేతీసికొనుచుంటిని.ఆప్రకమే నీ కుపయోగపడుచు వచ్చినది.

రాగమంజరి—[తల యూపుచు] ఆమెను జూచుకున్నఁ బిడ్డ లెట్లు పుట్టిరి?

పట్టాభిరాముఁడు—కనకరత్నమునకుఁ బ్రైకమిచ్చుటకు లేకుండఁగా "నీ యాలి సొమ్ములు తెచ్చిపెట్టుమని బాధించుచుండ రెండు, మూఁడు మాఱులు చీఁకటిలోఁగొంత సేపు దానియొద్దనుండి,తరువాత దానిని బ్రహరించి,సొమ్ముఁ బెఱుకుకొనుచుంటిని.పిల్ల పుట్టిన రెండు సంవత్సరములకుఁదరువాతఁగోమటివీధియందున్న రూపావతియింటికి వెళ్లుచుండినపుడు నరేశ్వరిని దర్శనార్థమై యపుడపుడారూపావతి చిదంబర

మునకు వెళ్లుచుండగ, విధిలేక చీఁకటిలో దొంగవానివలెఁ దాఁకఁ గలిగితిని.

రాగమంజరి—[కోపముతోఁ గూడిన యాశ్చర్యము నొంది] అయ్యా! మీవేవ మిఁకఁ జాలింపుఁడు నాకా పతివ్రతా శిరోమణిని దర్శనముఁ జేసికొనవలెనని మిగుల నభిలాష యున్నది. మీ యుత్తరువు లేక రాఁగూడదని యూరకున్నాను.

పట్టాభిరాముఁడు—నీవు వచ్చిన మావా రూరకుందురా!

రాగమంజరి—ఉంటె కేమందురు? తెలిసిన వారని చెప్పఁగూడదా? అంతటిమాట యటులుండనిండు, పార్వతీదేవివంటి యా మహాతల్లి వినిన నాయం దభిమాన ముంచునే కాని, యసూయపడదు.

పట్టాభిరాముఁడు "అట్లయిన ముందు నీ మాట నాభార్యతోఁ జెప్పి తరువాత నేదియుఁ జెప్పెద"నని కొంచెము సేపు మౌనముతోఁ గూర్చుండి, "ప్రియావతంసమా? మూఁడుజాములైనది నేఁ బోయి వచ్చెద"నని చెప్పి వెళ్లెను.

శోభావతికి జ్వరము నానాఁడు తగ్గుచు వచ్చుచుండెను. రాత్రులందు కొంచెము దగ్గుమాత్ర ముండెను కాని, పగలు బొత్తిగా నదియు లేకుండెను. ఒకదినము మధ్యాహ్నపువేళ నామె తిన్నగా లేచి తలగడ నానుకొని కూర్చొని మధుసూధనుని దగ్గఱ నుంచుకొని ముద్దులాడుకొనుచుండెను. పట్టాభిరాముఁడు భోజనముఁ జేయుచుండ హేమవల్లి యేడ్చుచువచ్చి, తండ్రి వీపునఁబడి. 'తాతయ్యా! నాపప్పులు అత్తయ్య తీసికొన్నది, నీ విప్పింపు' మని భోజనముఁ జేయనియ్యక తొందఱఁ బెట్టుచుండెను సుభద్రమ్మ. "యోసీ! పిచ్చిపిల్లా! నాన్నగారుకదా? తాతయ్యయనుచుంటివి?" అని కొమార్తనుజూచి, "నీవెన్నఁడైన దగ్గఱ తీసియుండినఁ దండ్రియని యెఱుఁగును, నాయనా! నీవు

వెళ్ళి దానితగవుఁ దీర్పు''మని చెప్పెను,

పట్టాభిరాముఁడు చేతులు కడుగుకొని కూఁతును జంకఁబెట్టుకొని భార్యయున్న గదిలోనికి వచ్చెను. పిల్లను దీసికొని వచ్చుచున్న యల్లునిరాకఁజూచి కల్యాణి తనలోఁబొంగుచు సేవలకు వచ్చెను. బిడ్డ నెత్తుకొని తన్నుఁ జూడవచ్చిన పెనిమిటిని జూచి శోభావతికిఁ గలిగిన యానందమును, జదువరు లూహించుకొనవలయునే కాని చెప్పుటకు సాధ్యముకాదు.

సుభద్రమ్మ చేతఁ దాంబూలముఁదీసికొని కొడుకును వెదకుచు వచ్చి,వియ్యఁపురాలి ముఖవికాసమువలనఁ గనుగొన్నదై కోడలున్న గదిలోనికివచ్చి పట్టాభిరామునిచేతికిఁ దాంబూలమిచ్చి చిఱునవ్వుతో, "నాయనా! నాకు నేత్రోత్సవముఁ జేసితివిరా'' యని చెక్కిలి దువ్వి, దృష్టిఁదీసి, తనదృష్టి తాకునేమో యని లోపలికి వెళ్ళి, యెడమచేత నుప్పుఁ దీసికొనివచ్చి దారాపుత్రాదులతో నున్న కుమారునకు దిగఁదుడిచి వెళ్లెను

పట్టాభిరాముఁడు కనులపండువుగ భార్యనుజూచుచు, నడుమ నడుమ హేమవల్లితో ముచ్చటలాడుచు, మధుసూధనుని ముద్దులాడుచుఁ జిఱునవ్వుతో "ప్రియసతీ! నేనొక సంగతిని నీతో మనవిచేసికొన వచ్చితి''ననెను. పెనిమిటియొక్క వేడికోలునకు సుగుణశీలయగు శోభావతి మనసు నీరై యతనికరముఁబట్టి తన కన్నుల నద్దుకొనుచు "ప్రాణేశ్వరా! యెన్నడును మీరట్లనవలదు. మీదాసినైనపుడు మీరు నన్నడుగుకొనవలయునదేల! ఎట్టిమాటయైనను శిరసావహింపవలసిన దాననేకాని మీ యడుగుదాఁటి నడచునంతటిదాననా!''యని చిఱునవ్వు నవ్వుచుండెను.

పట్టాభిరాముఁడు "సతీతిలకమా! నా చేటుకాలమునకుఁ నగి

నట్లు కేవలము భ్రష్టులగు వేశ్యాంగనలు నన్ను బురికొల్పుచుండిరి భగవంతునికి దయకలిగిన నిమిషములో మార్పుకలిగి, యన్నియు నను కూడివచ్చును గదా! నా చెడిన చేటంతయుఁ జెప్పి ప్రయోజనము లేదు." అని చెప్పి కట్టకడపట రాగమంజరియను వేశ్యాంగన పొరుగూరినుండి వచ్చుటయు; దానిస్నేహముఁ దాను చేయుటయు దాని సుగుణములును, దాని ప్రతినయుఁ; దాను బొంకి దాని ప్రతినఁ జెడఁగొట్టుటయు, మాసమునకు ముందఱ నా వేశ్య నిజమెఱిఁగి కోపపడుటయుఁ; దెలియమిచేఁ బతివ్రతయైన యిల్లాలి యుసురుఁ దాను పోసికొన్నందులకై మన్నింపుమని యాది దేవుని ప్రార్థించుటయుఁ; దనకు బుద్ధిఁ గఱపుటయేకాక, భార్యను జూచి యామె క్షేమము విచారింపకయే తనయింటికిరావలదని దిట్టముగా చెప్పి పెక్కునీతులు బోధించుటయు నుడివి: "ప్రాణేశ్వరీ! యామె బోధనముచే నాకు జ్ఞానోదయముగలిగి, నేను నడచుకొనినది చెడుమార్గ మని చక్కగా నెఱిఁగినవాఁడనై, యట్టిసుగుణవతియగు ప్రియురాలితో నాతప్పులు చెప్పుకొనినఁ గొంత పాపము నశించునని యెంచి, సర్వమును దాని కెఱింగించితిని. అవియన్నియు విని, మనసు చాలనొచ్చుకొనినదై, "యట్టి యొప్పుగల పతివ్రతారత్నము యొక్క దర్శనముఁ జేసిన నా పాపము శమించును. కాబట్టి నాకది లభింపఁ జేయుమని యది నన్ను తొందఱబెట్టుచున్న" దనెను.

భర్తయొక్క వృత్తాంతమునంతయు విని, శోభావతి పరమానంద భరితయై, యానందాశ్రువుల నొలికించుచుఁ బెనిమిటి గడ్డముఁ బట్టుకొని, "ప్రాణేశ్వరా! దుఃఖసాగరమున నీదులాడుచు, గతిఁగానక తపించుచున్న నన్ను భర్తృపాదములను తెప్పనెక్కించిన యాపుణ్యవతిని నేను చూచియే తీరవలయును. కావున రేపెట్లయిన రప్పింపు' మని ప్రతిమాలుకొనెను.

పట్టాభిరాముఁడు—ఆమె యెవరని మనవారడిగిన నేమి చెప్పఁ గలవు?

శోభావతి—నాథా! వేశ్య లందఱివలెఁగాక ధర్మముఁ దప్పక నడచుచు, నాకింత యుపకారమొనర్చిన యామెకై, బొంకినఁదప్పు లేదు. చిన్ననాఁడు నాతోఁగూడి చదువుకొనుచుండిన చెలిమిచే నీ యూరికి వచ్చియుండి, నా జబ్బు విని ననుఁ జూడ వచ్చెనని చెప్పెదను.

ప్రియురాలి యోజనకుఁ బట్టాభిరాముఁ డానందము నొంది యామె వీపునఁ దడవుచు నామె కనుదమ్ముల సొబగును, నధరము యొక్క ముద్దును, జూచుచుఁ దనివి దీఱక చాలసేపు ముచ్చటలాడు చుండెను.

వారము దినములనుండియుఁ గుమారుఁడు దారపుత్రాదుల పైఁ బ్రీతిగలిగి యుండుటయు, నా కారణముననే శోభావతికి జబ్బు నానాటఁ దేలికయగుచుండుటయు సుభద్రమ్మవలనఁ దెలిసి శేషయ్య పరమానందభరితుఁడై "యిఁక నే ధన్యుఁడనైతి" ననుకొని. భగవంతునికి వేయి మ్రొక్కులు మ్రొక్కుచుండెను గాని, కల్యాణి వచ్చి తన యింటఁజేరి యల్లునికి బోధించి, బుద్ధిఁ జెడఁగొట్టి కూఁతురికి వశ్యముఁ జేసినదనియుఁ బెద్దవా రున్నారన్న లక్ష్యము లేక కోడలు మగనితో మాటలాడుచున్నదనియు జానకమ్మ వచ్చువారితో నెల్లఁ జెప్పి తిట్టుచుండెను. తల్లి పెడమాటలు వినలేక. సుబ్బరాయుఁడు చీవాట్లుఁ బెట్టుచుండఁ గల్యాణియు, సుభద్రమ్మయు నడ్డుపడి "పెద్దామె యైనది, ఆమె మాటలకుఁ గోపపడఁ గూడ"దని యతని నణఁచు చుండిరి.

ఒకనాటి రాత్రి పట్టాభిరాముఁడు రాగమంజరియింటికి వెళ్ళి

యామెను జూచి "సఖీరత్నమా! నీ కోరిక నా భార్య విని మహా నందభరితయై దుఃఖసాగరమున మునింగియున్న తన కాపన్నబంధువై తన్ను దెప్ప నెక్కించిన నిన్నుం జూడ తనకును నభిలాష యున్న దనెను." అనిచెప్పి. శోభావతి దానితో మాటాడుటకు యోజించిన యుక్తిని తెలిపెను. రాగమంజరి చాల సంతసించి, మఱుదినము మధ్యాహ్నము శోభావతికిఁ దగిన సంభావనము, బిడ్డలకు మిఠాయియుఁ గొని గంపలోనుంచుకొని దాసిని వెంటఁగొని, శేషయ్యగారింటికి వచ్చి వాకిటనున్న మాణిక్యమును జూచి. "యమ్మా! శోభావతిదేవి గారెచటనున్నా" రని యడిగెను మాణిక్య మా సుందరి నెన్న డుఁ జూడలేదుకనుక "మీ రెవ" రని యడిగెను. రాగమంజరి "నేనామెకు బాల్యస్నేహితురా"లనెను.

మాణిక్యము "మందిరమ్మా!" అని తల యూపి "యామె కొంచెము జబ్బుచే గదిలోఁ బండుకొనియున్న" దని చేయిచూపెను. రాగమంజరి యా గదిలోని కరుగగనే శోభావతి కనుగొని "చెలీ! నిన్నుజూచి యెంతకాలమైనది! నా భాగ్యవశమున మరల నిన్ను జూడఁగలిగెను. నీవీయూరి కెప్పుడు వచ్చితివి? మా యాల్లు కనుగొంటి?"వని చేయిపట్టి దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొని, మెల్లఁగాఁ "జెలీ!నీవే నా పాలిటి ధర్మదేవతవు. నా విషయమున నీవు చేసిన యుపకారమునకుఁ బ్రతి నే నెంత చేసినను, నన్ని జన్మములకైనను తీర్చుకొనఁజాలను. మీ కులమున నిట్టి యుత్తమాంగన లుండుట చూడలేదు! వినినది లేదు. నన్నుగట్టెక్కించుటకై సద్గుణరాశివగు నిన్ను భగవంతుడు భూమియందుఁ బుట్టించె ననుకొనెద" నని, చెప్పుచు పలుమాఱామె చేతిని ముద్దుఁ బెట్టుకొనెను.

వయసునను, గుణమునను శోభావతి తనకంటె పెద్దదియగుటచే, రాగమంజరి యామె యడుగులను దన చేతితోఁ బట్టుకొని,

"యక్క-యమ్మా! నావలన నేమున్నది? బంగారమునకుఁ బరిమళ మబ్బి నట్లు సద్గుణసౌందర్యములచేఁ బ్రకాశించుచుండు నీవంటి పతివ్రతా శిరోమణుల చింతఁదీర్చి రక్షించుటకు,సర్వరక్షకుఁడైన భగవంతుఁడు సిద్ధుఁడై యుండును గదా!" యని యామె తనయందు గనఁబరచిన ప్రేమకై యానందాశ్రువు లొలికించుచుండెను.

లోపలనున్న కల్యాణి నూతనకంఠధ్వని విని మాణిక్యమును జూచి "యమ్మా యీ! శోభావతితో నెవరో మాటలాడుచున్నట్లున్నది" యనెను. మాణిక్యము "అవును,ఆమె యెవరో వదినెకుఁ జిన్ననాటి స్నేహితురాలఁట." యని బదులు చెప్పెను. కల్యాణి యామాట వినిన తక్షణమే యా వచ్చినవారెవరో కనుగొందమని కూఁతురిచెంత కరిగి, యానవయువతిని జూచి "తల్లీ! మన యూరియందీమెను నేనెన్నఁడు జూడలే"దనెను. శోభావతి అమ్మా! యీ మె నాతోఁగూడ బడిలో చదువుకొనుచుండెను గాని, తరువాత నేనుగూడ నీమెను జూచినది లేదు. ఐనను నేనిట నెండ్లాడినది వినియుండెనఁట. చిన్ననాటి స్నేహము మరువక నామీఁద జ్ఞాపకముతో నీ యూరికివచ్చిన పది దినముల నుండియు నెందఱనో యడిగి తుదకు నిన్న నెవరి వలననో గుఱుతుఁ దెలిసికొని నను జూడ నభిలాషతో నింతదూరము వచ్చె"నని చిఱునవ్వు నవ్వెను.

రాగమంజరి కల్యాణిని జూచి, "యమ్మా! యామెతోఁ గూడ నేనును మీపుత్రి ననుకొనుఁడు." అని కొంతసేపు మాటలాడుచుండి, "యమ్మా యొక పళ్లెముఁ దెచ్చెదరా!" యనెను. కల్యాణి లోపలికివెళ్ళి జపాను దేశపుఁ బళ్లెము నొకటి దెచ్చిముందుఁబెట్టెను. రాగమంజరి దానిని దీసికొని పనికత్తెచే మోయించుకొని వచ్చిన గంపలోని సీమ మేడిపండ్లు,సీమ రేగుపండ్లు, తియ్యనినారింజపండ్లు,

వచ్చి ద్రాక్షగెలలు, మిఠాయి పొట్లములు మొదలైన వానిని దీసి పళ్లెము నందుంచి, కల్యాణి కందిచ్చెను.

కల్యాణి—(నవ్వుచు) అమ్మా! దుకాణములో నింకేవియు లేవా! పళ్లెము పట్టుకున్నదే?

శోభావతి—చెలీ! నిను జూచుటయే నాకు ముఖ్యముగాని యింత ప్రయాసముఁ బుచ్చుకొంటి వేల?

రాగమంజరి వారిమాటలకు నవ్వుచు, ''సోదరీ! 'రిక్తహస్తేన నోపేయాద్రాజానం దైవతం గురుమ్' అనునట్లు దేవాలయమునకుఁ గాని, పసిబిడ్డలుండు స్థలమునకుగాని రిక్తహస్తములతోఁ బోఁగూడదని పెద్దలు చెప్పుదురుకదా! అదియునుగాక నీ వంటి ప్రాణసఖుల కేమియిచ్చినం దీరదుకదా!''అనెను.

కల్యాణి పళ్లెముఁ దీసికొని లోపలికి వెళ్లెను. శోభావతియు రాగమంజరియుఁ జాలసేపు తమ ముచ్చటలు చెప్పుకొనుచుండి, తరువాతఁ గొంతసేపు లోకవృత్తాంతము మాటాడుచుండి సంధ్యవేళ యైన పిమ్మట రాగమంజరి పరిచారికతోఁ గూడఁ దనయింటికి వెళ్లెను.

వీధివంక గదిలోఁ బరుండి యివియన్నియుఁ జూచుచుండిన శేషయ్య వచ్చినది వేశ్యయనియును, దనకొమారునకుఁ బ్రియురాలై యుండవచ్చు ననియును దలఁచి కోడలియొద్దకు వచ్చి, ''శోభావతీ! నీ కోపిక చాలనపుడు విశేషము మాటలాడిన శరీర మలసి జబ్బు తిరుగఁబడిన నేమి చేయఁగలము?'' అనెను. రాగమంజరి యందు మామగారి కనుమానము కలిగినట్లున్నదని యెంచి, శోభావతి విన్నదనముతో, ''మామయ్యగారూ! చిరకాలమునుండియుఁ జూడకుండిన ప్రాణస్నేహితురాలు వెదకుకొనివచ్చినపుడు మాటాడక మనమూరకున్నఁ జిన్నపుచ్చినట్లుగదా!'' యని వినయముతో ననెను.

కోడ లేమిచెప్పినను శేషయ్య వాస్తనముఁ గనుగొనెను. అయినను తనకుఁ గానివారితోఁ గూడ శోభావతికిఁగల యైకమత్యమునకును, వినయగాంభీర్యములకును దనలో మెచ్చుకొనుచుఁ "బోనిమ్ము ఇఁక మీఁద శరీరమున కిట్లలసటఁ బెట్టుకొనకు" మని చెప్పి యవతలికి వెళ్లెను.

వేశ్యాగమన మిప్పుడు తన యిల్లాలెట్లు నడచుకొనినది నెఱుఁగవలయునని యొకనాటి రాత్రి పట్టాభిరాముఁడు రాగమంజరి యింటికి వెళ్ళి యామెనుజూచి, "ప్రియసఖి! నాభార్య నిన్ను మర్యాదతోఁ జూచి యాదరించెనా" యని యడిగెను

రాగమంజరి—[ఆనందబాష్పములతో] "అయ్యగారూ! ఆ సుగుణరత్నమునకు నాయందుఁగల విశ్వాసము, ప్రేమ నాతల్లి తోఁబుట్టువులకైన నుండదని నేను సర్వసాక్షియగు భగవంతునిపై నానఁబెట్టిచెప్పఁగలను. ఆహా! బంగారమునకుఁబరిమళ మబ్బినట్లామె సౌందర్యమునకుఁ దగిన సద్గుణములు గలిగి వెలయుచున్నది. లోకమున సౌందర్యమున్నచోట గుణముండుట యరుదు గుణమున్నచో సౌందర్యముండుట యరుదు ఇట్లు రెండును బొసంగియుండునది యెచ్చటను జూడలేదు. మీ పూర్వజన్మ సుకృతమువలన మీకిట్టి భార్యను భగవంతుఁడు కృపచేసెనేకాని, ఎట్టివారికిని నిట్టి భాగ్య మబ్బుట వింతయే! ఆ సుశీలదర్శనమున నా పాపములెల్ల నశించుటయే కాక నాజన్మము పావనమై నానేత్రములు సఫలతనొందినవి, అదియుండ నిండు కాని, నూఁడకమున్ను నాకంత వింత తోఁచలేదు చంద్రుని వంటి భార్యయుఁ, జుక్కలవంటి బిడ్డలు నింట సంచరించుచుండ, వారిని గన్నెత్తియైనఁ జూడక, మాటాడక యుండుటకు మీ మనసెట్లు నిలచియుండెనో! నా కాశ్చర్యముగనున్నది. జరగినది పోనిండు. ఇఁక

మీఁద నర్ధనారీశ్వరుఁడైన పరమశివునివలె నామె నేలుకొనవలయునని మిమ్ము నేకపర్యాయములు ప్రార్థించెదను.'' [అనియంజలిఁ బట్టెను.]

పట్టాభిరాముఁడు—రాగమంజరీ! నా మేలుకొఱకే భగవంతుఁడు నీ తల్లికిని నీకును వైరముఁ గలిగించి, నిన్నిటకు రప్పించి నీపొత్తు నాకుఁ గలిగించెను. కాకున్న, బావిఁ గోఁబడిన వానిని త్రిని రాళ్లుగొట్టినట్లు నేనిదివఱకుఁ జెలిమిఁ జేసిన యువతులు నా భార్య యింటికివచ్చుట యెఱిఁగి ''నీపెండ్లము వచ్చినపిమ్మట మా మీఁద దయలే''దని యెత్తి పొడుచువారును, జేతఁగాసియ్యనినాఁడు ''నీగాలి సొమ్ముఁ దెమ్ము''నువారును, సొమ్ముల్ల దోఁచి తెచ్చి యిచ్చినను గనికరములేక యియ్యనినాఁడు దమ విటకాండ్రచే మర్దనము జేయించువారునునుండి, నా యభాగ్య దినములవలన నిన్ని కష్టము లనుభవించి వారియందు మోహమును, రత్నమువంటి యిల్లాలియందు వెగటును కలిగి దానిని నానా విధముల హింసించి, లోకనిందితుఁడనై చివఱకు నీయొక్క సుబోధనముచే జ్ఞానోదయమై గట్టెక్కితిని. ఇఁక మీఁద నీ మాటప్రకారము నడచుకొందు ననుటకు సందియము కూడఁ గలుగునా?

ఇట్లు రాగమంజరితోఁ బట్టాభిరాముఁడు కొంతసేపు మాటలాడుచుండి తరువాతఁ దనయింటికి వెళ్లెను.

ప్రతిదినము పాఠశాలనుండి వచ్చిన తరువాతఁ బట్టాభిరాముఁడు తన సతియొద్ద కరిగి, క్షేమమరసి కొంతసేపు ముచ్చటలాడుచుండెను. తనకు సద్బుద్ధి గలిగిన తరువాతఁ దొల్లిటి వన్నియుఁ దలఁచి, యపుడపుడు పరితపించువాఁడై, యెచటికిని వెళ్ళకున్నను నెపుడైన రాగమంజరియింటికి వెళ్లఁదలఁచినఁ దన యిల్లాలి యొద్ద సెలవుఁగైకొని వెళ్లుచుండెను.

ఆహా! దైవనిర్ణయ మెంత చిత్రమో! సగాముఁడు శోభావతికి జబ్బు గుణమై లేచి కూర్చుండుటకును, నడుగిడుటకును కొంత యోపిక కలిగెను. కల్యాణి వచ్చి చాలదినములై నందున నూరికి వెళ్ళఁదలఁచి కొమరితఁజూచి, "తల్లీ! యింట నొంటరిగ మీ తండ్రి యెంత యిబ్బంది పడుచున్నారో కదా! నిన్నును వెంటఁ దీసికొని వెళ్ళఁదలఁచెదను రమ్ము, యోపిక కలిగిన తరువాత మరలి వత్తు" వనెను. ఇట్లనఁగానే తన పెనిమిటియిష్ట మెఱుఁగఁదలంచి శోభావతి యేమియుఁ బలుకకుండెను.

ఆ దినము సంధ్యాకాలంబునఁ దన పనులన్నియుఁ దీరిన తరువాత వికసితపంకజవదనయైన తన యిల్లాలినిఁ జూపెఁ బట్టాభిరాముఁ డతిసంతోషముతో వచ్చెను పెనిమిటిం జూచి ముఖమున విన్నదనముఁదోఁప, శోభావతి యతని చేయిపట్టి తనప్రక్కను గూర్చుండఁ బెట్టుకొనెను. దొండపండువంటి యధరమునఁ జిఱునవ్వు లొలుకుచుఁ దనకు దర్శనమొసఁగు ప్రియసతి యిన్నిదినములకు లేఁగాక, వాడఁబారిన ముఖముఁ గలిగియుండుటఁ జూచి, యతఁడు దిగులొంది, గుండెలు తటతటయనుచుండ, నామె గడ్డముఁ బట్టుకొని, "నా బహిఃప్రాణమా! యేమిట్లా కతికిన నున్నావు? నీకేమైన యనారోగ్యముగనున్నదా?" అని యడిగెను.

తన ముఖము చిన్నపోయినంతటనే యింత వంతనొందు పతిని జూచి, మనసు నీరై దన రెండుచేతులతో నతని పదములను బట్టుకొని, "జీవితేశ్వరా! తమ దయవలన నా కష్టేమియు లేదు కాని, మా తల్లివచ్చి చాలదినములైనందున నూరికి వెళ్ళఁదలఁచి, నను విడచి పోవఁ గాళ్లాడక తన వెంటఁ దీసికొని వెళ్లెద ననుచున్నది. ఏలినవారి పాదదర్శనములేక దూరమున నుండుట కిచ్ఛ లేక చింతఁ జెంద"నని కంటఁ దడిఁ బెట్టుకొనెను.

తన్ను బాయ నిచ్చలేక వ్యసనపడు ప్రియసతీమణిని జూచి, పట్టాభిరాముఁడు దన యుత్తరీయపుఁ జెఱఁగున నామె కనులఁ దుడిచి కొంతసే పేమియుఁ బలుకక యోజించుచుండి, తరువాత నామె శరీరముఁ దడవుచు, "నా ప్రాణపదమా నీ వెట్లయినను నారోగ్యవతివై యుండుటయే నా ముఖ్యోద్దేశము. నిను జూడక నేను మాత్రము నిలువఁగలవాఁడను కాను. అది యటుండనిమ్ము. ఇంత జబ్బు పడిన నిన్ను విడిచిపోవఁ గని పెంచిన తల్లికి మనస్సుండదని వెఱ్ఱివాఁడును జెప్పఁగలడు. కనుక నామె మనస్సు చిన్నవుచ్చక యామెతోఁ గూడ వెళ్ళి వారముదినములైనను నుండి రమ్ము. లేకున్నఁ బాప! మామె వెళ్ళినను, నీపై గమనమునఁ దహతహ పడుచుండునుకదా? ఆమెను నొప్పించుట మనకుఁ బాడిగాదు, నా బంగరు బొమ్మా! ఇందులకై చింతింపకు"మని, యామె నెంతయు నోదార్చి, కొంతసేపామె ముద్దు మోమును నయనానందముగఁ జూచుచు, ముచ్చటలాడుచుండెను.

మఱుదినము శేషయ్య నడిగి సుభద్రమ్మ సెలవుఁ బొంది, కల్యాణి, శోభావతిని, బిడ్డలను దనతోఁ గూడఁ దీసికొని కుంభకోణమునకు వెళ్లెను.



# శోభావతి.

## పదుమూఁడవ ప్రకరణము

---

లోకమునందెవరికైనను మరణమువలెనాఁడెడబాటేమియు అంతగాఁ దోఁచదు. కాని, యది కలిగినపు డాయెడఁబాటే దుస్సహమై తోఁచును కదా! ఇట్టుల బిడ్డలుఁగన్న తల్లిదండ్రులన్న పేరేకాని, యెపుడుపుడే క్రొత్తగ నంకురించుచున్న యనురాగ మగుటచే శోభావతి పుట్టినింటికి వెళ్లగనే, పట్టాభిరాముని ప్రేమాంకురము విస్తరించి శాఖోపశాఖలై, నతని మనస్సంతయు నాక్రమించుకొనెను అందుచే శోభావతిపై నున్న మరులు క్షణక్షణమున కభివృద్ధి యగుచుండెను. నన్నము మీఁద నిచ్ఛలేక, తన సొంతపనుల యందును మనసుపోక రాత్రులు కంటఁ గూరుకురాక, మంచముపైఁ బరుండి యిట్లని తలపోసికొనుచుండెను "హా నాయర్ధాంగియైన పతివ్రతా తిలకమునను విడచి పోనొల్లకుంటిని కదా! ఇదేమి నావెఱ్ఱి! నేను కాలవశంబునఁ గటికవానికంటెఁ గ్రూరుఁడనై, నానా హింసఁబెట్టినపుడు తానేక పుత్రియు, గారాబు పట్టియు నైయుండియు, నే బెట్టిన కష్టములకు నోర్చి పుట్టింటికైన వెళ్లక, నేనే శరణ్యమని, నాయింటఁ బడియుండిన నాసతీతిలక మిపుడు నను బాయ నెట్లు సమ్మతించెను! పాపము! నను బాయలేనని చింతిల్లిన నా ముద్దుగుమ్మను నేనే పొమ్మంటిని కదా? అపుడు యోజన లేక పొమ్మని సెలవిచ్చి యిపుడు వెఱ్ఱివాని వలెఁ దపించు నావంటి మూర్ఖుఁడెవఁడుండును? నేఁదెలివి లేక పడినపాట్లకు నందఱికిని సహ్యము గలిగియుండ, నిపుడు నేనిల్లాలి యెడఁబాటు నోర్వలేకున్న, వినిన వారు పరిహాసింప కుందురా? తల్లికైన నినుమడియు

గు సుభద్రమ్మకైనఁ జెప్ప లజ్జయగుచున్నది. హా! నామనోహరా! అంధుండైయుండిన దరిద్రుఁడిపుడే దేవునికృపవలనఁ గనులు గలవాఁడై, ముద్దులుగులుకు నీముఖదర్శనముచే నేత్రముల సఫలత నొందించుకొను నటులే, 'నను బాసి నిలువ లేఁడుగదా' యని నీవైన దయ దలఁచి నిలిచియుండిన బాగుగ నుండకుండును గదా!''

అని యీరీతి బలువిధముల వంతనొందుచు నాలుగుదినములగునప్పటికి, నాలుగు యుగములై తోఁప నెటుచేయఁ దోఁచక, గుటకలు మ్రింగుచుఁ, జివరకు ధైర్యముఁబూని, యా కంతురంగురాలగు వేశ్యారత్నమునొద్ద తన కష్టముఁ జెప్పుకొనఁదలఁచి, రాగమంజరి యింటికి వెళ్ళి, యామె లోపల నుండుటచేఁ బిలువక, యచట నున్న కుర్చీపైఁ గూర్చుండి మౌనము వహించియుండెను.

భోజనముఁ జేయుచుండిన రాగమంజరి బయటికివచ్చి కుర్చీపైఁ గూర్చున్న యాతనిం జూచి, ''యయ్యగారూ మీ దర్శనమై చాలదినములైనది. ఏమయ్యు చిన్నపోయి యున్నారు. మా యక్కగారు నెమ్మదిగా దిగుచున్నారుకదా!''యని యడిగెను. పద్మాభిరాముఁడు ఆఁ అని తలయూచి, ''రాగమంజరీ కష్టములు గలిగినపుడు మంత్రివలె సదుపాయములు దెలుపువారికేకదా జెప్పుకొనవలయును? సముద్రములో మునుఁగుచుండిన నా తెప్ప నీవిప్పట్టునవచ్చిన నీకుఁదప్ప, నాచింత నొరులకుఁ జెప్పుకొన నిష్టములేక, నీ చెంతకు వచ్చితినిగాని, నీవు పరిహాసము సేయుదువని లజ్జయగుచున్నది.''అనెను. అతని మాటలవలననే భార్యావియోగమువలె నున్నదనుకొని, రాగమంజరి మురిమురిసినగవు నవ్వుకొనుచు ''మఱియేల నాలస్యము? చెప్పఁ గూడదా!'' యనెను. రాగమంజరి నవ్వులకు లజ్జయై ''ప్రియురాలా! నేఁ జెప్పకమునుపే నవ్వుచున్నావు. ఇఁక నేఁజెప్పిన

.................. "యని పట్టాభిరాముఁడు క్రిందుఁ జూచుచు నూర కుండెను.

రాగమంజరి—అయ్యా! మా యక్కయ్యను దలఁచి నవ్వితిని కాని, మిమ్ముఁజూచి కాదు. మీరు చెప్పఁదలఁచుకొన్నది చెప్పుఁడు.

పట్టాభిరాముఁడు—[కొంతసేపు గొణుగుచుండి, తలనూపి] గుణవతీ! దల్లకు వచ్చి యింతదాచిన ప్రయోజన మేమి లేదుకదా! నీ కంటెఁ బ్రియులు లేనందున నీతోఁ జెప్పుకొనుటకే వచ్చితి. నా భార్యయు, బిడ్డలును మా యత్తగారి వెంటఁ బుట్టినింటికి వెళ్ళిరి యని నేఁ జెప్పియుండ లేదా!

రాగమంజరి—ఔను, మఱచితిని. వారము దినములనాఁడు చెప్పియుంటిరి. వారిదగ్గఱనుండి యుత్తరము లేమైన వచ్చుచున్నవా?

పట్టాభిరాముఁడు—వచ్చినవి కాని, నాలుగు దినములనుండియుఁ గలలోఁ బిల్లలును, దల్లియుఁ గనఁబడుచున్నారు. అందుచే నా మనసు కుదిరిక లేకున్నది.

రాగమంజరి—అట్లయిన వెళ్ళి చూచిరాఁగూడదా!

పట్టాభిరాముఁడు—నేను వెళ్ళిన చూచువా రేమందురు?

రాగమంజరి—[చిఱాకుతో] అందులకే కదా నేను నవ్వినది! మీరు వెఱ్ఱి బ్రాహ్మణులు కాఁబట్టి, యట్టి సుగుణ సుందరితోఁ జల్లగాఁ గాపురము సేయుచుంటిరి కాని, లోకమునఁ గుంటిదైనను, గురూపియైనను, గయ్యాళియైనను, దుదకు వ్యభిచారిణియైనను, బతులకున్న మోహముచే "నా సతినిమించిన స్త్రీ లోకమున లే" దని యభిమానించుచు, నొక నిముసమేని యెడబాయలేక బరితపింతురు; కాని మీరొకరే లోకవిరుద్ధముగ నుంటిరి.

పట్టాభిరాముఁడు—[రాగమంజరికిఁ గోపము వచ్చినదని, దీన

వదనుఁడై] ధర్మ స్వరూపిణీ! నీ నన్నట్లనుచున్నాఁడుంటిని కాని, నీ యుపదేశమువలనఁ దెలివి గలిగినవాఁడనగుటవలన, నిపుడుండలేక, నీవందుల కుపాయముఁ జెప్పుదువని నీతోఁ జెప్పుకొనుచున్నాను.

రాగమంజరి—అయ్యో! ఇవియే జ్ఞానములేని మాటలు. పరస్త్రీ సంగమమున కెవరైనఁ బరిహసింతురుగాని, దారపుత్రాదులఁ జూడవెళ్ళిన నెంత మూర్ఖులైనను నేమియుఁ జెప్పరు. మీరు బాహాటముగ వెళ్ళి చూచిరండు.

పట్టాభిరాముఁడు—'పెండ్లము కొరకై పిలువకయే వచ్చినాఁ' డని యచటివా రేమందురోయని లజ్జయగుచున్నది.

రాగమంజరి—ఇదేటి మాటలయ్యా' నిన్ననే వివాహమాడినారా? ఇద్దఱు బిడ్డలఁగన్న తండ్రికి సిగ్గేల!

పట్టాభిరాముఁడు—అట్లయిన మామగారికిఁ జెప్పక వెళ్ళ వచ్చునా!

రాగమంజరి—చెప్పక వెళ్లుటెందులకు! ప్రథమ దర్శనము నాఁడే తలిదండ్రుల కంటె మామయ్యగారికిఁ దనపై చాల విశ్వాసమనీ మాయక్కయ్య చెప్పెను. రెండవసారి నేను వచ్చునపుడును, కుమారునకుఁ గోడలిపై ప్రీతి కలిగినందులకు మామయ్యగారు మహా సంతోషముతో వేయి వేల్పులకు మ్రొక్కుకొనుచున్నారని యామె చెప్పినది. కాఁబట్టి మీరడిగిన వారడ్డము చెప్పరు.

పట్టాభిరాముఁడు—నాకు నడుగ లజ్జయగుచున్నది

రాగమంజరి—మీ రడుగకున్న మీ పినతల్లిచే నడిగించి వెళ్లుఁడు.

పట్టాభిరాముఁడు "అట్లయిన రేపు, మఱునాడు సెలవులు. కావున వెళ్ళి వచ్చెద" నని చెప్పి, కొంత సేపు మాటలాడుచుండి.

రాగమంజరియొద్ద సెలవుఁ బుచ్చుకొని, తనయింటికి వెళ్ళి స్నానము చేసి, భోజనమునకుఁ గూర్చుండెను వేశ్యారత్నము చెప్పిన యోజన వలనఁ గొంత ధైర్యము వచ్చి, విస్తరి ముందుఁ గూర్చుండెఁ గాని, తన మనసున నున్నదానిని పినతల్లితోఁ జెప్పుటకు లజ్జ తోఁపఁ జేయి విదలించి లేచి గొణుగుచుండెను.

నాలుగుదినములనుండియుఁ గుమారుని కన్నము సహించకుండుట చూచి సుభద్రమ్మ "యేమిరా! తండ్రీ! ప్రతిదినము నన్నము విసిచి లేచుచున్నావు! శరీర మేమైన జబ్బుగ నున్నదా!" అని యడిగెను. పట్టాభిరాముఁడు "అట్లేమియు లేదు కాని యెందువలననో నామనసు స్థిమితముగా లేద"నెను.

భార్యవిషయమునఁ బాషాణమైయుండిన మనసు, దేవునిదయ వలన నిపుడే మెత్తపడి, క్రొత్త యనురాగముఁ గలుగుచుండుటచే, నెడఁబాటు కష్టముగ నున్నదని తెలిసికొనినదై సుభద్రమ్మ యెరుగనట్లు "నేమిరా! తొల్లిటిజ్ఞాన మేమైనఁ దిరుగఁబడినదా!"యనెను. పట్టాభిరాముఁడు "పిన్నమ్మా! దేవుని దయవలనను, నీ యుపదేశమువలనను, నుత్తమ వేశ్యయగు రాగమంజరి సుబోధనమువలనను నా చెడుబుద్ధులెల్లఁ దొలఁగి దూరమయ్యెను. ఇఁక మీఁద నా కట్టి చేటు కలుగ"దని ప్రత్యుత్తరమిచ్చెను.

అతని మాటలకు సుభద్రమ్మ మనసు చివుక్కుమన, నతని గడ్డముఁ బట్టుకొని, "నాయనా! అట్లనఁబోకు. నీవు బాగుగనుండిననే కదా యందఱకు సంతోషము. "నీకు వచ్చు నెంత కష్టమువచ్చిన మా కందఱకును గొండ నెత్తిపైఁ బడినట్లనుకొనెదము." అని బలుకుచు, వీపునఁ దడవుచు, "తండ్రీ! మఱెందుచే నీ కన్నము యితవులేకున్నది? అయ్యో! కన్నులు గుంతలు పడి శరీరము కూడ

వాఁడుఁ బాటివాఁడే!" యని చింతిల్లెను. లజ్జచేఁ గొంతసేపు పట్టాభిరాముఁ డాలోచించి, తుద కెట్లయినఁ జెప్పక తీరదని, మనసు గట్టిచేసికొని "చిన్నమ్మా! నీ వేమనుకొనెదవో" యని చెప్ప వెఱచు చుంటిని. కాలవశంబున నంధుఁడనై కన్ను త్రిమూఁడకుండినపు డేమియుఁ దోఁచకుండెనుగాని, యిపుడిపుడు హేమవల్లి కాళ్ళ కడ్డుపడి రోదనముఁ జేయుచుఁ దగ్గఱ చేరుచున్నందునఁ బిల్ల కన్నులలోనే మెదలుచున్నది. అదియునుగాక నాలుగునాళ్ళనుండియుఁ గలలోఁ బిల్లలను, వారితల్లిని జూచుచున్నందున నదేమి కారణమో నా మనసున కేమియుఁ దోఁచకున్నది.

తానను కొన్నట్లు కొడుకు భార్యావియోగమునఁ గుందుట తెలిసి, "యింతమాత్రమైనాఁడు కదా!" యని సుభద్రమ్మ తనలో సంతసింపుచు, "నాయనా! నాకనులుచేసిన పాపమువలన నీకొకనికి లేకుండెనే కాని, లోకమునం దెల్లరకును కలిగినదే. భార్యావియోగచింత నీకంటెఁ జిన్నవాఁడు సుబ్బరాయుఁడు మీనాక్షి పుట్టింటికి వెళ్ళిన నాలుగవ నాఁడే చిన్నమ్మ యొంటరిగఁ జాకిరిఁ జేయఁజాలదని నా నెత్తినిఁ బెట్టి వెళ్ళి భార్యను బిలుచుకొనివచ్చుట లేదా? రేపు మఱునాఁడు సెలవు లేకదా? నీవు వెళ్ళి శోభావతిని బిల్లలను జూచిరమ్ము" అనెను.

పట్టాభిరాముఁడు—నాన్నగారు కోపపడుదురేమో.

సుభద్రమ్మ—నీవంటి వెఱ్ఱిబాగుఁడైన కోపపడును. ఊరివారు కన్నబిడ్డను, నందులో నేకపుత్రి, గారాబుపట్టి, సుందరవదన, సుగుణరాశి, యట్టిపిల్లనుగట్టినను నిల్లాలిపైఁ బ్రీతిఁగలిగి లోకులతోఁ బాటు నీవు చల్లగాఁ గాపురము చేయుటలేదన్న చింతచే, నీతండ్రి రేయింబవలు వేయివేల్పులకు మ్రొక్కుకొనుచుండెనే! ఇపుడుకదా తాను సరివారిలో నొకమనుష్యుఁడనైనాఁడనని చింతఁదీరి సంతోషముగ

నున్నాఁడు.

పట్టాభిరాముఁడు—సరేకాని, నాయనను నీవడిగెదవా?

సుభద్రమ్మ—నాయనా! ఎవరైన నేమి? అట్లే యడిగెదనులే. అని కొడుకునకు వడ్డించుటయైనతరువాత, శేషయ్య పండుకొనియుండిన గదిచెంత కరిగి తొంగిచూచి, తలుపు చాటున నిలువఁబడి "పెద్దవాఁడు కుంభకోణమునకు వెళ్లుటకై నాయనగారి నడుగుమన్నాఁ"డనెను. మఱఁదలు చెప్పినమాట విని. భగవంతుని దయవలనఁ గొడుకు చెడునడతలు మాని యింత మాత్రము సద్బుద్ధిగలవాఁడై నందుకు శేషయ్య ముసిముసి నవ్వు నవ్వుకొనుచు, సుభద్రమ్మను జూచి, "ఏమీ! వాని కంత తెలివిగలిగినదా? లేక యచటికి వెళ్ళి మునుపటి చేష్టలఁ జేసి, యవమానముఁ దెచ్చి పెట్టుటకా?" యనెను.

సుభద్రమ్మ—[శేషయ్యతో] పసితనమువలన నట్టి తెలివి మాలిన పనులు చేసినాఁడు కాని, శోభావతిజబ్బుపడినది మొదలు తెలివిగలిగి భార్యపై యనురాగముగలిగియుండుటయే కాక యిఁక మీఁదనట్లు నడచుకొనననిి యానఁబెట్టి తాఁజేసిన యకృత్యములఁ దలఁచి యప్పుడప్పుడు పరితపించుచున్నాఁడు."

శేషయ్య—అట్లయిన వెళ్లుమనుము.

సుభద్రమ్మ—(ఈవలకు వచ్చి కొడుకును జూచి నవ్వుచు) నాయనా! మీతండ్రిగారు వెళ్లమని సెలవిచ్చిరి.

పట్టాభిరాముఁడు మిద్దెమీఁది కరిగి వస్త్రములు ధరించితండ్రి చెంతకుఁబోయి యడుగ లజ్జించి నేలఁ జూచుచు నిలువఁబడి యుండెను. అట్లు లజ్జచేతను వెఱపుచేతను ముఖము వెలవెలఁబోవ దన యెదుట నిలిచియున్న కొడుకునుజూచి తాఁజేసినదుష్కృత్యములకు

నిపు డేమియు మాటలాడుటకు ముఖము లేక, పెద్దవాఁడయ్యుఁ జిన్నవానివలె లజ్జితుఁడగుచున్నాఁడని, శేషయ్య మనమునఁ బరితాపము గలిగి, తెలియనివానివలె "ఏమిరా! పట్టాభీ! పాఠశాలసంగతు లేమైన నున్నవా? ఏల నట్లు నిలువఁబడియున్నా" వనెను. పట్టాభిరాముఁ డధోముఖుఁడై "యేమియు లేదు, రేపు, మఱునాఁడు సెలవుదినములు, కాఁబట్టి కుంభకోణమునకు వెళ్ళివచ్చెద" ననెను. శేషయ్య నవ్వుచు "నాయనా! నీకుఁ గూడఁ బ్రపంచజ్ఞాన మున్నదా? భద్రము! తెలివిమాలినవాఁడవై యగౌరవమును దెచ్చి పెట్టక జాగ్రత్తగ వెళ్ళిర" మ్మని చెప్పెను.

పట్టాభిరాముఁడు తండ్రియొద్ద సెలవుఁ గైకొని తల్లికిఁ జెప్ప దలంచెనుగాని, యింక నామె చూపోవక తిట్టిపోయుచుండునని, పినతల్లి యొద్దని చెప్పఁగ నరేయని రైలునకు వెళ్లెను. పసితనమున వివాహమునాఁడు తప్ప మరల నత్తగారింటికి వెళ్ళినవాఁడు కానందునఁ బట్టాభిరాముఁడు రైలునఁ గూర్చున్నది మొదలు, మామగారు ఉత్తరము వ్రాయకయే తాను వెళ్ళిన నత్తమామలు లేమనుకొందురోయనియుఁ, దన తొల్లిటికృత్యము లందఱికిఁ దెలిసియేయుండును కావున తన్ను చూచి యూరివారు పరిహసింతు రేమోయనియుఁ, దనకు మామగారింటి గుఱుతు తెలియనందున నెవరి నడుగుదు ననియుఁ, నివన్నియుఁ యోజింపక వెఱ్ఱివానివలె త్వరపడి వచ్చితిననియుఁ, బలు విధముల యోజించుకొనుచుఁ బోఁగబండి దిగి, యిటునటుఁ జూచి మిడుకుచుఁ. దనకు తనతోఁగూడ బండి దిగిన యొక కోమటి చిన్నవానిఁజూచి, యతనివెంట నడచుచు, "నయ్యా! నీవెచటనుండి వచ్చుచున్నా"వని యడిగెను.

కోమటిసెట్టి——నేను చిదంబరమునుండి వచ్చుచున్నాను.

పట్టాభిరాముఁడు—మీ సొంతయూరిదేనా?

కోమటిసెట్టి—మాదీయూరే. మా కచట నొక బట్టలంగడి యున్నది అచట పనియుండి నాలుగు దినములనాఁడు పోయి యుంటిని.

అట్లయిన నతని నడిగి తెలిసికొనవచ్చునని పట్టాభిరాముఁడు కొంత ధైర్యముఁ గలవాఁడై, "యీయూరిలోఁ గొర్నాడు పట్టు చీరల దుకాణము పెట్టియున్న రామచంద్రయ్యగారున్నారా? ఆయున నెఱుఁగుదురా?" అనెను.

కోమటిసెట్టి— ఇల్లు తెలియును. మా యింటికిఁ బోవు మార్గములోనే

పట్టాభిరాముఁడు—(సంతోషముతో)అట్లయిన నాకుఁ దద్గృహముఁ జూపెదరా?

కోమటిసెట్టి—ఆయనకు మీకుఁగల బాంధవ్యమేమి?

పట్టాభిరామునికిఁ జెప్ప సిగ్గయి "మా బంధువులే"యనెను. ఇట్లు మాటలాడుచు నిరువురు వెళ్లుచుండఁ గోమటిచిన్నవాఁడు పట్టాభిరామునికిఁ జేయిచాచి యిల్లునజూపి "యయ్యా' అదిగో కనఁబడు చున్నదే గారతోఁగట్టిన స్తంభములుగల మిద్దెయిల్లు! అదే రామ చంద్రయ్యగారి"దని చెప్పి తాను గొంతదూరము నడచి యొకసందు వీధిలోఁబోయెను,

కోమటిసెట్టి చెప్పిన యింటియొద్ద కరిగి,"యిది బ్రాహ్మణుల ఇంటివలె నగపడుచున్నది కాని, వారిదో లేక, యింకెవరిదో"యని సం శయింపుచుఁ బట్టాభిరాముఁడు గుమ్మమున నిలచి,లోపలివంకకుఁదొంగి చూచుచుండెను. అంతట ముంగిట నాడుకొనుచుండిన హేమవల్లి తటాలున వీధివంకకు దిరిగి వాకిట నున్న తండ్రిని. జూచి 'నాన్న!

నాన్న" యని కేకలు వేయుచుఁ బరుగునఁ దండ్రిదగ్గఱకరిగి, పంచెఁ బట్టుకొనఁగనే పట్టాభిరాముఁడు నిశ్శంకముగ కూఁతురిని జంక నెత్తుకొని లోపలికి వెళ్లెను. హేమవల్లి కేకలు విని, యాశ్చర్యపరులై కల్యాణియు, శోభావతియు, రామచంద్రయ్యయును బిరబిర వచ్చి, పట్టాభిరామునిఁ జూచి, యానందపరవశులై కొంతసేపు చిత్తరువులవలె నివ్వెరపోయిరి. తరువాతఁ గల్యాణి చాటునకు వెళ్లెను. రామచంద్రయ్య యల్లుని గౌరవపూర్వకముగఁ జేయిపట్టి తీసికొనివచ్చి కూటమునందున్న కుర్చీపైఁ గూర్చుండఁ బెట్టి యానందాశ్రువులతోఁ, "నయ్యా మా బీదయింటిపై జ్ఞాపకముకలిగి, తమ రింత దయతో వచ్చినందులకుఁ బరమానందభరితుఁడ నగుచున్నాను, భగవంతుఁడు మీకు నాయురారోగ్యైశ్వర్యములతోఁ గూడిన సర్వ మంగళముల నొసఁగుఁగాక" యని యాశీర్వదించెను.

నూతనముగ నత్తవారింటికి వచ్చుట చేతను, దన యింటికి వచ్చినపుడైనను నత్తమామలతో మాటలాడినవాఁడు కాకుండుట చేతను తన తొల్లింటి చేష్టలకు లజ్జ కలిగినవాఁ డగుటచేతను నేమి చెప్పుటకునుదోఁచక, పట్టాభిరాముఁడు తలవంచుకొని యూరకుండెను. అల్లుఁడు లజ్జించియుండుటెఱిఁగి, యతని నెట్లయినఁ బలుకరింప నెంచి, రామచంద్రయ్య "నాయనా మనవారందఱుఁ గుశలమే కదా!" యని యడుగఁ బట్టాభిరాముఁడు నవ్వుచుఁ "దమ యాశీర్వాదమువలన నందఱు సౌఖ్యమే" యనెను.

భానుదర్శనమున వికసించిన కెందామరవలెఁ దనపై నింత యనుగ్రహమున విచ్చేసిన నిజవల్లభుని దర్శనమున వికసితపంకజవదనయై, శోభావతి మధుసూధనునిఁ జంకఁ బెట్టుకొని, పెనిమిటి చెంతనిలచి "మామయ్యగారు సౌఖ్యమేనా? అత్తగా రోపికతోఁ దిరుగుచు

న్నారా? పాపము చిన్నత్తగారికిఁ గూడ చాలమట్టుకు సామర్థ్యము తగ్గినది! మీనాక్షి యింటికి వచ్చినదా?''యని యడిగెను.

మృదుమధురవచనములఁ బలుకుచుఁ జిత్తరువువలెఁ దన యెదుట నిలుచున్న ప్రియురాలిం జూచి, పట్టాభిరాముఁడు తనలో, ''నాహా! చతుర్ముఖుఁడైన సృష్టికర్త దన హస్తకౌశలమెల్ల దీనియందే చూపెనట కేమాత్రము సందియము లేదు! ఇట్టి సుందరవిగ్రహమును జూచుటకు రెండు నేత్రములు చాలకయే యతడు చతుర్ముఖుఁడై యుండును. నా తొలినోముచే భగవంతుఁ డిట్టియిల్లాలిని దయ చేసియు, నా మందబుద్ధిచే నీ సుందరాంగిని గ్రీగంటనైనఁ జూపక, నేఁజేసిన దుష్కృత్యముల కావంతయైన లజ్జలేక, నేనొక మగవాఁడనని యిపుడు ప్రేమఁజూపిన జూచువారు నాముఖమున నుమ్మివేయకుందురా?''అని తలపోయుచు, నెట్లయినను బలుకకుండుట పాడి కాదనుకొని, ''యందఱు సౌఖ్యమే. మొన్ననే సుబ్బరాయుఁడు వెళ్ళి భార్యను బిలుచుకొని వచ్చెను'' అని చెప్పెను. శోభావతి కింకను బెనిమిటితో మాటలాడవలయునని యుండెను కాని, తండ్రి యెదుట నుండుటవలన జంకుచేఁ జంకనున్న మధుసూధనునిఁ బెనిమిటి చేతికిచ్చి లోపలికి వెళ్లెను.

సాధారణముగ లోకమున నెల్లవారికిని, నల్లుఁ డింటికివచ్చిన నాఁడు పండుగుతో సమానముకదా? అట్లుండ నంధునకు నేత్రములు గలిగినట్లు, వివాహముఁ జేసికొని వెళ్ళిన యల్లుఁ డిద్దరుబిడ్డల తండ్రియై, యిన్నాళ్ళ కరుదుగ వచ్చుటచేఁ గల్యాణి మహాదానందముతో నావేళ గొప్ప పండుగవలెఁ బలువిధములైన పిండివంటలు చేయ నారంభించెను.

ఊరిలో నెవరును బట్టాభిరామునిఁ జూచినవారు కానందున

నెఱుకగలవారందఱు వచ్చి "మీ యల్లుఁడుగారు దయచేసినారని విన్నాము." అని చూచి మాటలాడి పోవుచుండిరి. రాత్రి తొమ్మిది గంటలవఱకు వచ్చువారును బోవువారును నుండిరి.

తరువాతఁ గల్యాణి యల్లునకుఁ గాలుసేతులు గడుగుకొన నీళ్ళిచ్చెను. భోజనగృహమున రెండుపీఁటలు వైచి యరఁటియాకుల లో పింతవింత పిండివంటలును, బచ్చళ్లును గూరలును వడ్డించెను. రామచంద్రయ్య తన వస్త్రములున్న బీరువను దెరచి, మేలైన కాశ్మీరపు పట్టుతాపితాను దీసి యల్లునకు మడిఁగట్టుకొన నిచ్చి, తానును మడిఁ గట్టుకొని, యల్లునిఁ బిలుచుకొనిపోయి, యిరువురును బీఁటలపైఁగూర్చుండి, యానందముతో మాటలాడుచు, నల్లుడు భుజింపక విడిచి పెట్టినదానినిభుజింపుఁడని మామ బలవంతపెట్టుచు, నిట్లిరువురుభోజనములుచేసి లేచిరి.

అంత శోభావతి వెండిపళ్లెరమున నేలాలవంగాది పరిమళమిళితమయిన తాంబూలములను దెచ్చి వారికిచ్చెను అల్లుఁడును, మామగారును దాంబూలమువేసికొని లోకాభిరామంబులగు ముచ్చటలను ముచ్చటించుచుఁ, బదిగంటలకంటె నెక్కుడుకాలమగుటచే రామచంద్రయ్య మిద్దెపై కరిగి, సేవకునిచే మంచము, పరుపు, తలగడలు వేయించి చలువ దుప్పట్లు పరపించి, సాంబ్రాణి కడ్డీలు చెక్కఁబడి యుండు దీపపుసెమ్మెను వెలిగించి, యల్లునిఁ దోడుకొని పోయి శయనింపఁజేసి, తాను క్రిందికి దిగివచ్చి పండుకొనెను.

శోభావతి సంతోషమున నిటునటు తిరుగులాడు చున్నందునఁ దనచెంతకు వచ్చునని పట్టాభిరాముఁడు కొంతసేపు వేచియుండెను. కాని యామె రానందునఁ దనలో నిట్లు చింతింపఁ జొచ్చెను. హా! లోకమున నుత్తమపురుషు లిల్లాండ్రను బ్రాణ సమముగాఁ బ్రేమింతురుకదా?

నే నధములలో నధముఁడనైన యొకనాఁడైనఁ బ్రీతితో నండఁ జేర్చినది లేనందునఁ నా సతీరత్నము నా చెంతకు రాకున్నదేమో! నేనైన నొకమారు పిలుతునా!'' యని లేచి కూర్చుండి, తన తొల్లిటిచేష్టలన్నియు, మనసుకు రాఁగా, మరల మంచముపైఁ బరుండి, ''హా పట్టాభీ! నీవెంత వెఱ్ఱివాఁడవు! మహా యోగ్యునివలె నిల్లాలిని బిలువనెంచితివి! నీవు నడచిన నడతలకు నీమాటలయందుఁ గను గుడుచు బాలుఁడైనను నమ్మక ముంచఁగలఁడా! లోకమునం దెవఁడైన మాలాలిని నట్టడవిలోఁ జత్రూతితోఁ గొట్టినట్లు వినియున్నావా? అట్టి నీవిపు డిల్లాలిని బిలచిన నామె తలిదండ్రులకు వెఱపు కలుగదా!'' యని తన మనసునకు బుద్ధిఁ జెప్పుకొనుచుఁ దన యజ్ఞానమును దలఁచి పెక్కువిధములఁ జింతించుచుఁ గన్నీరు విడచుచుండెను.

శోభావతి భోజనముఁ జేసి, మధుసూధనుని నిదురఁ బుచ్చి, మిద్దెమీఁది కరిగి, చింతాక్రాంతుఁడై కన్నీటితోఁ బవళించియుండిన భర్తను జూచి, ఏమియుఁ దోఁచక నిర్విణ్ణయై, కొంతసేపు నిలిచియుండి, తరువాత దీనవదనయై, పతిపాదములం బట్టుకొని, ''జీవితేశ్వరా! తమ నయనములనుండి జలంబులు దొఱఁగుటకేమి గారణము? మన యింటియొద్ద నెవరికేని జబ్బుగనున్నదా? లేక యనుదిన మింతకాలమునకుఁ బరమశివునివలె విచ్చేసిన యల్లుఁడనియెంచక మా తలిదండ్రు లేమైన గౌరవలోపముఁ జేసిరా? అది యుఁగాకున్న నీ తెలివిమాలిన మీ సేవకురాలియం దేదేని దోషమున్న దనుకొనెదరా!'' అని యశ్రుపూరితలోచనయై వినయముతో నడిగెను. అడుగుదమ్ములఁబట్టి దుఃఖాశ్రువులతో వేఁడుకొనుచున్న దన యిల్లాలిని జూచి, తన చింత మఱింతయగుటయుఁ బెగ్గడిలి పట్టాభిరాముఁడు చివుక్కున లేచి, భార్యను సత్యాదరముతోఁ దగ్గఱఁగూ

ర్చుండఁ బెట్టుకొని, "నా వివేకచూడామణీ! భూతభవిష్యద్వర్తమానములయం దెప్పుడును, నీయం దేలోపముండదని నొక్కి చెప్పఁగలను గాని, పుంటిలోఁ బుడక గ్రుచ్చినట్లు తెలివిలేక నిను బెట్టిన పాట్లకు వ్రణమైయున్న మనస్సుగలవాఁడ నగుటచే, నీవు దోషివని పలుమా రనుటచే, నామన స్సేర్వజాలదు. కావున నీకమీఁదనట్లనఁ బోకుము' అని నిను బ్రతిమాలుకొనదను పాపము' నీ తలిదండ్రులు నను జూచి, పెన్నిధిఁగన్న పేదలచందంబున నున్నవారు. సుగుణపుంజమా! అంధుఁడనై నీవంటి చక్కని బొమ్మను మక్కువతో నేలక రూపము నందును, గుణము నందును గూడ, నధములగు వేశ్యల మెప్పించుటకై నిను గాసిపెట్టుట తలఁచి తలఁచి చింతించితిని కాని, యెవరియం దేమాత్రము తప్పులే"దని చెప్పుచుఁ గన్నీటిచేఁ దన సతి శిరమును దడపుచుండెను.

తనపై నమితానురాగముచే వాపోవుచున్న పెనిమిటిని జూడఁ జాలక, శోభావతి యశ్రువు లొలికించుచుఁ దన పైఁటచెఱఁగున బతి నేత్రములం దుడిచి, యతని గడ్డముఁబట్టుకొని, "నా జీవితేశ్వరా! నా పూర్వజన్మమునఁ బార్వతీశ్వరులకు మేటిపూజ లొనర్చియు, దానియం దేదో లోపము కలుగుటచే నుత్తమ పురుషులును, దయామయులునగు దమ దాసినయ్యు, నా పూర్వకర్మమువలనఁ దమమున్నవవడసి తమ కుపచారముల నొనర్చి, కృతార్థతఁ జెందలేక యుంటిని కాని, తాము మనఃపూర్వకముగఁ జేసిన దేదియు లేదు. కాఁబట్టి జరిగిన దానిని గుఱించి పలుమారు దుఃఖింపవల"దని బ్రతిమాలుకొనెను.

సతి దన్ను బ్రతిమాలుచుండఁ దానును నామెగడ్డముఁబట్టుకొని "నా మానధనమా! యుత్తమచరితవు కాఁబట్టి, నీవు మరచితివి కాని, పాపచింతగల నేను పాషాణహృదయుఁడనై, తలిదండ్రుల

గారాబు బిడ్డవనియైనను, నబలవనియైనను, జాలాలివనియైనను, నేదియుఁ దలఁపక, కటికచీఁకటిలో నట్టడవిని నిన్ను జట్రాతితోఁ గొట్టుటయే కాక, నీగతిఁ తిరిగియైన జూడక, వచ్చితినికదా? నీవేమి యడలితివో! బడలితివో. ఆ యూరు గాక యింకొకయూరై యుండి, నీవారిచెంతఁ జేరకున్న నీ గతి యేమై యుండును? ఇట్టి చక్కెర బొమ్మను నాపాపపు కనులతోఁ జూడఁగలుగు భాగ్యము నాకు లభించునా? అవియన్నియు నిపుడు జరిగినట్లు నా మనమున సదా బాధించుచు మరపునకు రాకున్నవి నే నేమి చేయుదు" నని చింతిల్లుచుండ, శోభావతి కేమియు దోఁచక నతని చేతులను బట్టుకొని, "మనోనాయకా! పోనిండు. నేఁడు మొదలెన్నఁడును జరిగిపోయినదానిని గుఱించి తలఁపఁ బోకుడు, నాపై దయయుంచి మరచిపొండు. ఇట్లు తలఁచితలఁచి వాపోవుచున్న నిఁక నా మనమున బెంగగలిగి దానిమూలమునఁ దొల్లిటివలె మంచముఁ బట్టవలసినదాన నగుదును. నా మీఁద దయయుంచి మరచి పొండు లేకున్న నాపై నానయున్న" దని యొట్టుఁబెట్టి యతని చింత మానకున్న నెట్లని యతని మనసును మార్పఁదలఁచి ముసిముసి నగవులతోఁ బెనిమిటిని రంజింపుచుఁ "నాథా! యిది యుండనిండు. తమ యర్ధాంగి వియోగమును సహింపఁజాలక తామై వచ్చితిరా? లేక మామయ్యగారంపిరా?" యని యడిగెను.

"నా బహిఃప్రాణమా! నా వియోగమునకు వెఱచి నీకు బోనిచ్చ లేకున్నను, నీ కారోగ్యము కలుగఁ దలఁచి, నేన వెఱ్ఱివాఁడనై నిను బొమ్మని సెలవిచ్చి యంపితిని కాని, నేను బయటినుండి వచ్చునప్పటికి నీవు లేనియిల్లరణ్యసమానమై దోఁచి మనమున కొంత జుగుప్స గలిగె, దిన మొకయుగముగ నెట్లెట్లో పరితపించుచు, వారమ్ము స

నోటి కన్నము సహింపక, కనులకు నిదురపట్టక, నా యర్ధాంగలక్ష్మి నేల మూఢుఁడనై వెళ్లనిచ్చితినని నా మందబుద్ధిని నిందించుకొనుచు, కనులకుఁ జీకట్లు కలుగుచుండ, నెవరితోను చెప్పుకొనుటకు లేక, తుదకు నన్నంధకారకూపము నుండి గట్టెక్కించిన వేశ్యరత్నముతోఁ జెప్పిన నామె సదుపాయముఁ జెప్పఁగని ధైర్యముఁ దెచ్చుకొని, రాగమంజరియొద్దకు వెళ్ళి, చెప్పుకొనఁగా నది నవ్వి 'వెఱ్ఱిబ్రాహ్మణుఁడా! నీకును లోకజ్ఞానము కలిగినదా? ఇప్పుడు మిమ్ముఁ జూచి నాకు సంతోషము కలిగినది. మీరు వెళ్ళి, మా యక్కయ్యను బిడ్డలను సంతోషముగఁ జూచిరం'డని చెప్పెను. నా తండ్రిగారు విడిచిన నేమందురో యని నేనధైర్యపడఁగ 'నాయన మీవలె మూర్ఖమతి కారు లోకుల వలెఁ దన కుమారుఁడు సుగుణసుందరియను భార్యతో నెప్పుడు చక్కగఁ గాపురము సేయునాయని, వేయివేల్పులకు మ్రొక్కుకొనుచుండెను. భార్యను జూడవలెనన్న మీ తండ్రి చాల సంతసించు'నని ధైర్యముఁ జెప్పినది. తరువాతఁ బిన్నమ్మతోఁ జెప్పిన నామె చాల సంతసించి, తండ్రినడిగి పోయిర"మ్మని చెప్పెను.

అతని మాటలకు శోభావతి యులికిపడి, "యట్లయిన మామయ్యగారి కంటఁ బడకయే వచ్చితిరా!" యని యడిగెను. పట్టాభిరాముఁడు "నా ముద్దులగుమ్మా! యింక మీఁద నట్లు నడచుకొందు ననుకొంటివా? సుభద్రమ్మ చెప్పిన తరువాత, తండ్రిగారిదగ్గఱకు వెళ్ళి, 'రేపు మఱునాఁడు సెలవు, కావునఁ గుంభకోణమునకు వెళ్ళివచ్చెద'నని యడిగితిని. వారు నా మాటలకుఁ జాల సంతసమున నవ్వుచు, 'నంతటి గుణవంతుఁడ వైనావురా! నా కంటియ చాలును కాని, తెలివిలేనిపనులు చేసి మునుపటివలె నపకీర్తిఁ దెచ్చిపెట్టక, జాగ్రత్తగ వెళ్ళిర'మ్మని చెప్పిరి ఇందువదనా!

నీ ముఖదర్శనము లేక నే నీకమీఁద నరనిముసమైన నుండలేను. రేపే వెళ్ళవలసియున్నది కావున, నా కిపుడే దిగులుపుట్టుచున్నది. చంద్రుని బాసిన చకోరమువలె, నిను బాసి యూరికివెళ్ళి, నే నెట్లు మనఁగలను?" అని ముఖము వెలవెలబోవఁ దల వంచుకొనెను.

పతి నెడఁబాయలేక, శోభావతి "నా దైవమా! మిముఁ బాసి నేనుమాత్రము నిలువఁగలనని మీరనుకొనెదరా? మీయాజ్ఞ నుల్లఘింపలేకయు, నేను రానన్న నా తల్లిమనసు చిన్నపోవుననియు, వచ్చితినిగాని యీ పండ్రెండు దినములనుండియు నా శరీరము దూరమున నున్నను, నా మనస్సు తమ దివ్య పాదారవిందములు పిండి గాకున్నది. మీరు లేనిచో ఎట్టి సుందర మందిరములైనను, నా కరణ్యసమానములే. ఎట్టి రుచ్యములైన భక్ష్యభోజ్యములైనను, నాకు విషసమానములే. మిముఁబాసి నే నుండఁజాలను. నేనును మీతోడనే వచ్చెద" ననెను.

పక్షిగిరాముఁడు—(ప్రియసతి మాటలకు సంతసించి, యానంద బాష్పములం దులకించుచు) నా భాగ్యరాశీ! నేను టక్కరినేకాని, నీ మాటలయందు దాపంతేని యసత్య ముండదు. అందులకు నీ నడ్వర్తనమే నిదర్శనముగదా? ఆనాఁడు పసిపిల్లవయ్యు మా తండ్రి గారు పిలచియుఁ బిలువకయే మాయింట వివాహమును నెపమునవచ్చి, నే మూఢమతినై చేసిన ఘాతుక కృత్యములనెల్ల నోర్పికతో నోర్చుకొనుచు, నాయింట నుండవలెనన్న కోరికయే కాని, యప్పుడైనను బుట్టింటికి రావలయునన్న మనసు లేని నీకు నిపుడిట మనస్సుండదని వేఱుగఁ జెప్పవలయునా? ఐనను సంతజబ్బులోఁ బడి లేచి యిన్నాళ్ళ కరుదుగ వచ్చినావనియు, శరీరమున కోపిక కలుగ లేదనియు, నీ తలిదండ్రులంపరేమోయనియు సందియము కలుగుచున్నది.

శోభావతి—నాథా! మీరట్లనుకొనవలదు. నామనసు చిన్న పోవునని నా మాటకు వారడ్డముఁ జెప్పరు. నాలుగు సంవత్సరముల నాఁడు నేను సుబ్బరాయునివెంటఁ బయలుదేఱిన వారు దిగులుపడ రేకాని, నా మనసుకు నొప్పి కలుగునని యడ్డముఁ జెప్పనివారు సకల సౌభాగ్యములతోఁ దులఁదూఁగుచున్న నన్నిప్పుడేల పంపరు?

తేనెలొలుకఁ జిలుకవలెఁ బలుకుచున్న సుందరాంగిని జూచి, పట్టాభిరాముఁడు "నా శుకవాణీ! నా భాగ్యవశమునఁ ద్రిలోకసుందరి వగు సుగుణరత్నము లభించియు, నా దరిద్రదినముల యందు నినుగూడి సకల సుఖముల ననుభవింపలేక, పలుగాకినై యున్నాఁ నుంటిని కాని, యిఁకమీఁదఁ దేనెలొలుకు నీ మధురవాక్యములు వినకయే, పూర్ణచంద్రుని బురడించు వెన్నెలలు విరియుచున్న నీ ముద్దుమోముఁ జూడక యర్ధనిమిషమైన నిలువనోప"నని చెప్పెను. బహుకాలవియోగము దీఱ వారిర్వురు ముచ్చటించుకొనుచు సుఖించిరి.

మఱుదినము మధ్యాహ్నము భోజనముఁ జేసి పట్టాభిరాముఁడు తాంబూలము వేసికొనుచుఁ దనదారపుత్రుల నంపుమని మామగారి నడుగ నోరెత్తుచు, జంకుచే నూరకుండుచుఁ గొంతసేపటికి ధైర్యముఁ దెచ్చుకొని మామగారి ముఖమున దృష్టి నిలిపి, తన మనసున నున్నది చెప్పఁబోయి మరల సిగ్గుచేఁ దల వంచుకొని రేపు బడికివెళ్ళవలయును, కావున నేఁడురాత్రి యూరికి వెళ్ళవలసియున్నది. శోభావతిని, బిల్లలను గూడఁ బంపెదరా?"యని యడిగెను. అల్లుని మాటలకు రామచంద్రయ్య తనలో నల్లుఁడు నవసరముగ వెళ్ళవలసినది నిజమే కాని, కుమార్తెను బిడ్డల నంపుట కిష్టము లేకయుఁ, బంపకున్న లోకులవలెఁ గాక, యెన్నియేని యవస్థలఁబడి, యెప్పుడెప్పుడే యంకురించుచుండిన యనురాగము కావున, విడిచియుండుట కష్టమని

యు, ప్రథమమున శోభావతియే యిట నుండుటకు సమ్మతింపదనియు
బలువిధముల యోజించుకొనుచు, నల్లుని జూచి, "నాయనా! జబ్బు
పడిన బిడ్డ కావున, కొంచ మోపిక కలిగిన తరువాతఁ బంపవలయు
నని మా కోరిక; తరువాత మీ యిష్టము." అని ప్రత్యుత్తర
మిచ్చెను. పట్టాభిరాముఁడు చిఱునవ్వుతో "మరల నెప్పటికైన రా
వలయునన్నఁ గష్టముకదా? మీకు మనసు నిలచుట కష్టమే కాని,
మా పినతల్లి శ్రద్ధతోఁ జూచుకొనునని మీకుఁ దెల్లమే కదా!"
యనెను

వారి మాటలు విని కల్యాణి, తలుపుచాటున నిలచి, "యిం
కొకమాస ముంచుకొని, కొంత శక్తి కలిగిన తరువాతఁ బంపెదము.
పాపము! చిన్నవదినగా రొక్కతెయును శోభావతిని, బిల్లలను గూడ
నెట్లు చూచుకొనఁగలుగును? మీసొత్తును మీకొంపక మా యింట
నెన్నాళ్లుంచుకొందుము." అని ప్రత్యుత్తరమిచ్చెను.

శోభావతి—[పెనిమిటిమనస్సెఱిఁగినది కాన తల్లిని జూచి]
అమ్మా! యిష్టమునకుఁ గష్టము లేదుకదా! ఆమె నాయందలిప్రీతి
కలది మేమేకాదు, ఇంకను నలుగురు బిడ్డలున్నను, నోపికతోఁ
జూచుకొనును. నీ కాచింత యక్కఱలేదు

కల్యాణి—తల్లీ! పిల్లల నోదార్చుటకైన నీ కోపిక చాలదని
యంటినిగాని నీయిష్టమున కడ్డు చెప్పను.

శోభావతి—[తలిదండ్రుల ముఖముఁజూచి, నవ్వుచు] మామ
య్యగారు బిడ్డలపైఁ జాల భ్రమఁగొని యున్నారట.

కల్యాణి—(నవ్వుచు) తల్లీ! బరువు పెద్దవారిపైఁ బెట్టు
కున్నఁ బిల్లలుగన్న తండ్రిగారు విడచియుండలేరని చెప్పరాదా?

కల్యాణి మాటలకు శోభావతియుఁ, బట్టాభిరాముఁడును

నొకరినొకరు చూచుకొనుచు నవ్వుచుండిరి. రామచంద్రయ్యయుఁ, గల్యాణియు వారిని జూచి, "మా భాగ్య మిపుడుకదా పండెను! మా నేత్రము లిపుడుకదా సఫలత నొందె"నని మనసులో ననుకొనుచుఁ బరమానందభరితులైరి.

అత్తమామలు నవ్వుకొనుచుండఁ బట్టాభిరాముఁడు సిగ్గుచేఁ దల వంచుకొనియుండుటఁ జూచి, శోభావతి "నాయనా! యేకార్యమునకును బెద్దవారిని ముందుఁబెట్టక మాటలాడిన మర్యాద కాదు కదా!" యనెను. పట్టాభిరాముఁడు "మామయ్యగారూ! పెద్దలపేరుఁ జెప్పక మీ కన్నబిడ్డను బంపుఁడని, నే నంత స్వతంత్రముగ మిమ్ము నడుగనచ్చునా!" యనెను. రామచంద్రయ్య తన గారాబు పుత్రి యొక్కయు, నల్లునియొక్కయు ముచ్చటలకు నంధునకు నేత్రములు గలిగినట్లు సంతసించుచు, నల్లునిఁజూచి "నాయనా! మా శోభావతిని గనినందుకు నే నిపుడుకదా భాగ్యవంతుఁడనైతి" నని పట్టరాని సంతోషమున యానందాశ్రు లొలికించుచుండెను. పట్టాభిరాముఁడు తనలో "నాహా! నా తెలివితేమిచే నుత్తమాంగనయైన కులసతిని గ్రూరముగఁజూచి, యెందఱికి మనోవ్యథఁగలిగించితి"నని వగచుచు నేమియుఁ బలుకక క్రిందఁ జూచుచుండెను.

రామచంద్రయ్య—[అల్లుఁడు చిన్నపోయియుండుటఁ జూచి, యతని నెట్లయిన బలుకరింపఁ దలఁచి] నాయనా! యట్లయిన నేఁడే వెళ్లవలయునా?

పట్టాభిరాముఁడు—అవును. నేటి రాత్రికే పోయిన రేపు బడికి వెళ్ళవచ్చును.

రామచంద్రయ్య—రేపు సోమవారము కనుక వెళ్లుటకు బాగుగనున్నది.

కల్యాణి—ఆదివారము వ్యాధి యని పెద్దలు చెప్పుదురు. శోభావతి మొదటనే జబ్బుపడినది కదా!

అత్తమామల యాజ్ఞను బట్టాభిరాముఁ డంగీకరించి భార్యను జూచి, "పెద్దవారిమాట జవదాఁటఁగూడదు కనుక నల్లి రేపు వెళ్లెద"మనెను.

అల్లుఁడు సత్ప్రవర్తనుఁడైనందున మునుపటివలెఁ గూఁతురు వెళ్లుటకు మనసున వెంగలేక యానందమున నుండుటచేఁ గల్యాణి యారాత్రియంతయుఁ నిదురింపక పిండివంటలుచేసి తెల్లవారునప్పటికిఁ గూరగాయలు, పచ్చళ్లు మొదలగు వ్యంజనములతో వంట సిద్ధముచేసి యల్లునకుఁ గొమార్తెకు స్నానభోజనములు చేయించెను.

లోకమున నే బీదవారైనను బదులైనఁ దీసి యల్లునకు బహుమతులు సేయుచుండ, వివాహమునాఁడు వచ్చిపోయిన దాదిగ నిన్నాళ్ళకరుదుగ వచ్చిన యల్లునకు సేయుట విచిత్రముకాదుగదా? రామచంద్రయ్య మహదానందముతో బీరువఁ దెఱచి తన సరుకులలో మేలైనవిగఁ జూచి జరీపంచెల చాపును, జరీ రుమాలయుఁ గాశ్మీరపు జరీశాలువయుఁ దీసి, యొక పళ్లెమున నుంచి, యన్నిటికిని నంచులయందుఁ గుంకుమము రాచి, పూవులు, తాంబూలముతోఁ గూడ నల్లునిముందుఁ బెట్టెను.

ఏదేని పండుగలైన మామగారిపిలుపున వచ్చి మర్యాద లందుకొనవలెనుగాని, తానై చెప్పిచూపక వచ్చి యిట్లు బహుమతు లందుకొనుట యుచితముకాదని పట్టాభిరాముఁడెంచి, "మామగారూ! ఏల యింత యాధిక్యముఁ జేయుచున్నారు? మీ వర్తకమునంతయు నాకే యుపయోగపరచినట్లున్నదే! మఱియొకసారి వచ్చినపుడు మీమాట త్రోసిపుచ్చక యిచ్చినవన్నియుఁ గైకొనెద. ఈసారి యుండ నిం"డనెను.

అల్లునిమాటలు విని, రామచంద్రయ్య యానందాశ్రువు లతో నల్లుని గద్దముం బట్టుకొని, "నాయనా! లోకమునం బుణ్యాత్ము లన్ని పండుగులకును నల్లుండ్రను దోడితెచ్చి విందులు, వినోదములు, బహుమతులు చేయుచుందురుకాని, నా బీదయింటి కేనాండైన మీరు వచ్చి యొక తాంబూలమునైనం జేతం బట్టినవారు కారుగదా!, ఇంతకాలమునకు నాభాగ్యము పండి నేనును నలువురిలో మనుష్యుండనైనందుల కిదియొక బహుమతి కాదు. కాంబట్టి మామీంద దయయుంచి వీనిని గైకొని నన్ను గౌరవింపం గోరెద"నని ప్రతిమాలుకొనెను

వీరిమాటలు వినుచుండిన కల్యాణి, తలుపుచాటున నిలచి, యల్లుని జూచి "బీదలమగు మేము సంపన్నులకుం దగినట్లు నడువ శక్తులముకాము; కనుక మేమిచ్చినది స్వల్పమయినను గొప్పగ మనసున నుంచి యంగీకరింపం గోరుచున్నా" మనెను. అత్తగారును, మామగారును కూడ దీనులవలెం బ్రార్థించుచుండ పట్టాభిరాముండు వారిమాటం ద్రోసివేయలేక, పళ్లెముం దీసికొని, క్రొత్త బట్టలం ధరించెను.

కల్యాణియొక్క విలువగల పట్టుచీరయు, రవికయును సాధారణమైన చీరలు, రవికలును, హేమవల్లికై బట్టు పరికిణెలును మధుసూధనునకై నానా విధముల చొక్కములును పసుపు, కుంకుమమును, తాంబూలమును బళ్లెరమునిండ నుంచి కొమరిత కిచ్చెను, శోభావతి తల్లి యిచ్చినవి యందుకొని తానును, బిడ్డలును క్రొత్తబట్టలు ధరించి తక్కినవి పెట్టెయందుంచుకొనెను. కల్యాణి పళ్లెరముం దీసి లోపల నుంచి, "శోభావతీ! పిల్లలకు పరికిణీ లేవేని కావలసినపుడు త్తరమ

ప్రాయుము. తోడనే పంపించెద''నని చెప్పెను.

అత్తగారి మాటలకు పట్టాభిరాముఁడు నవ్వుచు గూఁతురిని జూచి, ''హేమవల్లీ! మీ తాతయ్య వర్తకులై యుండ, వారి సరకు లన్నియు నీవేకదా! ఇఁక నీకు పరికిణీల కేమితక్కువ?'' అని పలికెను అల్లుని మాటలకు నవ్వుచు, రామచంద్రయ్య ''నాయనా! నాకింత భాగ్యము కలుగఁజేసినందులకుఁ బార్వతీపతికి వేయినమస్కారములు చేసెదను. ఎంత ధనవంతులైన నేమి ఫలము? లోకమున నీభాగ్యమున కేకదా యెన్నియో నోములు నోచుకొనుట!'' అని సంతసించు చుండెను.

కల్యాణి యొక పళ్లెరమునఁ బసుపు. కుంకుమమును తాంబూలమును నుంచుకొని వేడుక చూడవచ్చినవారికెల్ల నిచ్చుచుండ, నా దినమున వారియిల్లు శోభనగృహమువలె నుండెను.

మరుదిన ముదయము తొమ్మిదిగంట లగునప్పటికి వీరభద్రుఁడు రెండు బండ్లను దెచ్చి వాకిట నిలిపెను. శోభావతి తలిదండ్రులకు మ్రొక్కఁగ వారు పరమసంతోషమున, ''తల్లీ! దీర్ఘసుమంగలివై పుత్రపుత్రీయుతవై ధనయశస్సంపన్నురాలవై మను!''మని దీవించిరి. పట్టాభిరాముఁ డత్తమామలచెంత ననుజ్ఞ గొని బండి యెక్కను. రామచంద్రయ్య అల్లునితోఁగూడఁ గొమరితను, బిడ్డలను గూర్చుండఁబెట్టి మఱియొక బండియందు మూటల నుంచి, తానును గూర్చుండి రైలుస్టేషనుకు వెళ్ళి, 'టిక్కెట్లు' కొనియిచ్చి, యందరిని బండియెక్కించి తా నింటి కతిప్రయాసముతో వెళ్లెను.

తమకు నోపిక యుండువఱకు శోభావతియు, బిడ్డలును దమ యింట నుండక వెళ్లుచున్నారన్న చింత రామచంద్రయ్యకును. కల్యాణికిని కొంత యుండెనుకాని, మూఁగబిడ్డకు నోరుకలిగి, 'యమ్మా'యని

పిలిచినట్లు, కేవలము పాషాణహృదయుఁడై యున్న యల్లుని కింత మాత్రము దారపుత్రాదులపై ప్రేమ కలిగినదను నానందమున నా చింత వారికంతగఁ దోఁచకుండెను.

లోకమునం దెంతటి యైశ్వర్యవంతులకైనను, తనుకడుపునఁ బుట్టిన బిడ్డ లన్నివిధముల ముచ్చటగనున్న నేకదా సంతోషముకలుగుట? భార్యాపుత్రులతోఁగూడ వచ్చిన కొడుకును జూచి, "భగవంతున కింతమాత్రమునయ కలిగి పట్టాభిరాముని నలువురితోఁ బోటు చేసె"నని, శేషయ్య పరమానందభరితుఁడయ్యెను శోభావతి చంకనున్న బిడ్డను గ్రిందదింపి, మామగారిపాదముల నంటి మ్రొక్కెను.

కొడుకునకుఁ బ్రీతికలిగి, భార్యను,బిడ్డలను దీసికొనివచ్చెనో, లేక శోభావతి తానై వచ్చెనో కనుగొనవలెనని, యెట్లడుగవచ్చునని శేషయ్య కొంతసేపు యోజించుచుండి "శోభావతీ! నీవు చాల బలహీనముగ నుండుటచే,నాలుమాసము లచట నుంచుకొనవలయునని మీ తల్లి యడుగుకొనెను. అట్లుండ నీ వేల కొంపోవు డితివి?" యనెను.

మామగారి ప్రశ్నమున కాయన మనస్సున నేదో సంశయముకలిగెనని యెంచి, శోభావతి చిఱునవ్వుతోఁ దల వంచుకొని "పిల్ల లింట లేకుండుటచే నిల్లు చిన్నపోయియున్నదనియు,నాన్నగారు మిగుల నొప్పిపడుచున్నా"రనియుఁజెప్పిరి అదియునుగాక, నా కిచటఁ జూచుకొనువారు లేకున్నఁగదా యచట నుండవలెను!"అని చెప్పుచు లోపలికి వెళ్లెను. కొడుకు తన మరులు చెప్పుకొన సిగ్గుపడి,యాతని పైఁబెట్టి చెప్పినాఁడనుకొని, కోడలిమాటలకు శేషయ్య చిఱునవ్వు నవ్వుకొనుచుఁ "బెనిమిటియొద్దఁ గష్ట మనుభవించునపుడే పుట్టింటి కరుగవలెనన్న కోరిక లేకుండి జూడవచ్చిన నావెంటఁ బయన

మైనట్టి నీవు వానికి సద్బుద్ధి కలిగియుండ నీవు దుండుపున్నను నుండు దానవు''కావని, తనలో సంతసించుచుండెను. వీరి సందడిఁ దెలిసి, సుభద్రమ్మ పఱుగునవచ్చి, కోడలినిజూచి శోభావతీ! నీ శరీర మారోగ్యముగ నున్నదా!'' అని యడిగి చంకనున్న బిడ్డను దీసికొని, ముద్దులాడుచుండెను.

శోభావతి ''అత్తయ్యా! మీదయవలన నారోగ్యమే''యని చెప్పి లోపలికి వెళ్లుచుండ, మీనాక్షి వేవేగ వచ్చి, సంతోషము తోఁ దోడికోడలిని ''కాళ్లు కడుగుకొందువు రమ్ము.'' అనుచుదొడ్డి లోనికి దీసికొని వెళ్ళి, యామెను గౌఁగిలించుకొని, ''అక్కయ్యా నీవులేనిది యిల్లు చిన్నపోయియుండినది. అది యటుండనిమ్ము. మా బావగారు నీపై మరులు కొని నిద్రాహారములు లేక యెంతగాఁ దల్లడిల్లిపోయిరో! '' అని నవ్వుచుండెను. శోభావతి సిగ్గుచేఁ దల వంచుకొని, ''సోదరీ! నీ కన్నియుఁ బరిహాసములే!''యని నవ్వుచు సీవలకు వచ్చెను.

బండిలోనున్న మూటలన్నియు లోపలికిఁ దెప్పించి, బండివానికి డబ్బు లిచ్చిపంపివేసి, పట్టాభిరాముఁడు స్నానభోజనములను దీర్చుకొని బయటికి వెళ్లెను.

''పుట్టుకతోఁ బుట్టిన బుద్ధి పుడకలతోఁ బెట్టినను బోవ'' దన్నట్లు కొడుకును, గోడలును,బిడ్డలును నల్లారుముద్దుగాఁ గాపురము సేయుచుండుట చూడలేక, జానకమ్మ, కోడలు పందివలె పిల్లలఁగను టయే కాని పెద్దలున్నారని హద్దుపద్దులేక, మగనితో మాటలాడు చున్నదనియుఁ, దానెన్ని చీవాట్లుపెట్టినను సిగ్గెగ్గులేదనియు, వాడుక చొప్పున చాడీలు చెప్పుచు, బిడ్డలతోఁగూడఁ దగవు లాడుచునే యుండెను.

ఒకదినము రాత్రి శేషయ్య భోజనముఁజేసి, హేమవల్లిని ప్రక్కన బరుండఁబెట్టుకొని, కబురులు చెప్పుచు నిదురించెను. అదిన మెందు వలననో మధుసూధనుఁడొకటే యేడుపుగా, నెవ్వరోదార్చిన ననిలువక పోరుపెట్టుకొనియుండెను. కోడలు జబ్బుపడి లేచినది మొద లామెకు నోపిక కలుగవలయునని సుభద్రమ్మ శోభావతి నెంతో ప్రేమతోఁ జూచుకొనుచు, వేళ తప్పక స్నానభోజనములు చేయించుచు, నిదురలేకున్న మరల నామెకు జబ్బు గలుగఁబోయెనని రాత్రివేళలఁ బిల్లలు లేచియేడ్చినఁ దానే యోదార్చి నిద్రఁబుచ్చుచుండెను.

ఆ వేళఁ బిల్లవాఁ డేడ్చుచుండినందున నామె మీనాక్షిని వంటఁజేయుమని చెప్పి, తా నీవలనుండి బిడ్డ నోదార్చుచుండి, వంట యయినపిదప మడుఁగుఁగట్టుకొని కొడుకులకు వడ్డించెను. అన్నదమ్ము లిద్దరును భోజనము సేయుచుండిరి. సుభద్రమ్మ పెద్ద కొడుకును జూచి, "ఓరీ! నాయనా! నీవు లేచి పిల్లవానిని గొంతసేపెత్తుకొనుము వాఁడెందుకు నీవేళఁ బోరు పెట్టుచున్నాఁడు! వేళ తప్పి యన్నముఁదినిన దానికి శరీరమునఁబట్టదు." అనెను. పట్టాభిరాముఁ డట్లే యని, వేగిరముగ లేచి చేయికడుగుకొని పిల్లవానిని దీసికొనెను.

సుబ్బరాయుఁడు—(భోజనము సేయుచు) పిన్నమ్మా! సంవత్సరమునాటి నాప్రతిన నేఁడు నెఱవేర్చుకొనెదను.

సుభద్రమ్మ—నీ ప్రతిన యేమిరా?

సుబ్బరాయుఁడు—[నవ్వుచు] నీ కోడలి నడుగుము.

సుభద్రమ్మ—(చిన్నకోడలినిచూచి) ఏమే! వానిగొడవ?

మీనాక్షి—నవ్వుచు, వదినెగారిని జల్లగాఁ జూచువరకు నన్నగారితో మాటాడనని యొట్టుఁబెట్టుకొనిరి.

సుభద్రమ్మ—ఇదేనా! ఏమోయనుకొంటినే! ఓరీ! వాఁడు వాకిట నున్నాఁడు వినఁబోవుననుమా!

సుబ్బరాయుఁడు—విన్న నేమి? నీ కొడుకునకు నీవు భయ పడవలెనుగాని, న్యాయమునకు నా కేమి భయము? అని సుబ్బరా యుఁడు చేయికడుగుకొని, యన్నగారియొద్దకు వెళ్ళి, "యన్నయ్యా! యీ నడుమ నీ వగుపడకున్న నెక్కడికో వెళ్ళినావనుకొంటి" ననెను.

"ఇటీవల ననుజూచినఁ బెడమొగముఁ బెట్టుకొనువాఁడు నేఁ డేదో కారణమునుబట్టి నన్ను బలుకరించుచున్నాఁ"డని, పట్టాభిరా ముఁ డనుకొని, "యేమిరా! యీనడుమ ననేల, చాలదినములు నుండియు నీవు నన్ను చూచుటయే లేదే!" అనెను

సుబ్బరాయుఁడు—ఔను. నీవన్నది నిజమే. భగవంతుఁడు దయయుంచి, నా పంతముఁ జెల్లించెను కావున నీ వేళ మాటలాడితిని కాని, లేకున్న నిప్పుడు నంతియే యనుకొనుము,

పట్టాభిరాముఁడు—అదేమి పంతమురా?

సుబ్బరాయుఁడు—ఏమో పిన్నమ్మనడిగి తెలిసికొనుము. (అని చెప్పి నవ్వుచు వెళ్లెను)

తమ్ముని మాటలకుఁ దానును నవ్వుకొనుచు, లోపలికి వెళ్ళి సుభద్రమ్మను జూచి, "సుబ్బరాయునిమాట లేమి!" యని యడిగెను. ఆమె నవ్వుచు, సుబ్బరాయుఁడు తనతో నన్నది చెప్పఁ దన కంటెఁ జిన్నవాఁడు తన్ను బరిహాసించినందుకు సిగ్గుచేఁ గొంతసేపు తల వంచుకొని క్రిందుఁజూచుచుండి, పినతల్లిని జూచి, "వీఁడేనా నాకుఁజెప్పవలసినవాఁడు!" అనెను. సుభద్రమ్మ "నాయన! కోపపడకుము. వాఁడు నీకంటెఁ బసివాఁడేయైనను, ప్రీతితోఁ జెప్పిన మాట యందుఁ దప్పు వెదక కూడదు." అని చెప్పి శాంతపఱచెను. ఇట్లు

మాటలాడుకొనుచు, శోభావతి భోజనముఁజేసి లేవఁగానే, బిడ్డను జేతికిచ్చి, పట్టాభిరాముఁడు మిద్దెమీఁదకి వెళ్లెను. సుభద్రమ్మ తన పనులన్నియుఁ దీర్చుకొని, బిడ్డకు దృష్టిఁదీసి, హారతిఁజుట్టి, వసగంధ ముఁ దీసి దేహమాద్యంతముఁ బూసి కొంతసేపొడిలోఁ బెట్టుకొని నిద్రఁబుచ్చి తరువాతఁ దాను పరుండెను.

కాలము వ్యతిరిక్తముగ నున్నందుచే శోభావతి కొంత కష్ట మనుభవింపవలసి వచ్చినను, నోర్పుగలిగి యన్నిటిని భరించి, యిప్పు డన్నివిధముల సుఖసంతోషముల ననుభవింపుచుండెను. ముద్దులు మూటఁగట్టెడు బిడ్డలతోఁగూడఁ గలహము లాడుచు, జానకమ్మ యొకతెమాత్రమేదో యల్లరిఁ జేయుచున్నను దక్కినవారందఱు నైకమత్యముగలిగి, ముసలామె మాటలను బాటిసేయకయుండిరి

కర్మవశమున దాసికులమునఁ బుట్టినను, సద్బుద్ధికలది కాన, రాగమంజరి పట్టాభిరామునివలన నొకసారి మోసపోయినను, దన ప్రతిజ్ఞాభంగము గలిగించుకొనక, బహుజాగ్రత్తతో మెలఁగుచు, నుత్తమాంగనల దర్శనముచేఁ దన పాపము పరిహారమై జన్మపావ నము గలుగునని యెంచి, యప్పుడప్పుడు శోభావతీదర్శనముఁ జేసి కొని పోవుచుండెను. శోభావతియు, రాగమంజరి చేసిన యుపకార మును మఱువక, సోదరీప్రీతిగలదై పలుమాఱు రాగమంజరిని పిలిపించి గౌరవముగ నాదరించి పంపుచుండెను.

మధుసూధనునకు తరువాత శోభావతికిఁ బ్రవాళవల్లి యను కూఁతురును, విశ్వనాధుఁడను కొడుకును బుట్టిరి. లోకమునఁ గుడువ గంజియుఁ గట్టఁ బట్టయుఁ లేనివారికిఁగూడఁ బిల్లలన్న వెగటు లేదు కదా! అట్లుండ, శోభావతి నక్షత్రములవంటి బిడ్డలు గన్న నెవరికి వెగటుండును?

బిడ్డల నొరులకిచ్చుటకు శేషయ్య కిష్టములేకున్నను, రామచంద్రయ్యకు మగపిల్లవాఁడు లేనికారణమున దౌహిత్రుఁడగుటచే, విశ్వనాథుని స్వీకరణముగ నిచ్చిరి. శేషయ్యకు వార్ధక్యముచే నోపిక తగ్గినందున, నగరునందలి తనపనికి సుబ్బరాయునిఁ గుదిర్చెను.

శోభావతి కష్టమనుభవించినపు డొకరీతియు, సుఖము గలిగినపు డొకరీతియుఁ గాక, యెప్పుడు నొకేస్వభావము గలదై, పతియందు దైవభక్తియుఁ, బెద్దలయందు భక్తివినయములును, బిన్నలయందుఁ బుత్రవాత్సల్యమును గలిగి, యందఱకును మనఃప్రీతిగ నడచుకొనుచు, లోకమం దెల్లవారిచే నుత్తమాంగన యనిపించుకొనుచు, సకలైశ్వర్యవతియై చిరకాలము ముచ్చటగఁ గాపురము సేయుచుండెను.

పట్టాభిరాముఁడు తన చిన్ననాటి నడతలన్నియు మూటఁగట్టి గంగలో గలిపినవాఁడై, యెపుడైనఁ దానునడచిన వెఱ్ఱిచేష్టలు దలఁచి ముఖముఁ జిన్నపుచ్చుకొనినను, దనయుత్తమసతి బోధనములచే దానిని మఱచుచు, నామె సద్వర్తనమునకుఁ దనలో సంతసింపుచు, నధికానురాగము గలిగి, ప్రియురాలి నాదరించుచు, బిడ్డలను లాలించి ప్రేమించుచు సద్వర్తనుఁడై చరించుచు యశస్సంపాదనముఁ జేసి కృతకృత్యుఁడయ్యెను.

    

సమాప్తము.

PRINTED AT THE JANAKI PRESS, PRODDUTUR.